# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 3 హైదరాబాద్ 92 మార్చ్ 2009 పేజీలు : 60 రు. 10

* ఫోకస్ : రాంమనోహర్ లోహియాపై నాలుగు వ్యాసాలు
* కేంద్ర బడ్జెట్
* ఎన్‌కౌంటర్లపై చరిత్రాత్మక తీర్పు
* ఎన్నికల చక్రబంధంలో తెలంగాణ
* సల్వాజుడుమా? సర్కారీ జులుమా?
* శాస్త్రంగా రాజకీయార్థిక దృక్పథం

## వీక్షణానికి మీ చేయూతనందించండి !

ఆరు సంవత్సరాలుగా ప్రతినెలా మీతో సంభాషిస్తూ, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపై కొత్త ఆలోచనలను, వైవిధ్యపూరితమైన చర్చను ప్రోత్సహిస్తూ, మీ ఆదరణ చూరగొంటూ వస్తున్న వీక్షణం తన ఆర్థికస్థితిని కూడ మీతో పంచుకోదలచుకుంటున్నది.

వీక్షణం ఇప్పుడు నడుస్తున్న పద్ధతిలో, పెరుగుతున్న న్యూస్ ప్రింట్ ధరలు, ప్రింటింగ్ ఖర్చులు, కార్యాలయ నిర్వహణ, పోస్టింగ్ వంటి ఖర్చులన్నీ కలుపుకుంటే ఒక్కొక్క ప్రతికి ఉత్పత్తివ్యయం రు. 14 గా ఉంటున్నది. కాగా ప్రతి సంచికకూ చందాదారులు చెల్లించేది రు. 10. అందులో పోస్టేజి ఖర్చులు మినహాయిస్తే వాస్తవంగా చెల్లిస్తున్నది రు. 9 కన్న తక్కువ. పత్రిక విడిప్రతిని దుకాణాలలో కొనుక్కునేవారు రు. 10 చెల్లించి కొనుక్కున్నపటికీ, ఏజెంట్ కమిషన్ పోగా వారి నుంచి పత్రికకు అందేది ఒక్కొక్క ప్రతికి రు. 6 మాత్రమే. అంటే పత్రిక ఒక్కొక్క ప్రతి చందాదారుల విషయంలో రు. 5 లోటుతో, విడిప్రతి కొనుగోలుదారుల విషయంలో రు. 8 లోటుతో నడుస్తున్నదన్నమాట. పత్రిక ఎన్ని ప్రతులు ఎక్కువ అమ్మకమైతే అంత ఎక్కువగా లోటు పెరుగుతుందన్నమాట. ప్రస్తుతానికి ప్రతినెలా రు. 25,000 లోటుతో పత్రిక నడుస్తున్నది. ఏ పత్రిక అయినా తన ఉత్పత్తి వ్యయాన్నంతా పాఠకులనుంచే రాబట్టడం జరగదు. ఉత్పత్తివ్యయంలో కొంతభాగాన్ని ధరగా నిర్ణయించి మిగిలిన భాగాన్ని వ్యాపార ప్రకటనల రూపంలో సేకరించడం ఆనవాయితీ. ఎన్ని ఖర్చులు పెరిగినా గత నాలుగు సంవత్సరాలుగా ధరనుగాని, వార్షిక చందాను గాని పెంచలేదని, వీక్షణంకు ఇప్పటివరకూ ప్రభుత్వ ప్రకటన తప్ప ఇతర ప్రకటనలు కూడా ఎక్కువగా రావడం లేదని మీకు తెలుసు. వీక్షణం ను నిర్వహిస్తున్న సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ సంస్థ సర్వేలు చేయడం ద్వారా సంపాదించిన నిధులను వీక్షణం కొరకు ఖర్చుపెడుతున్నది. ఆ పరిస్థితి ఇంకా ఎక్కువ కాలం కొనసాగే అవకాశం లేదు.

ఈ పరిస్థితిలో వీక్షణంను ఆదుకొని, ఆర్థికవనరులను కల్పించి, మనుగడను సుస్థిరం చేయవలసింది మీరే. ఇది మీ పత్రిక, దీన్ని కాపాడుకోవడం, పది కాలాలపాటు నిలిచేలా చూడడం మీ బాధ్యత.

అందుకోసం

- పాఠకులందరూ చందాలు కట్టవచ్చు.
- ప్రతి చందాదారూ మరొకరిని చందాదారుగా చేర్పించవచ్చు, లేదా మిత్రులొకరికి వీక్షణం సంవత్సర చందా కానుకగా ఇవ్వవచ్చు.
- మీ గ్రామంలో, పట్టణంలో మీకు తెలిసిన దుకాణదారు వీక్షణం తెప్పించేలా, సక్రమంగా బకాయిలు చెల్లించేలా చూడవచ్చు.
- మీకు తెలిసిన వారెవరయినా వ్యాపార ప్రకటనలు ఇవ్వగలిగిన స్తోమత, అధికారం కలిగి ఉంటే వారిద్వారా వీక్షణంకు ప్రకటనలు ఇప్పించవచ్చు.

**వీక్షణంను ఆదుకొండి**

**తెలుగునాట ఇటువంటి పత్రిక ఇది ఒక్కటే, దీని మనుగడకు, విస్తరణకు మీ చేయూతనందించండి**

### చందా వివరాలు

| | | | |
|---|---|---|---|
| సంవత్సర చందా | రు. 120 | మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 | పది సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

# వీక్షణం 92

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మార్చ్ 2009
సంపుటి : 7
సంచిక : 3





**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,
డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


**సంపాదకీయం**

# ఎందుకూ కొరగాని ఆపద్ధర్మ బడ్జెట్లు

ఇటు ఫిబ్రవరి 5న రాష్ట్ర ప్రభుత్వం, అటు ఫిబ్రవరి 16న కేంద్ర ప్రభుత్వం తమ తమ వోట్ ఆన్ అకౌంట్ బడ్జెట్లను ప్రవేశపెట్టాయి. ఎన్నికలు జరిగి, కొత్త ప్రభుత్వాలు ఏర్పడి పూర్తికాలపు బడ్జెట్ ప్రవేశపెట్టేలోపు రోజువారీ చెల్లింపులు, వ్యవహారాలు నడపడం కోసం మాత్రమే, మరొక రెండు నెలలలో దిగిపోయే ప్రభుత్వాలు ప్రతిపాదించే ఈ ఆపద్ధర్మ బడ్జెట్లను నిజానికి పెద్దగా పట్టించుకోనక్కరలేదు. ఎందుకంటే ఈ బడ్జెట్‌లో మహావాగ్దానాలు, భారీ కేటాయింపులు చేసినా, కొత్త ప్రభుత్వం ఏర్పడినాక ప్రవేశపెట్టే పూర్తి బడ్జెట్‌లో వాటినన్నిటినీ రద్దుచేసి పారెయ్యవచ్చును కనుక వాటికేమీ విలువ ఉండదు. అట్లాగే అవకాశం లేదని అసలేమీ వాగ్దానాలు, హామీలు ఇవ్వకపోయినా అది ఎన్నికల మీద ప్రభావం చూపించి అధికారపక్షం ఎన్నికలలో ఓడిపోవడానికి దారితీయవచ్చు. అలా ఏమి చేసినా ఇబ్బందే, చేయకపోయినా ఇబ్బందే గనుక ఆపద్ధర్మ బడ్జెట్ కత్తిమీద సాము. కాకపోతే, గతంలో తాము చేసిన పనుల గురించి, భవిష్యత్తులో తాము చేయదలచుకున్న పనుల గురించి ఊదరగొట్టడానికి, అతిశయోక్తులు, అబద్ధాలు చెప్పడానికి అధికారపక్షాలు ఈ ఆపద్ధర్మ బడ్జెట్లను వాడుకుంటున్నాయి. తమ పాలనాకాలంలో చేసిన పనులగురించి అతిశయోక్తులు చెప్పి, భవిష్యత్తుకోసం తమ ఉద్దేశ్యాలను ప్రకటించి, ప్రజలను భ్రమల్లో ముంచి తద్వారా వోట్లు దండుకోవచ్చునని, మళ్లీ అధికారంలోకి రావచ్చునని పాలక రాజకీయ పక్షాలు భావిస్తున్నాయి. రాష్ట్ర శాసనసభలో ఆర్థిక మంత్రి రోశయ్య, లోక్‌సభలో ఆపద్ధర్మ ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ ప్రవేశపెట్టిన తాత్కాలిక బడ్జెట్లు సరిగ్గా ఈ లక్షణాలనే పుణికిపుచ్చుకున్నాయి. వాగాడంబరం ఎక్కువ, వాస్తవస్థితి తక్కువగా ఆ బడ్జెట్లు సాగాయి. ఇంత అప్రధానమైన బడ్జెట్లలోని కేటాయింపుల గురించి, వాటి ఎక్కువ తక్కువల గురించి, ప్రభుత్వ ప్రాధాన్యతల గురించి మాట్లాడడం అంతగా అవసరం లేదు. కాని మొత్తంగా పాలకపక్ష ఆలోచనా సరళినీ, దాని రాజకీయార్థిక విధానాల స్వభావాన్నీ ఈ బడ్జెట్లు వ్యక్తీకరిస్తున్నాయి గనుక వాటి గురించి చర్చించుకోవచ్చు. మరీ ముఖ్యంగా ఎన్నికలవేళ పాలకపక్షం ఆలోచనలకు ఈ బడ్జెట్లు అద్దం పట్టాయి. తమకు అధికారం లేని సమయంలో, లేని విషయాలలో కూడా పాలకపక్షాలు ఎటువంటి భ్రమలను వ్యాపింపజేయడానికి ప్రయత్నిస్తాయో, ఆర్థిక వ్యవస్థలో ఎటువంటి అక్రమాలను చాపకింద నీటిలా ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తాయో ఈ బడ్జెట్లు తెలియజెప్పాయి. ప్రత్యేకించి ఈ బడ్జెట్లు అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో వచ్చాయి గనుక ఆర్థిక మాంద్యం, పరిశ్రమల మూసివేత, నిధుల కొరత, నిరుద్యోగం పెరుగుదల, మొదలయిన పరిణామాల ప్రభావం ఈ బడ్జెట్ల రచనలో స్పష్టంగా కనబడ్డాయి. ఈ రెండు బడ్జెట్లూ ఎన్నికల ముందు వచ్చాయి గనుక, ఆ ఎన్నికలను ప్రభావితం చేయగల అంశాలు కూడా ఈ బడ్జెట్లలో కనబడుతున్నాయి. ఆమ్ ఆద్మీ (సామాన్యజీవి) గురించి, సంక్షేమ పథకాల గురించి ప్రస్తావనలు, ఉపాధి కల్పన గురించి వాగ్దానాలు, గ్రామీణ, వ్యవసాయ రంగాలకు ప్రాధాన్యం ఇచ్చినట్టు భ్రమలు కల్పించడం వంటివి ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని ఈ బడ్జెట్లలోకి వచ్చాయి. రాష్ట్ర, కేంద్ర బడ్జెట్లు రెండిటిలోనూ ఈసారి కొట్టవచ్చినట్టు కనిపించే మరో అంశం ద్రవ్య విధానం మీద పూనిక. ప్రజానుకూల, ప్రజాసంక్షేమ పథకాల మీద కన్న ఆ పథకాల పేరుమీద పంపిణీ చేయదలచుకున్న భారీ నిధుల మీద పూనిక. దీర్ఘకాలికంగా ప్రజా జీవనాన్ని మెరుగుపరచే చర్యలకన్న, తక్షణమే వ్యక్తిగత స్థాయిలో ఎంతోకొంత ఆర్థిక సహాయం అందించి, ఇతరత్రా లబ్ధి చేకూర్చి, తద్వారా ప్రజల కృతజ్ఞతను వోట్లుగా మార్చుకునే పథకం. ఆర్థిక వ్యవస్థలోకి ద్రవ్య సరఫరాను పెంచడానికి, కనీసం ఎన్నికల సమయంలో పారిశ్రామిక, వ్యాపారవేత్తల చేతిలో, సంపన్నవర్గాల చేతిలో, ద్రవ్య సంస్థల చేతిలో ఎక్కువ నిధులు ఉండేలా చేయడానికి ఒక ప్రయత్నం ఈ బడ్జెట్లలో కనబడుతుంది. అలా ఇబ్బడిముబ్బడిగా ప్రవహించే కోట్లాది రూపాయల నిధులలో అధికభాగం పాలకపక్షాలకు ముడుపులుగా, అభ్యర్థులకు విరాళాలుగా మారి ఎన్నికల వ్యయంగా మారబోతుంది గనుకనే దీనిమీద ఇంత దృష్టి. అలాగే, ఇంత తాత్కాలిక బడ్జెట్‌లోనైనా రక్షణ వ్యయానికి ఎక్కువ కేటాయింపులు చేయకుండా ఉండవచ్చునని ప్రభుత్వం అనుకోలేదు. కేంద్ర బడ్జెట్‌లో రక్షణ వ్యయం గత సంవత్సరం కన్న యాభై వేల కోట్ల రూపాయలు ఎక్కువ. విద్య, వైద్య, ఆరోగ్య రంగాల మొత్తం కేటాయింపుల కన్న రక్షణవ్యయపు పెరుగుదల ఎక్కువంటే, ఆ పెరుగుదలను చూసి దేశదేశాల ఆయుధ వ్యాపారులు, వారి దళారీలు సంతోషం వ్యక్తం చేస్తున్నారంటే ఈ ప్రభుత్వం ఎవరికోసమో అర్థమవుతుంది. వీ

## జీవిత ఖైదీల విడుదల

**మ**న సమాజంలో నేరం – శిక్ష సక్రమంగా అమలు కావడం లేదని అందరికీ తెలిసిందే. అసలు నేరం అంటే నిర్వచనమే తప్పులతడకగా, ఆస్తికీ, సంపదకూ, అధికారానికీ, కులానికీ అనుకూల పద్ధతిలో ఉండగా, సామాజికన్యాయ దృష్టితో చూసినప్పుడు ఎందరో నేరస్తులు అధికారపీఠాల మీద కూచుని ఉండడమూ, మరెందరో అమాయకులు శిక్షల పాలయి జైళ్లలో మగ్గుతుండడమూ కూడ తెలిసిందే. ఆ తాత్విక చర్చ కూడా అలా ఉంచి, తాత్కాలిక ఆవేశంతో నేరాలు చేసే వారికయినా, ఉద్దేశ్యపూర్వకంగా నేరాలు చేసే వారికయినా శిక్షలు విధించే పద్ధతి, వారినో, వారి ఉదాహరణ చూపి ఇతరులనో సంస్కరించేలా ఉండాలనేది ఆధునిక ఆలోచనాధోరణి. అందువల్లనే జైళ్లు కేవలం శిక్షా నిలయాలుగా కాక, శిక్షణ, సంస్కరణ కేంద్రాలుగా ఉండాలని ఆధునిక ప్రభుత్వాలు భావిస్తున్నాయి. అంతకు ముందు ఎంత ఘోరమైన నేరం చేసిన వారయినా, జైలులోని సంస్కరణ వాతావరణం వల్ల మానసిక పరివర్తన పొంది పశ్చాత్తాప పడతారనీ, ఆ పశ్చాత్తాపం జైలులో వారి సత్ప్రవర్తనగా బయటపడుతుందనీ ఎందరో మేధావులు ఇప్పటికే విశ్లేషించి ఉన్నారు. అందువల్లనే జైలులో సత్ప్రవర్తన కనబరచిన ఖైదీల శిక్షాకాలంలో రాయితీలు ఇచ్చి, శిక్షాకాలం పూర్తి కాకముందే వారిని విడుదల చేయాలనే సంప్రదాయం వచ్చింది. యావజ్జీవ శిక్ష పడిన ఖైదీలకయితే, ఆ శిక్షా కాలాన్నే పద్నాలుగు సంవత్సరాలుగా, దినమూ రాత్రీ లెక్కించి ఏడు సంవత్సరాలుగా నిర్వచించిన మానవతా సంప్రదాయం కూడా ఉంది. జనవరి 26, ఆగస్ట్ 15, గాంధీ జయంతి, లేదా పండుగలను సందర్భంగా ఎంచుకుని ఖైదీలను విడుదల చేయడం ఒక ఆనవాయితీగా వస్తుండేది. రాష్ట్రంలో తెలుగుదేశం పాలనాకాలంలో కుంటుపడిన ఈ పద్ధతి, కాంగ్రెస్ పాలనాకాలంలో పూర్తిగా ఆగిపోయింది. న్యాయస్థానాల వివాదాలతో పాటు, ఎవరో ఒకరిద్దరు ఖైదీల విడుదలను ఆపడానికి వందలాది మంది జీవితాలతో ఆడుకోవడానికి కొన్ని రాజకీయ పక్షాలు ప్రయత్నించిన ఫలితంగా ఈ ప్రతిష్టంభన ఏర్పడింది. చిట్టచివరికి ఇటీవల సుప్రీంకోర్టు తన అభ్యంతరాలన్నిటినీ వదులుకొని ఖైదీల విడుదలకు అనుమతినిచ్చింది. అయినా, ఆ తర్వాత కూడ ప్రభుత్వం విపరీతమైన తాత్సారం చేస్తుండడం క్షమార్హం కాని నేరం. ఇప్పటికైనా ప్రభుత్వం అర్హులైన ఖైదీలందరి తక్షణ విడుదలకు పూనుకోవాలి.

## ఎన్‌కౌంటర్లు హత్యలే

**రా**ష్ట్రంలో నాలుగు దశాబ్దాలుగా ఒక పాలనా విధానంగా అమలవుతున్న ఎన్‌కౌంటర్లను హత్యలుగా గుర్తించక తప్పదని రాష్ట్ర హైకోర్టు తీర్పునిచ్చింది. రాజకీయ ప్రత్యర్థులను, ముఖ్యంగా వ్యవస్థను మార్చడానికి సాయుధపోరాటం తప్ప మరొక మార్గం లేదనే విశ్వాసంతో ఉద్యమిస్తున్న వారిని భౌతికంగా నిర్మూలించడం, ఆ హత్యలకు ఎన్‌కౌంటర్ అని పేరు పెట్టడం జరుగుతోంది. అటువంటి ప్రతి హత్యా సంఘటనలోనూ పోలీసులు చెపుతున్నట్టుగా అవతలివైపు నుంచే మొదట కాల్పులు ప్రారంభమై, కేవలం ఆత్మరక్షణ కోసమే తాము ఎదురు కాల్పులు జరిపితే అవతలివైపు ప్రాణనష్టం జరిగిందనే మాట నిజమే అయినా ఆ కథనం న్యాయస్థానం ముందర విచారణకు రావలసి ఉంటుంది. ఈ దేశ రాజ్యాంగంలో అధికరణం 21 ప్రతి మనిషికీ జీవించే హక్కును వాగ్దానం చేసింది. ఆ హక్కు కొల్లగొట్టే వారెవరయినా న్యాయస్థానం ముందుకు విచారణకు రావలసిందే. మనిషి ప్రాణాన్ని తీసే హక్కు చట్టబద్ధమైన విచారణ ద్వారా మరణశిక్ష విధించే న్యాయస్థానానికి తప్ప మరెవరికీ లేదు. ఆ న్యాయస్థానపు అధికారానికి కూడ అనేక పరిమితులున్నాయి. మరి ఎటువంటి విచారణా లేకుండా ఒక మనిషిని చంపే అధికారం పోలీసులు తమకు తాము ఇచ్చుకోవడం రాజ్యాంగ వ్యతిరేక చర్య. ఆ విధంగా గత నలభై సంవత్సరాలుగా రాష్ట్ర పోలీసు వ్యవస్థ వేలాది సందర్భాలలో రాజ్యాంగ విరుద్ధంగా ప్రవర్తించింది. అట్లాగే, ఎవరయినా మరొకరిని చంపి తాను ఆత్మరక్షణ కొరకు మాత్రమే చంపానని అంటే కూడ విచారణ జరపకుండా ఉండరు. అలా చెప్పిన వ్యక్తిమీద కూడ హత్యానేరం మోపి న్యాయస్థానంలో విచారిస్తారు. ఆ వ్యక్తి తాను ఆత్మరక్షణార్థమే ఆ హత్యకు పాల్పడవలసి వచ్చిందని న్యాయస్థానంలో నిరూపించుకోవలసి ఉంటుంది. మరి మామూలు పౌరులకు లేని రక్షణ పోలీసులకు ఎవరు ఇచ్చారు? తమ ప్రత్యర్థులను, తాము ఎవరిని చంపదలచుకుంటే వారిని, చంపి పోలీసులు ఆత్మరక్షణ అని చెప్పి తప్పించుకోవచ్చునా? కనీసం అది అన్ని హత్యల లాగే నమోదయి, న్యాయస్థానపు విచారణకు వచ్చి, నిజమా అబద్ధమా తేల్చే వాదనలు జరగగూడదా? ఇటువంటి ప్రశ్నలను ఎన్‌కౌంటర్ హతుల బంధుమిత్రులు, వారు పనిచేసిన ఉద్యమాల సహచరులు, పౌరహక్కుల చైతన్యం ఉన్న సంస్థలు, వ్యక్తులు గత నాలుగు దశాబ్దాలుగా అడుగుతున్నారు. ఆ ప్రశ్నలకు ఇన్నాళ్లకు రాష్ట్ర హైకోర్టు ఒక సరయిన, రాజ్యాంగబద్ధమైన జవాబు చెప్పింది. ఎన్‌కౌంటర్ అయినా హత్యేననీ, అది హత్యగా నమోదయి, న్యాయస్థానం ముందరికి విచారణకు రావలసిందేననీ చెప్పింది. ఇకనైనా రాష్ట్రంలో సాగుతున్న ఎన్‌కౌంటర్ హత్యాకాండ ఆగిపోతుందనీ, కనీసం తగ్గుతుందనీ ఆశించవచ్చునా?

## ఉపఖండం నిండా దుర్వార్తలు

**భా**రత ఉపఖండం ఇవాళ ఒక అగ్నిపర్వతం లాగున్నది. హింస, దౌర్జన్యం, మతం పేరుమీద హింసాకాండ, కాలం చెల్లిన భూస్వామ్య, మతవిశ్వాసాలకు మళ్లీ ప్రాధాన్యం, సామాజిక ప్రగతి కోసం, అట్టడుగు ప్రజల ఆత్మగౌరవం కోసం పోరాడుతున్న వారి ఓటమి – దాదాపు అన్ని దిక్కుల నుంచీ సంక్షోభపు వార్తలే వస్తున్నాయి. పాకిస్థాన్ వాయవ్య సరిహద్దులోని స్వాత్ లోయలో పొరుగున ఉన్న అఫ్ఘనిస్థాన్ నుంచి తాలిబన్ సైనికులు ప్రవేశించి అది తమ ప్రాబల్య ప్రాంతంగా ప్రకటించుకుని తమ సమాంతర ప్రభుత్వాన్ని నడుపుతూ మత ఛాందస విధానాలు ప్రకటించారు. స్త్రీలు బయటికి రాగూడదని ఆంక్షలు విధించారు. బాలికల పాఠశాలల మీద బాంబులు విసిరి, పేల్చివేసి ఆడపిల్లలకు చదువు వద్దనే శాసనాన్ని ప్రకటించారు. ఈ ఛాందస దాడులు సాగిస్తున్న తాలిబాన్లతో పాకిస్థాన్ ప్రభుత్వం ఒడంబడిక చేసుకుంది. స్వాత్ లోయలో తమ అధికారం చెల్లదనీ, తాలిబాన్లు అక్కడ షరియా అమలు చేయవచ్చుననీ అంగీకరించింది. కొన్ని వారాల ముందే నేపాల్‌లో ప్రచండ ప్రభుత్వం కూడా హిందూ ఛాందస మతాచారాల అమలును ఆమోదిస్తూ ఆలయ నిర్వాహకులకు లొంగిపోయింది. భారతదేశంలో మతోన్మాదం పెట్రేగడం గురించి చెప్పనే అక్కరలేదు. ఇవన్నీ చూస్తుంటే మొత్తం ఉపఖండమే ప్రగతి నిరోధకత్వం వైపు పయనిస్తున్నదా అని అనుమానం కలుగుతున్నది. ఈ ప్రగతి నిరోధకత్వాన్ని ఏదో ఒక స్థాయిలో అడ్డుకుని, ప్రజా జీవనం మెరుగుపడడం కొరకు పోరాటాలు సాగిస్తున్న ఉద్యమకారుల మీద పాలక నిర్బంధకాండ కనీవినీ ఎరగని రీతిలో పెరిగిపోతున్నది. శ్రీలంకలో ఎల్.టి.టి.ఇ. ని నిర్మూలించడానికి, తద్వారా తమిళ జాతి హననాన్ని మరింత దుర్మార్గంగా సాగించడానికి అక్కడి ప్రభుత్వం సాగిస్తున్న క్రూర చర్యలు ప్రతిరోజూ విషాద వార్తలను మోసుకొస్తున్నాయి. భారత ఉపఖండం ఎటుపోతున్నది? వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : డాక్టర్ రామ మనోహర్ లోహియా - భావాలు, సమకాలీనత



**సో**షలిస్టు భావాలతో ప్రేరేపితుడై, అదే సమయంలో రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో కమ్యూనిస్టుల వైఖరితో అసంతృప్తి చెంది మార్క్సిస్టు వ్యతిరేకతను కూడా అవలంబించి దేశ రాజకీయ రంగంలో జయప్రకాశ్ నారాయణ్ తరువాత నిజాయితీ పరుడైన, ప్రజా సంక్షేమమే పరమావధిగా భావించిన రాజకీయ వేత్త, స్వతంత్ర మేధావి డాక్టర్ రామమనోహర్ లోహియా శతజయంతి సంవత్సరమిది. 1967లో మరణించేవరకు నెహ్రూకు, నెహ్రూ కుటుంబానికి వ్యతిరేకంగా, నిజమైన ప్రజాస్వామ్యం కోసం, సామాజిక న్యాయం కోసం నిరంతర కృషి సాగించిన లోహియా గురించి నాలుగు వ్యాసాలు



‘వీక్షణం’లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. ‘వీక్షణం’ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. ‘వీక్షణం’ కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. ‘వీక్షణం’ పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను ‘వీక్షణం’కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **వ్యాస రచనా శిల్పం** – వి. చెంచయ్య – విప్లవ రచయితల సంఘం నెల్లూరు జిల్లా ప్రచురణ, 40 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : వి. చెంచయ్య, సాహితీ నిలయం, 10–40–15ఎ/1, జనతాపేట నార్త్, కావలి – 524 201, నెల్లూరు జిల్లా. ఫోన్ : 08626 – 242277, సెల్ : 94406 38035
- **భూమి చరిత్ర సంస్కృతి** – ప్రసంగ వ్యాసాలు – విప్లవ రచయితల సంఘం ప్రచురణ – 54 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్, కుశల పుస్తక నిలయం
- **వెలివాడ** – మద్దూరి నగేష్‌బాబు – బహుజన కెరటాలు ప్రచురణలు – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : కడియం నాగమణి, ఎస్.ఆర్. పల్నాటి, 4/15, ఆర్.టి.సి. స్టాఫ్ కాలనీ, సత్యనారాయణపురం, ఒంగోలు – 2. ప్రకాశం జిల్లా. సెల్ : 9849944170; అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు
- **జెండర్ గేమ్ అండ్ అదర్ స్టోరీస్** – కొ.కు. – అనువాదం : డా. బి. ఇందిర – ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురణ – 110 పేజీలు, 1/8 క్రౌన్, రు. 60
- **గుంటూరు శేషేంద్ర శర్మ** – కూర్పు : కడియాల రామమోహన రాయ్ – ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురణ – 92 పేజీలు, 1/8 క్రౌన్, రు. 50

పై రెండు పుస్తకాల ప్రతులకు : రిజిస్ట్రార్, ద్రావిడ విశ్వవిద్యాలయం, శ్రీనివాసవనం, కుప్పం – 517425

- **అందుబాటు** – ఉత్తర తెలంగాణ కథా రచయితల పరిచయం – డా. బి.వి.ఎన్. స్వామి – సమైక్య సాహితీ ప్రచురణ – 146 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : డా. బి.వి.ఎన్. స్వామి, ఇ.నెం. 9–6–161, రాంనగర్, కరీంనగర్ – 505 002. సెల్ : 9247817732
- **మంచుపూల వాన** –కథలు – కుప్పిలి పద్మ – ముక్త ప్రచురణ – 246 పేజీలు, 1/8 డెమీ, రు. 95, ప్రతులకు : కుప్పిలి పద్మ, 201, విజయలక్ష్మి అపార్ట్‌మెంట్స్, మెథడిస్ట్ కాలనీ, బేగంపేట్, హైదరాబాద్ – 500 016
- **ప్రాణప్రదమైన...** – కవితా సంపుటి – వేణుసంకోజు – జయమిత్ర పబ్లికేషన్స్ – 68 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : శ్రీమతి ఎస్. విజయలక్ష్మి, 5, ఎల్.ఐ.జి.ఎచ్., ఎచ్.బి. కాలనీ, రాజీవ్ పార్క్, నల్లగొండ – 508 001. ఫోన్ : 08682 229337, సెల్ : 99484 19881
- **ఖమ్మం కథాసుధ** – ఖమ్మం జిల్లా కథా రచయితల పరిచయ వ్యాసమాలిక – తాటి కొండాల నరసింహారావు – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణలు – 186 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు : తాటికొండాల నరసింహారావు, 6–2–42/6, జమ్మికొండ, ఖమ్మం – 507 001
- **సెగ** – తెలంగాణ కవిత్వం – జూలూరు గౌరీశంకర్ – తెలంగాణ రచయితల వేదిక – 107 పేజీలు, 1/8 డెమీ, రు. 40

పై రెండు పుస్తకాల ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044







'వీక్షణం' రెగ్యులర్‌గా చూస్తున్నాను. ప్రామాణికంగా వస్తోంది. ఈ ప్రమాణాలనే కొనసాగిస్తూ, ఇంకా మెరుగు పరుస్తూ నడపండి. తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీతో సమానంగా మారే అవకాశం ఉంది.

**– ఓల్గా**
హైదరాబాద్

సత్యం కంప్యూటర్ కుంభకోణంపై సంపాదకీయం, వ్యాసం బావున్నాయి. సంపాదకీయంలో ఆస్తి అంటే దొంగతనమే అని ప్రౌధాన్ వాక్యాన్ని ఉటంకించడం బావుంది. నేను కూడా ఉపన్యాసాల్లో, రచనల్లో దాన్ని ఉటంకించాను.

**– డి. పాపారావు**
హైదరాబాద్

'వీక్షణం' వచ్చే వ్యాసాలు చాలా బాగున్నాయి. సమాజంలోని ఎన్నో అంశాల గురించి అనేక కోణాల నుండి పరిశీలించే ఈ వ్యాసాలు ఎంతో విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి.

**– ఎం. సుదర్శన్**
వరంగల్

'వీక్షణం' ఫిబ్రవరి సంచికలో స్విస్ బ్యాంకులలో భారతీయుల అక్రమ ఖాతాల నిధుల మీద సమాచారం చాలా బాగుంది. ఉద్యమకారులకు ఉపయోగ కరంగా ఉంది. ఈ రకంగానే ప్రతి సంవత్సరం భారతీయ ప్రజానీకం చెమటోడ్చి సృష్టించిన సంపద విదేశాలకు తరలిపోతున్నదో వివరాలు ప్రచురించగలరు. విదేశీ కంపెనీల లాభాల రూపంలో, విదేశీ కంపెనీల సరుకులను కొనడంలో, వారి సాంకేతిక పరిజ్ఞానానికి ఖరీదు రూపంలో, విదేశీ రుణాల అసలు, వడ్డీ చెల్లింపులలో ఎంత ధనం తరలిపోతున్నదో లెక్కలు ప్రకటిస్తే ఏటేటా దేశ సంపద ఎంత దుర్వినియోగమవుతున్నదో అందరికీ తెలుస్తుంది.

**– ఎస్. రాజారావు**
జగ్గంపేట

స్విస్ బ్యాంకుల్లో భారతీయుల ఖాతాలు, వివరాలు ఆసక్తికరంగా ఉన్నాయి. వాటిమీద ఎక్కడ ప్రస్తావించినా చాలా ఆసక్తి ఉంటోంది. ఇటువంటి రచనలు ఎక్కువగా ప్రచురించండి.

**– అప్పిరెడ్డి**
బోధన్

వీక్షణం ఫిబ్రవరి సంచికలో స్విస్ బ్యాంకులలో భారతీయుల అక్రమ నిల్వల గురించిన వ్యాసానికి విశేష స్పందన వచ్చింది. ఆ వ్యాసం తమ కళ్లు తెరిపించిందని, ఇంకా వివరాలు కావాలని అనేకమంది ఫోన్ల ద్వారాను, ఉత్తరాల ద్వారాను మా కార్యాలయానికి తెలియజేశారు. ప్రపంచంలో ఇటువంటి అక్రమ నిల్వలకు ఆస్కారం ఇస్తున్న దేశాలు, ప్రభుత్వాలు కనీసం 60 ఉన్నాయి. ఈ విషయాల గురించే ప్రత్యేకంగా పరిశోధించడం కోసం ఏర్పడిన ప్రజానుకూల పరిశోధనా సంస్థలు కూడా ఉన్నాయి. ఆ వివరాలన్నీ రానున్న సంచికలలో ప్రకటిస్తాం.

**– సం.**

## ఫిల్మ్ తెలంగాణ 2009

### లఘు చిత్రాల పోటీ

గత సంచికల ప్రకటించిన **'ఫిల్మ్ తెలంగాణ 2009'** డిజిటల్ లఘు చిత్రాల పోటీకి దరఖాస్తులు పంపడానికి ఆఖరు తేదిని మార్చ్ 15, 2009 వరకు పొడిగించడం జరిగింది. మిగిలిన నిబంధనలు యథాతథంగా ఉంటాయి. పోటీకి తమ చిత్రాలను పంపించదలచిన వారు మార్చ్ 15, 2009 లోపు రు. 500 ప్రవేశ రుసుము మనీ ఆర్డర్‌తో **కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ, ఫిల్మ్ భవన్, కలెక్టరేట్ రోడ్, కరీంనగర్ – 505 001** కి దరఖాస్తులు పంపాలి.

వివరాలకు film.telangana@gmail.com ను గానీ, కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ అధ్యక్షుడు **వారాల ఆనంద్ (94405 01281)** ను గానీ సంప్రదించాలి.

### 'భూమిక' కథల పోటీ

ప్రతి సంవత్సరం 'భూమిక' కథల పోటీ నిర్వహిస్తున్న విషయం మీకు తెలిసిందే. ఈసారి కథలతో పాటు వ్యాస రచన పోటీని నిర్వహించాలను కున్నాం. కథాంశం రచయితల అభిష్టానికి వదిలేస్తున్నాం. వ్యాసం మాత్రం రాష్ట్రంలో మహిళలపై జరుగుతున్న దాడుల నేపథ్యంలో ఉండాలి.

- మీ రచనలు సరళంగా సూటిగా ఉండాలి.
- పేపరుకు ఒకవైపు మాత్రమే ఉండాలి.
- కవరు మీద వ్యాసం పోటీ కోసమని రాయాలి
- పోటీ మహిళలకు మాత్రమే
- రచనలు ఎట్టి పరిస్థితిలోను తిరిగి పంపబడవు
- న్యాయ నిర్ణేతలదే తుది నిర్ణయం
- కథల విభాగంలో మూడు, వ్యాస విభాగంలో మూడు బహుమతులు ఉంటాయి.
- బహుమతి గెలుచుకున్న రచనతోపాటు, ఎంపికి చేయబడిన వాటిని వీలు వెంబడి ప్రచురిస్తాం

మీ రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది 31.3.2009
రచనలు పంపవలసిన చిరునామా

**భూమిక**
ఎచ్.ఐ.జి. – 2, బ్లాక్ 8, ఫ్లాట్ 1,
వాటర్ ట్యాంక్ వెనుక, బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్ – 500 044. ఫోన్ : 040 – 27660173
ఇమెయిల్ : bhumikahyd@yahoo.com
kondaveetis@yahoo.com

Statement about ownership and other particulars of periodical **VEEKSHANAM** as required to be published in the first issue of every year after the last day of February

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*
Signature of the Publisher

Date : March 1st, 2009

## పోలవరం కు జలసంఘం అనుమతి

పోలవరం ప్రాజెక్ట్‌కు అత్యంత కీలకమైన కేంద్ర జలవనరుల సంఘం (సి.డబ్ల్యు.సి) సాంకేతిక సలహా సమితి (టి.ఎ.సి.) అనుమతి లభించింది. సి.డబ్ల్యు.సి చైర్మన్ నంబియార్ ఆధ్వర్యంలో జరిగిన సమావేశం ఈ ప్రాజెక్ట్‌కు సంబంధించిన సాంకేతిక, ఆర్థిక స్థితిగతులను పరిశీలించి సూత్రప్రాయంగా ఆమోద ముద్ర వేసినట్లు రాష్ట్ర ప్రభుత్వ సాగునీటి శాఖ అధికారులు తెలిపారు. ఇక మిగిలింది పెట్టుబడుల అనుమతి కోసం ప్రణాళిక సంఘానికి దరఖాస్తు చేసుకోవడమేనని ఆ శాఖ అధికారులు తెలిపారు. కాగా పోలవరం నీటి కేటాయింపుల్లో 28 టి.ఎం.సి.ల మేర కోత పడింది. ప్రాజెక్ట్ సమగ్ర నివేదిక ప్రకారం 301 టి.ఎం.సి.లు అయితే కేంద్ర జలసంఘం 273 టి.ఎం.సి.లకు మాత్రమే అనుమతినిచ్చింది.

## జీవిత ఖైదీలకు క్షమాభిక్ష

జీవిత ఖైదీలకు క్షమాభిక్ష అంశం పరిశీలించుకోవచ్చని సర్వోన్నత న్యాయస్థానం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అనుమతి ఇచ్చింది. సెలవులు, సత్ప్రవర్తన కలుపుకుని 14 ఏళ్ల శిక్షాకాలం పూర్తిచేసిన వారిని పరిగణనలోకి తీసుకోవచ్చని స్పష్టం చేసింది. ఈ కేసులో గతంలో జారీ చేసిన స్టేను సవరించింది. రాజ్యాంగంలోని 161 అధికరణం ద్వారా సంక్రమించిన విశేషాధికారాల ప్రకారం గవర్నర్ విచక్షణతో ఖైదీలకు క్షమాభిక్ష పెట్టవచ్చని ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కె.జి. బాలకృష్ణన్, జస్టిస్ పి. సదాశివంలతో కూడిన ధర్మాసనం పేర్కొంది.

## క్షీణించిన ఆహార ధాన్యాల ఉత్పత్తి

గడచిన ఖరీఫ్ సీజన్‌లో ఆహార ధాన్యాల దిగుబడి బాగా క్షీణించింది. నూనెగింజల ఉత్పత్తి దారుణంగా పడిపోయింది. డిసెంబర్‌లో నిర్వహించిన రెండు ముందస్తు అంచనాల్లో ఈ క్షీణత కొట్టొచ్చినట్లుగా కనిపిస్తోంది. 2007 ఖరీఫ్‌తో పోలిస్తే 2008లో ఆహార ధాన్యాల ఉత్పత్తి 12.78 లక్షల టన్నులు తగ్గింది. నూనె గింజల ఉత్పత్తి 19.81 లక్షల టన్నులు క్షీణించింది. అర్థ గణాంకాల అంచనా ప్రకారం వరి దిగుబడులను పరిశీలిస్తే 2007లో హెక్టారుకు 3178 కిలోలు రాగా 2008లో 2914 కిలోల ధాన్యం మాత్రమే వచ్చింది.

## బొగ్గుగనుల ధారాదత్తం

జెన్‌కో ఆధీనంలో ఉన్న బొగ్గుగనుల్ని ప్రైవేట్ సంస్థకు ధారాదత్తం చేస్తూ ఉత్తర్వులు జారీచేసింది. విద్యుత్ కోత కారణంగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు ప్రభుత్వ వర్గాలు వెల్లడించాయి. జెన్‌కో ఆధీనంలో ఉన్న ఖమ్మం జిల్లాలోని గనుల్ని హైదరాబాద్‌కు చెందిన కె.ఎస్.కె ఎనర్జీ లిమిటెడ్‌కు చెందిన సీతారాంపురం పవర్ లిమిటెడ్‌కు ధారాదత్తం చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది. గతంలో ఇదే సంస్థకు ఫ్యాబ్ సిటీ కోసం యాభై ఎకరాల స్థలాన్ని కేటాయించింది.

## ఎమ్మార్పీఎస్ అసెంబ్లీ ముట్టడి

మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎమ్మార్పీఎస్) కార్యకర్తలు ఫిబ్రవరి 4న అసెంబ్లీని ముట్టడించారు. సుమారు ముప్పై మంది కార్యకర్తలు అసెంబ్లీ భవనంపైకి ఎక్కి కిందకు దూకడానికి ప్రయత్నించారు. మరో పద్దెనిమిది మంది మూడు బృందాలుగా విడిపోయి మంత్రుల చాంబర్లలోకి వెళ్లి తలుపులు వేసుకున్నారు. ఎస్.సి.ల వర్గీకరణపై స్పష్టమైన హామీ ఇవ్వాలని డిమాండ్ చేశారు.

## ఎన్‌కౌంటరైనా హత్యే.

పోలీసు ఎన్‌కౌంటర్లను కూడా ఇతర హత్య కేసుల్లాగే దర్యాప్తు చేయాలని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఫిబ్రవరి 6న తీర్పు వెలువరించింది. వామపక్ష తీవ్రవాదులను, ఇతర నేరస్థులను బూటకపు ఎన్‌కౌంటర్లలో హతమారుస్తున్నారని ఆరోపణలు వెల్లువెత్తుతున్న నేపథ్యంలో హైకోర్టు తీర్పు ప్రాధాన్యత సంతరించుకున్నది. ప్రతి ఎన్‌కౌంటర్ సంఘటనకు సంబంధించి తప్పనిసరిగా పోలీసులపై కేసు నమోదు చేయాలని ఐదుగురు సభ్యుల విస్తృత ధర్మాసనం ఆదేశించింది. ఇదే అంశంపై 2.1 మెజారిటీతో హైకోర్టు ఇచ్చిన తీర్పును జస్టిస్ గోడా రఘురాం, జస్టిస్ వి.వి.ఎస్. రావు, జస్టిస్ ఆర్. సుభాష్‌రెడ్డి, జస్టిస్ రమేష్ రంగనాథన్, జస్టిస్ జి. భవానీ ప్రసాద్‌లతో కూడిన బెంచ్ ఫిబ్రవరి 6న తిరుగరాసింది.

## రైల్వే బడ్జెట్‌లో రాష్ట్రానికి మొండిచెయ్యి

ఓటాన్ అకౌంట్ బడ్జెట్‌లో రైల్వేశాఖ రాష్ట్రానికి ఒకరకంగా మొండిచెయ్యి చూపింది. కొత్త లైన్ల సర్వేలు, గేజ్ మార్పిడి, డబ్లింగ్, కొత్త రైళ్లు, ఉన్న రైళ్ల పొడిగింపు, సర్వీసుల పెంపు పద్దుల కింద మొత్తం 96 ప్రతిపాదనలు రైల్వే శాఖకు రాష్ట్రం నుంచి అందాయి. వాటిలో నికరంగా దక్కింది ఐదు. దేశంలో అన్ని జోన్ల కంటే అత్యధిక ఆదాయం సంపాదించి పెడుతున్న దక్షిణ మధ్య రైల్వేకు 2009-10 బడ్జెట్‌లో కేటాయింపులు లేవు. 14 కొత్త లైన్ల సర్వేకు ఆమోదం తెలిపితే అందులో రాష్ట్రానికి దక్కింది పిడుగురాళ్ల-నరసరావుపేట లైను మాత్రమే. గేజ్ మార్పిడి జాబితాలో రాష్ట్రానికి ఏమీ దక్కలేదు. డబ్లింగ్‌లోనూ ఇదే పరిస్థితి. 43 కొత్త రైళ్లు ప్రకటిస్తే రాష్ట్రానికి దక్కింది సికింద్రాబాద్-మణుగూరు సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ (రోజూ), మచిలీపట్నం-ముంబాయి సూపర్‌ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ (రోజుమార్చి రోజు) రైళ్లు మాత్రమే. నిజాముద్దీన్-బెంగళూరు మధ్య వారానికి మూడురోజులు నడిచే రాజధాని ఎక్స్‌ప్రెస్‌ను మంజూరు చేశారు. రైళ్ల గమ్యస్థానాల పొడిగింపు జాబితాలో రాష్ట్రానికి ఒక్కటి కూడా లేదు.

## సాక్షి పెట్టుబడులపై కేంద్రానికి ఫిర్యాదు

ముఖ్యమంత్రి కుమారుడు వై.ఎస్. జగన్‌మోహన్ రెడ్డి ప్రారంభించిన సాక్షి దినపత్రిక, త్వరలో ప్రారంభం కానున్న సాక్షి టి.వి. ఛానల్ లలో సొంత పెట్టుబడులు ఏమీ లేవని, అధికారం అడ్డం పెట్టుకొని వందల కోట్ల రూపాయలు ముడుపులుగా ఇతర వ్యాపార, పారిశ్రామికవేత్తల నుంచి సంపాదించారని మహాకూటమి నాయకులు ఢిల్లీ వెళ్లి రాష్ట్రపతి, కేంద్ర మంత్రులతో సహా అనేకమందికి ఫిర్యాదులు చేశారు. ఆ రెండు సంస్థలతో పాటు కొన్ని డజన్ల బినామీ సంస్థల పేరుమీద వేలాది కోట్ల రూపాయల ఆస్తులు, వందల ఎకరాల భూములు ఉన్నాయని ఆరోపించారు.

*ఎవరు అధికారంలోకి వచ్చినా బడ్జెట్ కేటాయింపులలో మారేదేమీ ఉండదంటూ కేంద్ర బడ్జెట్‌ను విశ్లేషిస్తున్నారు*

**వి. హనుమంతరావు**

# కేంద్ర బడ్జెట్ ఎవరి ప్రయోజనాల కొరకు?

ఫిబ్రవరి 16 2009న ప్రవేశపెట్టిన కేంద్ర బడ్జెట్ మంచి చెడ్డలు చూసేవారిని బట్టి ఉంటుంది. సమాజంలో అంతరాలు పెరిగి పేదలు, మధ్యతరగతి, ఉన్నత మధ్య తరగతి, ధనిక వర్గం, ధనికుల్లో మరింత ఉన్నత వర్గంగా సంస్కరణల అనంతరం పెరిగిపోయిన నేపథ్యంలో ఆయా వర్గాల బడ్జెట్ విశ్లేషణలు అంత వైవిధ్యం కలిగినవిగా ఉండడం సహజం. తాత్కాలిక విత్తమంత్రి ప్రణబ్ ముఖర్జీ, తాత్కాలిక బడ్జెట్ ప్రవేశ పెడుతూ చేసిన ఉపన్యాసంపై పత్రికల్లో విశ్లేషణలు చదివినపుడు, ఆ వైవిధ్యాలను ప్రతిబింబించాయి. ఆ ఉపన్యాసాన్ని సామాన్య పాఠకులకు అరటి పండు వొలిచి చేతిలో పెట్టినంత సులభంగా అర్థం చేసుకోవటం తప్ప, ఆ పనిని పత్రికలు చేసి పెడతాయి గాని, వారి తేడా వారి వర్గ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని నెగటివ్ గానో, పాజిటివ్‌గానో పాఠకులకు అంద చేస్తాయి. ఒక తెలుగు పత్రిక అయితే బడ్జెట్ ఉపన్యాసాన్ని తన ఆలోచనల మూసలో పోసి నల్లటి తారు పూసి మొదటి పేజీలో పతాక శీర్షికతో పాఠకులకు అంద చేసింది. అందుకనే నేనంటాను, మనం చదివేది వార్తా పత్రికలు కాదు, వ్యాఖ్యా పత్రకలని.

ఒకపుడు బడ్జెట్ కేటాయింపులు, ఖర్చులు వేలు, లక్షలు, కోట్లలో ఉండేవి. ఇపుడు వేల కోట్లు, లక్షల కోట్లలో కళ్లు చెదిరిపోతున్నాయి. అలాంటి గణాంకాలు గుప్పించి అమ్మో ప్రభుత్వం ఇంతగా ఖర్చు చేస్తుందా అని ప్రజలు అనుకొని, తర్వాత ఎన్నికల్లో తమ పార్టీకే ఓటు వేయాలని పాలకుల అభిప్రాయం. అదీ కాక ఈ ప్రభుత్వానికి ఇది ఆఖరు సంవత్సరం. మామూలు బడ్జెట్ అయితే ఆ సంవత్సరంలో ఏమి చేశారు, ఎంత ఖర్చు చేశారు, వచ్చే సంవత్సరంలో ఎంత ఎక్కువ ఖర్చు చేయబోతున్నారు అనే గణాంకాలుంటాయి. కాని ప్రణబ్ ఉపన్యాసంలో గత నాలుగేళ్లలో గుండు గుత్తాగా ఎంత ఖర్చు చేశారో, ఆ అంకెను ప్రజల ముందుంచి, చూశారా, మీకోసం ఎన్ని వేల, లక్షల కోట్లు ఖర్చు చేశామో అన్న అభిప్రాయాన్ని ప్రజల మనస్సుల్లో కలుగ చేయడానికి ప్రయత్నించారు. పాపం, దింపుడు కళ్లాల ఆశ. అయినా, ప్రభుత్వం ఎన్ని లక్షల కోట్లు కేటాయిస్తేనేం, ఖర్చు చేస్తేనేమి, సామాన్యుడు నా బతుకు బాగు పడిందా అని చూచుకొంటాడు. ఇలాంటి చీప్ గిమ్మిక్స్‌తో ప్రజల ఓట్లను గెలవాలనుకోవటం పగటి కలలు కనడమే. ఇది ఓట్ల బడ్జెట్, ఎన్నికల బడ్జెట్ అనే విమర్శ అరిగిపోయిన గ్రామఫోన్ ప్లేటు. ఏ ప్రభుత్వమైనా ఆ పనే చేస్తుంది. దేశం వెలిగిపోతోందని ఎన్‌డిఎ ప్రభుత్వం డబ్బా కొట్టుకోలేదూ? మన రాష్ట్రంలోనూ చంద్రబాబు పని చేశాడు కదా కొటి వరాలన్నారు. ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వం సంవత్సర కాలంగా వందల వాగ్దానాలు చేసింది. ప్రజల్లో ఇవి వట్టి వాగ్దానాలు కావని నిరూపించుకోవడానికి కొన్ని అమలు పరచటం ప్రారంభించ లేదూ? వాటి ఫలితాలు ప్రజలకు చేరుతున్నాయా అనేది వేరే విషయం.

ప్రస్తుత ప్రభుత్వం ప్రవేశ పెట్టిన తుది బడ్జట్ చూస్తే సంక్షేమ పథకాలకు 2009-10 కేటాయింపులు భారీగా చేసినట్లు ఒక అభిప్రాయాన్ని కలిగించడానికి ప్రయత్నం జరిగింది. కాని వివరాల్లోకి పోయి చూస్తే ప్రణాళికలో సంక్షేమ పథకాలకు 2008-09 కన్నా 2009-10లో అయిదు వేల కోట్లు తగ్గుతుంది. బడ్జెట్‌లో అయితే 13 లక్షల కోట్ల రూపాయలు కేటాయించినట్లు ఘనంగా ప్రకటించారు. మంచిదే కదా అని అనిపించింది. నడుస్తున్న సంవత్సరం లో కన్నా, వచ్చే ఏడాదిలో ఎంత ఎక్కువ ఖర్చు చేయబోతున్నారని కేటాయింపులను పోల్చి చూస్తే నూరు రోజుల ఉపాధి పథకం, టోటల్ సానిటేషన్ పథకం, సమగ్ర బాల బాలికల అభివృద్ధి పథకం, జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్, మధ్యాహ్న భోజన పథకం, సర్వశిక్షా అభియాన్ పథకాలకు చేసిన కేటాయింపులు ప్రస్తుత సంవత్సరం స్థాయిలోనే ఉన్నాయి. ఎటువంటి పెంపుదలా లేదు. మరెందుకీ ఇల్లెక్కి కూయడం? దేశ ఆర్థిక పరిస్థితి, స్థూల జాతీయాదాయం గత నాలుగేళ్లలో బాగానే పెరిగింది. స్థూల జాతీయాదాయం పెరుగుతూంటే, అభివృద్ధి దానంతట అదే పెరుగుతుందని, ఆ ఆదాయాన్ని కొలబద్దగా ఉపయోగిస్తుంటారు పాలకులు. కాని అవి పెరిగినా, ప్రజల జీవితాలు గొర్రెతోక బెత్తెడు గానే నిలిచిపోయేదెందుకు? అందులోనూ 2009-10 సంవత్సరం ఆర్థిక పరిస్థితి గడ్డుగానే ఉంటుందని పాలకులే అంగీకరిస్తున్నారు. అలాంటపుడు సామాజిక సంక్షేమ పథకాల కేటాయింపులు అంతకు ముందు సంవత్సరం స్థాయిలో కేటాయిస్తే, ప్రజలకు అందే సేవలు మరింతగా దిగజారిపోవూ? సరే, ఆచరణలో రాజకీయ పరిపాలనా వ్యవస్థ అనే తిమింగలం గుటకాయ స్వాహా చేసే పరిస్థితి ఉండనే ఉంది. అదీకాక, చేసిన కేటాయింపులే చాలవనుకొంటూంటే, ఆ కేటాయింపులు కూడా పూర్తిగా ఖర్చుకాని చరిత్ర ఉన్న రాష్ట్రాలున్నాయి.. ఇంకెక్కడి సంక్షేమం?

ప్రణాళిక కేటాయింపుల గురించి సుదీర్ఘంగా చర్చించనవసరం లేదు. ఎందుచేతనంటే ప్రభుత్వం ఇచ్చిన గణాంకాలే చెప్పాల్సినదంతా చెప్పేస్తాయి.

| | 2008-09 సం. అంచనా (కోట్లలో) | 2009-10 బడ్జెట్ కేటాయింపు (కోట్లలో) |
|---|---|---|
| వ్యవసాయం | 9969 | 10136 |
| గ్రామీణాభివృద్ధి | 48884 | 42774 |
| నీటి పారుదల | 367 | 439 |
| విద్యుచ్ఛక్తి | 98877 | 114537 |
| పరిశ్రమలు, గనులు | 27193 | 33830 |
| రవాణా | 78269 | 86218 |
| కమ్యూనికేషన్లు | 20237 | 16680 |
| సైన్సు | 8547 | 9552 |
| సాధారణ ఆర్థిక సేవలు | 5277 | 6209 |
| సామాజిక సేవలు | 89692 | 94239 |
| సాధారణ సేవలు | 766 | 1027 |
| **మొత్తం** | **388078** | **415691** |

నడుస్తున్న ప్రణాళికా సంవత్సరంలోనే సెప్టెంబర్ 2008 తర్వాత ప్రపంచ వ్యాపితంగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభం ఫలితంగా ప్రణాళిక పూర్తిగా అమలు చేయలేని నేపథ్యంలో ఈ సంక్షోభం కొనసాగి, వచ్చే ఆర్థిక సంవత్సరంలో ప్రణాళిక వచ్చే ఏడాదిలో పూర్తిగా అమలు జరుగుతుందా? అయినా నాలుగు లక్షల కోట్లలో 27 వేల కోట్ల పెరుగుదల ఏ పాటి? అదీకాక ద్రవ్యోల్బణం పన్నెండు శాతం పై నుంచి అయిదు శాతం తగ్గినా, అది ఇంకా దోబూచులాడుతోంది. ప్రస్తుత ఆర్థిక సంక్షోభంలో మళ్లీ ద్రవ్యోల్బణం పెరగబోదనే హామీలేదు.

## వ్యవసాయం

గత నాలుగేళ్లలో ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరిగింది ప్రభుత్వం తీసుకొన్న చర్యల వల్ల కాదు, వరుణ దేవుడు కరుణించడం వల్లనేనని ఏ రైతు నడిగినా చెబుతాడు. ఈ సంవత్సరం కన్నా వచ్చే ఏడాదిలో వ్యవసాయం కోసం బడ్జెట్ కేటాయింపు పెంచింది కేవలం రు. 167 కోట్లు మాత్రమే. రెండు ఆర్థిక ఉద్దీపన పథకాలతో కార్పొరేట్ రంగానికి వేల కోట్ల నిధులు కుమ్మరించిన ప్రభుత్వానికి వ్యవసాయం విషయం వచ్చేసరికి ఎంగిలి చెయ్యి విదిలించడమే. రైతులను 'హీరో' లనే పొగడ్త మాత్రమే వారికి మిగిలింది. ఏ కొత్త పథకమూ ప్రకటించలేదు. గోదాములు నిండుకోలేదు. నిండాయి సంతోషం. ఉత్పత్తి పెరిగితే ధరలు తగ్గుతాయంటారు, మరి ధరలెందుకు పెరుగుతున్నాయి? 1980 నుంచి, ముఖ్యంగా ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన అనంతరం ప్రభుత్వ పెట్టుబడులు వ్యవసాయంలోకి ప్రవహించలేదు. 80వ దశకంలో ప్రారంభంలో స్థూల జాతీయాదాయంలో నాలుగు శాతం నిధులను వ్యవసాయంలో పెట్టుబడి పెట్టగా, 2003-04 నాటికే రెండు శాతానికి పడిపోయింది. కాగా హీరోలు జీరోలు కాక ఏమవుతారు?

ఆహార భద్రత ఈ సంవత్సరంలో బాగానే ఉందంటే, ఆహార ధాన్యాల నిల్వలు పేరుకొన్నాయంటే, అది ప్రజలు ఎక్కువగా తినగలుగుతున్నారా, కొనుక్కో గలుగుతున్నారా అనేదే గీటురాయిగా ఉండాలి. కనీస ధర ఏటేటా కాస్తో కూస్తో పెంచుతూనే వస్తున్నారు సరే, అది రైతుల ఆర్థిక పరిస్థతిని మెరుగుపరిచిందా అని ప్రశ్నించుకోవాలి. నలభై శాతం రైతులు తమ వ్యవసాయాన్ని వదిలి పెట్టడానికి సిద్ధంగా ఉన్నారని సర్వేలు చెబుతున్నాయి. మరొక పరిణామం ఏమంటే రైతుల ఆదాయానికి, ఇతరుల ఆదాయనికి మధ్య అంతరం రాను రాను పెరుగుతూ వస్తోంది. రైతులు వ్యవసాయాన్నుంచి నిష్క్రమించాలని అనుకొంటే వారు ఉపాధికి ఎక్కడు వెళ్లాలి? పరిశ్రమలు వారికి ఉపాధి కల్పించలేవు. అవి ఆధునికీకరణ, రోబోటీకరణ, వైపు చూస్తున్నాయి. కాగా అవి ఉపాధి చూపించలేవు. ఏది దారి? గ్రామీణ ప్రాంతాల పారిశ్రామికీకరణ ఒక మార్గం. గ్రామీణ మౌలిక సౌకర్యాల కల్పన మరొక మార్గం. ఆగ్రో - ప్రాసెసింగ్ పరిశ్రమ ఏర్పాటు ఇంకొక మార్గం. ప్రణబ్ ముఖర్జీకి ఇవేమీ పట్టలేదు. ఆయన తాత్కాలిక ఆర్థిక మంత్రి. ఎన్నికల సంవత్సరం. ఆ తర్వాత ... రాజా భవిష్యత్తు.

## రాష్ట్రాలకు సెగ

రాజ్యాంగం ప్రకారం కేంద్రం వసూలు చేసే కొన్ని పన్నుల్లో రాష్ట్రాలకు పంపకం చేయాల్సిన మొత్తం 2008-09 బడ్జెట్ ప్రకారం రు.1,78,765 కోట్లు కాగా, సవరించిన అంచనా వచ్చేసరికి రు.1,60,179 కోట్లుకు తగ్గింది. వచ్చే సంవత్సరానికి రు.1,71,197 కోట్లకు పెంచినా, అది నడుస్తున్న సంవత్సరం బడ్జెట్‌లో కేటాయించిన దాని కన్నా ఏడున్నర వేల కోట్లు తక్కువే. ఇది రాష్ట్రాలకు ఆందోళన కలిగించే విషయం. అలాగే ప్రణాళికల అమలుకు కేంద్రం కొంతమేరకు నిధులు మంజూరు చేస్తుంది. గత ఆర్థిక సంవత్సరంలో ఈ మొత్తం రు. 75 వేల కోట్లు కాగా, రాబోయే ఏడాదిలో ఈ సహాయం రు.71 వేల కోట్లకు తగ్గనున్నది. ఇదంతా ప్రపంచ ఆర్థిక సంక్షోభం ప్రభావమే అని కొట్టి పారవేయడానికి వీలులేదు. ఎందుచేతనంటే చాలా కాలంగా రాష్ట్రాలు తమకు పన్నుల్లో రావాల్సిన వాటా యాభై శాతం తమకే రావాలని డిమాండు చేస్తున్నాయి. కేంద్రం పన్నుల వసూళ్లు, కేంద్రం పథకాల అమలు రాష్ట్రాల బాధ్యత. కాని వసూళ్లు కేంద్రానికి వెళతాయి. అయినా కేంద్రం అధీనంలో పని చేసే ఫైనాన్స్ కమిషన్లు రాష్ట్రాలకు కొసరి కొసరి వడ్డిస్తున్నాయి. ఇంత చేసినా రూపాయలో రాష్ట్రానికి పన్నుల్లో వాటాగా వచ్చేది 15 పైసలు మాత్రమే. దేశంలో కాంగ్రెసేతర పార్టీలు పాలించే రాష్ట్రాల సంఖ్య పెరుగుతోంది. ఎన్.టి.రామారావు కేంద్రం మిథ్య అన్నారు. ఈ రాష్ట్రాలన్ని ఏకమైతే ఏమవుతుందో కేంద్రంలో పాలించే పార్టీ ఆలోచించుకోవాలి.

రూపాయిలో 29 పైసలు కేంద్రం రుణాల ద్వారా ఆదాయం సేకరించుకోగా, వడ్డీ చెల్లింపులు 20 పైసలు, రక్షణ 13 పైసలు, సబ్సిడీలు 9 పైసలు మొత్తం 42 పైసలు ఉత్పత్తికి తోడ్పడని ఖర్చులే. పోనీ, సబ్సిడీలు పరోక్షంగా ఉత్పత్తికి తోడ్పడేవనుకున్నా, ఆ ఖర్చు 33 శాతం అవుతుంది అంతే. అప్పు తెచ్చి అనుత్పాదక ఖర్చులకు పోతే, అభివృద్ధి ఎలా సాధ్యం? రూపాయిలో 25 పైసలు మాత్రమే కేంద్ర ప్రణాళిక, రాష్ట్రాలకు ప్రణాళిక సహాయం కోసం ఖర్చవుతుంది. 25 పైసలతో ఏం అభివృద్ధి సాధించగలం?

ప్రధాని ఆ మధ్య సబ్సిడీల మీద గుస్సా అయి పోయారు. తగ్గించాలన్నారు. కాని ప్రస్తుత సంవత్సరంలో లక్షా ఇరవై వేల కోట్ల ఈపద్దు కింద ఖర్చు చేయబోతున్నారు. వచ్చే ఏడాదిలో ఈ పద్దు కింద కేటాయింపు 20 లక్షల కోట్లకు తగ్గనున్నదంటే, దానికి ప్రపంచ వ్యాపితంగా చమురు ధర తగ్గటమే. ఆ ధరలు మళ్లీ ఎపుడు

*ఎన్‌కౌంటర్లను హత్యకేసుగా నమోదు చేయాలని హైకోర్టు ఇచ్చిన తీర్పు నాలుగు దశాబ్దాల హక్కుల ఉద్యమ చరిత్రలో మైలురాయి వంటిదని, వివరిస్తున్నారు* **డి. సురేష్ కుమార్**

# ఎన్‌కౌంటర్లపై హైకోర్టు చరిత్రాత్మక తీర్పు

'ఎన్‌కౌంటర్లు అన్నీ పోలీసు హత్యలే' అనే నినాదం గత నలభై ఎళ్లుగా ఈ రాష్ట్రంలో అన్ని చోట్లా, మన దేశంలో ఎన్నో చోట్లా వినని వారుండరు. పల్లెల్లో, పట్టణాలలో విద్యాలయాలలో, పారిశ్రామిక వాడల్లో గోడలపై చూడనివారు, కరపత్రాలలో చదవని వారుండరు. విద్యార్థి ఉద్యమాలలో, వివిధ ప్రజాసంఘాలలో, మరీ ముఖ్యంగా హక్కుల సంఘాలతో ఏమాత్రం పనిచేసిన వారయినా సరే ఈ నినాదం పలకని వారు అసలే ఉండరు. మరే ఇతర నిర్బంధ రూపాలకన్నా మిలిటెంట్ పోరాటాలు చేసే ఉద్యమకారులను భౌతికంగానే నిర్మూలించే, ఎదురు కాల్పుల పేరిట సాగే ఈ పాశవిక అణచివేత రూపం పాలకులకు ఎంతో ముఖ్య సాధనం. సరిగ్గా అందుకే పోరాటకారులు, ఉద్యమ సంఘాలు ఈ 'దొంగ ఎదురు కాల్పుల'లలోని పాలకుల దమనకాండను పోలీసుల హత్యకాండను ప్రశ్నిస్తూ, ఎదిరిస్తూ, ఎన్నో ఆందోళనలకు దిగారు. విస్తృత ప్రచారం చేపట్టారు. ఎన్‌కౌంటర్లు మొదలయిన నాటి నించే హక్కుల సంఘాలు ఎన్‌కౌంటర్ హత్యలలో నిజా నిజాలను వెలికి తీసి నిజ నిర్ధారణ నివేదికల ద్వారా వాటి బూటకత్వం బట్టబయలు చేసేవి. కాని ప్రజలు, పత్రికలు, ప్రచార సాధనాలు ఎన్‌కౌంటర్ మరణాలు అనంటేనే బూటకపు ఎన్‌కౌంటర్లు, ఏకపక్ష పోలీసు హత్యలు అనే నిర్ధారణకు ఏనాడో వచ్చేసాయి. మొత్తం సమాజానికి అణు మాత్రం అనుమానం లేని ఈ బూటకత్వాన్ని, న్యాయ స్థానాల చేత కూడా ఒప్పించడానికి, న్యాయం పలికించడానికి మాత్రం మూడు దశాబ్దాల న్యాయ పోరాటం చేయాల్సి వచ్చింది పౌరహక్కుల సంఘాలవారికి.

---

పెరుగుతాయో, అదంతా చమురు సరఫరా చేసే దేశాల దయ. రెండవ పెద్ద సబ్సిడీ ఎరువుల సబ్సిడీ. కొత్త ఎరువుల కర్మాగారాలు స్థాపించే వరకూ, ఈ సబ్సిడీ తప్పదు. ఆ కర్మాగారాల స్థాపన కన్నా, ప్రభుత్వానికి మోటారు కార్ల పరిశ్రమల స్థాపన ముఖ్యం. ధరలను అదుపు చేయనంత కాలం ఆహార ధాన్యాల ధరలు పెరుగుతూనే ఉంటాయి. ప్రోత్సాహకాలు, మినహాయింపులు, రద్దుల పేరుతో పరిశ్రమలకిచ్చే సబ్సిడీలు ముట్టుకోవడానికి వీలులేదు. కాగా ఈ ఖర్చు ఎలా తగ్గుతుంది? ప్రధాని గుస్సా అయిపోతే ఏం లాభం? గత నాలుగైదు సంవత్సరాల్లో పరిశ్రమలు వెలుగు వెలిగి పోయాయి. విదేశాల్లో కంపెనీలను ముసేశారు. ఎగుమతులు బ్రహ్మాండంగా పెరిగాయి. లాభాలు మేటలు వేసిపోయాయి. అయినా వారికే ఆర్థిక ఉద్దీపన పథకాల పేరుతో సాయం.

### పారిశ్రామిక రంగం – బీద అరుపులు

తాత్కాలిక బడ్జెట్ అంచనాల్లో పారిశ్రామిరంగంలో ప్రభుత్వం ఏదో చేయాలని, చేస్తుందని కళ్లింత చేసుకుని ఎదురు చూసిందట. కాని వారి ఉత్సాహం నీరు కారిపోయిందట. ప్రపంచ ఆర్థిక సంక్షోభం మన దేశం మీద ప్రతికూల ప్రభావం అభివృద్ధి చెందిన దేశాల మీద చూపినంత ప్రభావం చూపక పోయినా, మొత్తం మీద ఎదురు దెబ్బ తిన్నదని ప్రణబ్ ముఖర్జీ బడ్జెట్ చెప్పనే చెబుతుంది. కాని అంతకుముందు నాలుగేళ్లలో స్వతంత్రం వచ్చిన నాటి నుంచి ఎన్నడూ లేనంతగా అభివృద్ధి సాధించింది. ఇందువల్ల ఎక్కువలో ఎక్కువగా లాభించింది పారిశ్రామిక రంగం. ముఖ్యంగా కార్పొరేట్ రంగం. వారి ఆస్తుల విలువ ఇబ్బడి ముబ్బడిగా పెరిగి, కొంతమంది ప్రపంచకుబేరుల సరసన చేరారు. వారిలో కొంతమంది బహుళజాతి సంస్థలుగా పెరిగారు. అలాంటి వాళ్లు, అయ్యో మా కొంప మునిగిపోయింది, బ్యాంకుల్లో లిక్విడిటి లేదు అని గోల చేయడమేమిటి? ప్రభుత్వం, అయ్యో పాపం అని లిక్విడిటీలని పెంచుతూ రెండు ఆర్థిక ఉద్దీపన పథకాలు ప్రకటించడ మేమిటి? ఇదికాక రిజర్వ్ బ్యాంక్ మరికొన్ని సహాయ చర్యలు తీసుకోవడమేమిటి? ఇంత చేసినా ఈ బడ్జెట్‌లో మరిన్ని చర్యలు తీసుకోవాలని అనుకోవడమేమిటి? వడ్డించేవాడు మనవాడైతే, బంతి చివరన కూర్చొన్న ఫర్వాలేదనుకొన్నట్లు, పరిపాలించేది తమ ప్రభుత్వమే కాబట్టి తప్పకుండా తమ కోర్కెలను తీరుస్తుందని అనుకొన్నారు. కాని పాలకుల లెక్కలు పాలకులకున్నాయి. పారిశ్రామికవేత్తలకు మరిన్ని సహాయ ప్రోత్సాహకాలు ప్రకటిస్తే, తమ రొట్టె నేతిలో కాదు, పొయ్యిలో పడి మాడి మసై పోతుందని వాళ్ల భయం. అదీకాక ఆర్థిక మంత్రిగా ప్రణబ్ ముచ్చట మూణ్నాళ్లే. ప్రవేశపెట్టేది అంతే తాత్కాలికం. కాగా చేతులు కాల్చుకోవటమెందుకు అని అనుకున్నారు. ఏవో సామాజిక సంక్షేమ పథకాలకు నాలుగు రూపాయలు అదనంగా కేటాయించినట్లు రూపాయల గలగలలు వినిపిస్తే నాలుగు ఓట్లు పడతాయని ఆశ. ఏమైనా ప్రభుత్వం కార్పొరేట్ అనుకూల విధానాలకు స్వస్తి చెప్పి, వ్యవసాయం, పేదరికం మీద కేంద్రీకరించటం అత్యవసరం. ఈ రెండు చేస్తే, ప్రజల చేతుల్లో నాలుగు డబ్బులు అదనంగా వచ్చి చేరుతాయి. ఖర్చు చేయగలిగే తాహతు పెరుగుతుంది. పారిశ్రామిక ఉత్పత్తులకు గిరాకీ ఏర్పడుతుంది. అది జరిగితే సబ్సిడీల భారం తగ్గుతుంది. కాని ఇలాంటి నాలుగు మంచి మాటలు చెబితే, పాలకులకు తలకెక్కవు గదా. కాంగ్రెస్ పోయి బిజెపి వచ్చినా, వైఎస్ పోయి చంద్రబాబు వచ్చినా సామాన్యుల గొంగళి ఎక్కడ వేసింది అక్కడే ఉంటుంది. వీ

ఫిబ్రవరి 6, 2009న రాష్ట్ర హైకోర్టు ఎన్‌కౌంటర్ల కేసులపై ఇచ్చిన తీర్పు ఎన్నో విధాల విశిష్టమైంది. సవివరమైనది. ఈ విషయం పై మొట్టమొదటిసారిగా మన దేశ న్యాయ స్థానాల చరిత్రలో ఐదుగురు న్యాయమూర్తులతో కూడిన విస్తృత ధర్మాసనం ఏర్పాటు చేయబడింది. ఇప్పటి వరకు ఎన్‌కౌంటర్ మరణాల కేసులకు సంబంధించి న్యాయపరమైన పలు సందేహాలను నాలుగు నిర్దిష్టమైన వాదాంశాలుగా విభజించి వాటికి ఒక్కొక్కటిగా సమాధానం చెప్పింది. అంతిమంగా ఏమని చెప్పిందంటే ఈ వాదాంశం: 1) పోలీసు అధికారి ఎవరైనా (పేరు తెలిసినా, తెలియక పోయినా) ఒక వ్యక్తి మరణానికి కారణమైతే, అది విధి నిర్వహణలో భాగమని లేదా ఆత్మరక్షణలో భాగమని చెప్పినా, ఆ సంఘటనకు ప్రాథమిక సమాచారాన్ని (ఎఫ్ఐఆర్) రికార్డ్ చేసి రిజిస్టర్ చేసి తీరాలి. ఆ తరువాత నేర ప్రక్రియ స్మృతి ప్రకారంగా క్రిమినల్ ప్రొసిజర్ కోడ్ 154(1) సెక్షన్ ప్రకారం నమోదు చేసిన ఈ నేరాన్న సెక్షన్ 156/157 ల కింద దర్యాప్తు చేపట్టాలి.

వాదాంశం (2) : భారత శిక్షాస్మృతి (ఐపిసి) ప్రకారం ఆత్మరక్షణా హత్యతో సహా శిక్షలు మినహాయించే ఏ నేరానికైనా పాల్పడిన పరిస్థితి ఉన్నదా లేదా అనేది ఎన్‌కౌంటర్ మరణం సంభవించిన ఆ కేసు దర్యాప్తు దశలో పూర్తిగా నిర్ణయించలేం. కేసు దర్యాప్తు ముగించిన పోలీసు అధికారి మేజిస్ట్రేట్ కోర్టు వారికి పంపే ఫైనల్ రిపోర్ట్ లో ఇది విచారణ యోగ్యమైన నేరం కాదని నివేదించినా అది కేవలం దర్యాప్తు అధికారి అభిప్రాయం మాత్రమే అవుతుంది. ఈ అభిప్రాయాన్ని, దర్యాప్తులో లభించిన ఇతర సాక్ష్యాధారాలతో సరిపోల్చి చూసి పోలీసు వేసిన తుది నివేదికను మెజిస్ట్రేట్ కోర్టు తిరస్కరించి సెక్షన్ 190 కింద ఆ ఘటనను విచారణాయోగ్యమైన నేరంగా పరిగణించి తదుపరి న్యాయ విచారణకు ఆదేశించవచ్చు.

వాదాంశం (3): మెజిస్టీరియల్ విచారణ పేరుతో (సి.ఆర్.పి.సి. సెక్షన్స్ 174, 175, 176 కింద) చేపట్టే విచారణ, పోలీసు దర్యాప్తుకు, న్యాయవిచారణకు ప్రత్యామ్నాయం కాదు. కేసుకు సంబంధించిన వాస్తవాలను, పరిస్థితులను తెలుసుకునేందుకు గాను ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేసి దఖలు పరచడం, దర్యాప్తు చేపట్టడం, నిందితులుగా తేలితే అరెస్ట్ చేయడం లాంటి న్యాయ ప్రక్రియలకు సి.ఆర్.సి.సి. సెక్షన్లు 154(1), 156, 157ల ప్రకారం చేపట్టాలి.

వాదాంశం (4): పోలీసు కాల్పుల వలన మరణం సంభవించిన సంఘటనల సమాచారాన్ని పోలీసు స్టేషన్‌లు చేప్పే సందర్భంలో (సి.ఆర్.సి.సి. సెక్షన్ 154(1) ప్రకారం) గాని లేదా, మెజిస్ట్రేట్ కోర్టులో ప్రైవేట్ కంప్లయింట్ చేసే సందర్భంలో (సి.ఆర్.పి.సి. సెక్షన్ 200 ప్రకారం) గాని ఆ సంఘటనకు కారకులయిన వారి పేర్లు పేర్కొనాల్సిన అవసరం లేదు. ఆ పేర్లను వెల్లడించకుండా ఉండే అధికారం ప్రభుత్వానికి, పోలీసులకు లేదు. దర్యాప్తు అధికారులకు ఉందా అనే అంశంపై ధర్మాసనం నిర్ణయం ప్రకటించలేదు. అయితే ఇది ఇంకా చర్చించాల్సిన విషయమే అయినప్పటికీ కేసు దర్యాప్తు చేసే అధికారికి మాత్రం ఆ పేర్లని తెలియపరచాల్సి ఉంటుందని పేర్కొన్నారు. అలాగే కేసు దర్యాప్తుని ఆటంకపరిచే సమాచారాన్నయినా అడ్డుకోవడం నేర చట్టాలయిన ఐపిసి, సి.ఆర్.పి.సి లకు వ్యతిరేకం అని విశ్లేషించారు.

పై తీర్పు సారాంశమేమంటే ఎన్‌కౌంటర్ మరణం సంభవించిన ప్రతి సంఘటనలోనూ ఆ నేరాన్ని నమోదు చేసి ఎఫ్ఐఆర్ దఖలు పరచి, దర్యాప్తు చేపట్టాల్సిందే. అయితే దర్యాప్తు దశలోనే ఇది ఆత్మరక్షణార్థం జరిగిన ఘటన అనే పోలీసు నివేదికతో దర్యాప్తు స్థాయిలోనే కేసు మూసివేయరాదని, కేసుకు సంబంధించిన మొత్తం సాక్ష్యాధారాలతో ఆ నివేదికను పరిశీలించి కోర్టు వారు తదుపరి విచారణకు ఆదేశించి తదనంతర చర్యలు చేపట్టవచ్చు. ఇటువంటి కోర్టు విచారణలో పోలీసులు తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకొనేందుకు పూర్తిస్థాయి విచారణ చేపట్టాలి. తప్ప ఇప్పటివరకు రోటీన్‌గా జరిపే మెజిస్టిరియల్ విచారణ (రెవెన్యూ అధికారుల విచారణ) కోర్టులో జరిగే విచారణకు ప్రత్యామ్నాయం కాదు. మినహాయింపు కాదు. నిందితులు ఫలానా అని తేలితే అరెస్ట్ కూడా చేయాలి. పోలీసు కాల్పులతో మరణానికి కారకులయిన వారి పేర్లు తెలిసినా, తెలియకున్నా కేసును పోలీస్ స్టేషన్‌లో లేదా ప్రైవేట్ ఫిర్యాదుగా మెజిస్ట్రేట్ కోర్టులో వెల్లడించాలా లేదా అనే అంశాన్ని కోర్టు వారు పూర్తిగా నిర్ధారించ లేదు కాని, ఈ కేసుల దర్యాప్తుని ఆటంకపరిచే ఏ సమాచారాన్నయినా అడ్డుకోవడం నేర చట్టాలకి వ్యతిరేకం అనే విశ్లేషణ మాత్రం చేసారు.

చట్టం ముందు అందరూ సమానులే అంటూ సామాన్య ప్రజలకు, పోలీసులకు వేరు వేరు చట్టాలు లేవు అనంటూ ఇన్నేళ్లుగా హక్కుల సంఘం వారి నాయకులు కోర్టులలో, న్యాయపోరాటం ప్రజా సంఘటనలు కోర్టు బయట చేసిన ప్రజాందోళనల ఫలితంగానే ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఈ తీర్పును ప్రకటించింది. పోలీసు ఎన్‌కౌంటర్ల బాధిత కుటుంబాలకు, ఊరటని ఇచ్చే ఈ తీర్పును సాధించడానికి మన రాష్ట్రంలో మూడు దశాబ్దాల న్యాయ పోరాటమే జరిగింది. ఈ సుదీర్ఘ పోరాట ప్రస్థానంలో యువ న్యాయవాదులు చేసిన ఎన్నో ప్రయత్నాలు ప్రయోగాలు, సీనియర్ నాయకుల కృషి, పట్టుదలతో పాటు ఆరుగురు పౌరహక్కుల సంఘాల నాయకుల గోపి రాజన్న, డా.రామనాథం, నర్రాప్రభాకర్, పురుషోత్తం, అజాం ఆలీల ప్రాణ త్యాగం కూడా ఉన్నది.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం దాఖలు చేసిన నాలుగు కేసులను కరీంనగర్ జిల్లాలో ఎన్‌కౌంటర్ బాధితుడు నర్సింహులు భార్య కొమిరె దేవవ్వ, ప్రకాశం జిల్లా నెక్కంటి, పాలుట్ల ఎన్‌కౌంటర్లో హతురాలు కె. రజిత సోదరి కె. రాధ వేసిన కేసులను కలిపి విచారించిన ధర్మాసనంలో జస్టిల్ గోడా రఘురాం, జస్టిస్ వి.వి.ఎస్. రావు, జస్టిస్ ఆర్. సుభాష్‌రెడ్డి, జస్టిస్ రమేష్ రంగనాథన్, జస్టిస్ జి. భవానీ ప్రసాద్ ఈ తీర్పు ఇచ్చారు. పిటిషనర్లు మాత్రమే కాక ఈ కేసులలో తమకు కూడా ఆసక్తి ఉందని ఆంధ్రప్రదేశ్ పోలీస్ అధికారుల సంఘం, పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్, కామన్ వెల్త్ హ్యూమన్ రైట్స్ ఇనిషియేటివ్ కూడా పాల్గొన్నాయి. ఈ కేసులలో పిటిషనర్ల తరఫున న్యాయవాదులు బొజ్జా తారకం, డి. సురేష్‌కుమార్, కె.జి. కన్నబిరాన్, నిత్యా రామకృష్ణన్, త్రిదీప్ పాయిస్, కె. బాలగోపాల్, వి. రఘునాథ్, బి. రవీంద్రనాథ్, కె. సావిత్రీ దేవి వాదించగా ప్రతివాదుల తరఫున ప్రభుత్వ న్యాయవాది, ఉదయ లలిత్, ఎస్.కె. రత్న, టి. నిరంజన్ రెడ్డి వాదించారు.

*ఆర్థిక సరళీకరణ దశలో వ్యాపారం చేయడం ప్రభుత్వం పని కాదన్న కార్పొరేట్ వర్గాలే ప్రస్తుతం నష్టాల బారినపడ్డ సంస్థలను ప్రభుత్వమే ఆదుకోవాలనడంలోని ద్వంద్వ నీతిని వివరిస్తున్నారు* **కె.వి. కూర్మనాథ్**

# ప్రభుత్వ బాధ్యత - కార్పొరేట్ ద్వంద్వ నీతి

ప్రపంచాన్ని గజగజలాడిస్తున్న ఆర్థిక మాంద్యం, 7,136 కోట్ల రూపాయల సత్యం కంప్యూటర్ సర్వీసెస్ కుంభకోణం వ్యాపారవేత్తల, రాజకీయ నాయకుల అసలు నైజాన్ని, ద్వంద్వ నీతిని బయట పెట్టాయి. సరళీకరణ, ప్రపంచీకరణ విధానాలు 1991లో మొదలయిన దగ్గరినుంచీ పాలకవర్గాలు కొత్త వాదనను ముందుకు తీసుకువచ్చేయి. అది 'బిజినెస్ ఈజ్ నాట్ ది బిజినెస్ ఆఫ్ గవర్నమెంట్' అని. అంటే వ్యాపారం చెయ్యడం ప్రభుత్వం పని కాదని, ప్రభుత్వం నిర్వహిస్తున్న లాభసాటి వ్యాపారాన్ని ప్రైవేట్ పరం చెయ్యాలని ప్రభుత్వం మీద విపరీతమైన ఒత్తిడి తీసుకు వచ్చేయి. అసెంబ్లీలో, పార్లమెంట్‌లో, మంత్రివర్గ సమావేశాల్లో, వాణిజ్య సంఘాల సదస్సుల్లో ప్రభుత్వం 'వ్యాపారం' చెయ్యడం మీద వ్యంగ్యమైన వ్యాఖ్యలు చేసేవారు. మంత్రులు, ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రి సహా అధికారులందరూ ఈ వ్యాఖ్యలను మురిపెంగా విని ఆనందించే వారు. 'నిజమే' కదా అని మనల్ని కూడా నమ్మించి వందలాది ప్రభుత్వరంగ సంస్థలను అమ్మకానికి పెట్టారు.

ప్రభుత్వ రంగ సంస్థల్లో పెట్టుబడుల ఉపసంహరణ క్రమం (కోట్లలో)

| సంవత్సరం | లక్ష్యం | సాధించింది |
|---|---|---|
| 1991-92 | 2,500 | 3,038 |
| 1992-93 | 2,500 | 1,913 |
| 1993-94 | 3,500 | 0 |
| 1994-95 | 4,000 | 4,843 |
| 1995-96 | 7,000 | 362 |
| 1996-97 | 5,000 | 380 |
| 1997-98 | 4,800 | 902 |
| 1998-99 | 5,000 | 5,371 |
| 1999-2000 | 10,000 | 1,860 |
| 2000-01 | 10,000 | 1,871 |
| 2001-02 | 12,000 | 5,632 |
| 2002-03 | 12,000 | 3,348 |
| 2003-04 | 14,500 | 15,547 |

(మూలం : ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంక్)

చాల రంగాల్లో దేశానికి స్వయం సమృద్ధిని సంపాదించి పెట్టిన సంస్థలను కారు చవకగా అమ్మేశారు. ఈ సంస్థలను అమ్మడం కోసం, ఈ ప్రక్రియను వేగవంతం చెయ్యడానికి పెట్టుబడుల ఉపసంహరణ మంత్రిత్వ శాఖను పెట్టారు. ఎప్పటికప్పుడు లక్ష్యాలను సమీక్షించి, సంస్థల అమ్మకంలో వెనుకబడితే ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించేవారు. అసమర్థమైన సంస్థల్లో డబ్బు కుమ్మరించడం దండగ అని నష్టాలు వస్తున్న సంస్థలను అమ్మించారు. 'ప్రభుత్వానికి వ్యాపారమెందుకు? సంక్షేమం మీద దృష్టి పెట్టవచ్చు కదా' అని లాభాలు వస్తున్న కంపెనీలను అమ్మించారు.

ఈ ప్రక్రియలో ప్రైవేటీకరణ జరిగిన కంపెనీలు దాదాపు యాభై. ఇందులో మోడర్న్ ఫుడ్ ఇండస్ట్రీస్, సిఎంసి, ఐబిపి, విఎస్ఎన్ఎల్, మారుతీ, ఇండియన్ పెట్రోకెమికల్స్, హిందుస్థాన్ జింక్ వంటివి ఉన్నాయి. ఏపార్టీ అధికారంలో ఉన్నా లక్ష్యాల ఏర్పాటు, ప్రభుత్వ కంపెనీలు అమ్మడం మీద ఏమాత్రం బేధాభిప్రాయం ఉండేవికావు. యశ్వంత్ సిన్హా, మన్మోహన్ సింగ్, పి.చిదంబరం, జస్వంత్‌సింగ్ – ఈ నలుగురే మొత్తం పదిహేడు సంవత్సరాల కాలం ఆర్థిక మంత్రులుగా ఉండడం యాదృచ్ఛికం కాదు. వాళ్ళు ప్రాతినిధ్యం వహించింది కాంగ్రెస్, బిజెపి ప్రభుత్వాలైనా ఆచరించినవి అవే విధానాలు.

పాలకులు నమ్మబలికినట్టు, వ్యాపారవేత్తలు ప్రచారం చేసినట్టు ప్రభుత్వరంగ సంస్థలు చేసింది కేవలం వ్యాపారం మాత్రమే కాదు. ప్రైవేట్ రంగం ఉత్సుకత చూపని రంగాల్లో ఈ సంస్థలు పనిచేసి, ఎన్నో ఉపయోగకరమైన వస్తువులు, సర్వీసులు అందించాయి. అంతకంటే ముఖ్యంగా దాదాపు ఇరవై రెండు లక్షల మందికి నేరుగా ఉపాధి కల్పించాయి. ఈ అంశాన్ని పక్కన పెట్టి బంగారు గుడ్లను పెట్టే కోళ్లను తమ వశం చేసుకోవడానికి 'బిజినెస్ ఈజ్ నాట్ ది బిజినెస్ ఆఫ్ గవర్నమెంట్' అన్న వాదనను తీసుకొచ్చాయి. ఇది ఒక అంశం.

మరొక ముఖ్యమైన అంశం ఏమిటంటే, వ్యాపార రంగంలో, స్టాక్ మార్కెట్లలో, పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ జోక్యం ఉండకూడదన్న వాదన కూడా ఈ కాలంలోనే బలంగా వచ్చింది. తమ వ్యాపారాలకు లైసెన్స్ రాజ్ (అన్నింటికీ లైసెన్సులంటూ) అడ్డుతగలకూడదని, కార్మిక చట్టాలను ఎత్తివేసి మార్కెట్ శక్తులకే కార్మికులను అప్పజెప్పాలని, ఎప్పుడు బడితే అప్పుడు, ఎలా బడితే అలా కార్మికులను తీసివేసే అధికారం ఉండాలని పారిశ్రామిక వేత్తలు పట్టుపట్టారు. ఎన్ని చేసినా ఏవో

అడ్డంకులు వస్తున్నాయి కాబట్టి ప్రత్యేక ఆర్థిక మండలాలు పెట్టి పారిశ్రామికవేత్తలకు స్వతంత్ర భూభాగాలను కట్టబెట్టాయి ప్రభుత్వాలు.

అంటే, ఒకవైపు ప్రభుత్వరంగ సంస్థలను అమ్మించడమే కాకుండా, మరోవైపు తమ విశృంఖలమైన లాభాల వేటకు ప్రభుత్వాలు అడ్డు రాకూడదని ప్రైవేట్ రంగం వాదిస్తూ వచ్చింది గత రెండు దశాబ్దాలుగా.

కానీ, చిత్రంగా గత నాలుగైదు నెలలుగా, ముఖ్యంగా 'సత్యం' సంక్షోభం మొదలైన రెండు నెలలుగా, ప్రైవేట్ రంగం స్వరం మారింది. సిఐఐ, అసోచామ్, ఫిక్కి వంటి వాణిజ్య సంఘాలు ప్రత్యేక ప్యాకేజీలు ఇవ్వాలని ప్రభుత్వాన్ని వేడుకుంటున్నాయి. కుదేలయిన ప్రైవేట్ రంగాన్ని ఆదుకోవాలని డిమాండ్ చేస్తున్నాయి. ఇబ్బడి ముబ్బడిగా లాభాలు వస్తున్నప్పుడు ఒకలాగా మాట్లాడి, ఇప్పుడు పూర్తిగా వేరే పల్లవి అందుకున్నాయి.

ద్రవ్యోల్బణం పెరిగి నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి ప్రజలు విలవిల్లాడుతుంటే పట్టించుకోని రిజర్వ్ బ్యాంక్, ప్రభుత్వం, ప్రైవేట్‌రంగం వేడుకోలుని వెంటనే పట్టించుకుంది. వడ్డీ రేట్లను తగ్గించడం ద్వారా 2,75,000 కోట్ల రూపాయలను బ్యాంకులకు అందుబాటులోకి తెచ్చింది. పారిశ్రామికవేత్తలకు మదుపర్లకు ఉపయోగపడటం దీని ఉద్దేశం.

ఇదికాక ప్రభుత్వం మరో నలభై వేల కోట్ల రూపాయల ఆర్థిక ఉద్దీపన ప్యాకేజీని ప్రకటించింది. అంతే కాక తాజాగా కస్టమ్స్, సర్వీస్ టాక్స్‌లను తగ్గించడం ద్వారా ప్రభుత్వం మరో ముప్పై వేల కోట్ల నష్టానికి సిద్ధపడింది. కస్టమ్స్ డ్యూటీలు, సర్వీస్ టాక్స్‌లు తగ్గించడం వల్ల ధనిక, మధ్యతరగతి వినియోగదారులకు లాభం కల్పించడం, తద్వారా మిగిలించుకున్న సొమ్ముతో వాళ్లు మరిన్ని వస్తువులు, సర్వీసులు కొంటారని, పరిశ్రమలకు లాభం కలుగుతుందని అసలు ఉద్దేశం. నేరుగా నిత్యావసర వస్తువులు తగ్గించే చర్యలు తీసుకుంటే ప్రజలకు ఇంకా ఉపయోగం కదా అన్న సందేహం రావచ్చు, కానీ అందువల్ల పరిశ్రమలకు ఒరిగేదేమీ లేదు. కాబట్టి ప్రభుత్వం ఆ పని చెయ్యదు. పైగా ఈ రాయితీలకు వెలుపల అరవై కోట్లమంది దిగువ మధ్యతరగతి పేద ప్రజలున్నారు. అంటే ప్రభుత్వం ప్రేమ వినియోగదారులైన ప్రజల మీదనే!

ఈ పథకాలను విని వాణిజ్య సంఘాల కళ్లలో ఆనందభాష్పాలు రాలాయి. చప్పట్లు కొట్టారు. 'శభాష్' అన్నారు. వేనోళ్ల కీర్తించారే కానీ, ప్రైవేట్ వ్యాపార రంగం కార్యక్షేత్రంలోకి ప్రభుత్వం ఎందుకు వచ్చిందనీ, ప్రభుత్వం వేలుపెట్టి వ్యాపారాన్ని తగలెడుతుందనీ ఎవ్వరూ ఒక్క మాట అనలేదు. 'ప్రొటెక్టింగ్ బిజినెస్ ఈజ్ నాట్ ది బిజినెస్ ఆఫ్ గవర్నమెంట్' అని ఏ వాణిజ్య సంఘమూ అనలేదు.

'ఇలా చేస్తేనే ఆ కంపెనీలు నిలబడతయనీ, అప్పుడే ఉద్యోగాలు పోకుండా ఉంటాయనీ, వాళ్లు వాదించవచ్చు. నిజమే. కానీ ప్రైవేట్ కంపెనీలు ఇష్టానుసారం ఉద్యోగాలు తీసివెయ్యకుండా చూసే చట్టాలు (ఇవి ఎంతగా పనిచేస్తున్నాయన్నది వేరే సంగతి) ఉంటే ఎందుకు అభ్యంతర పెట్టాలి? వ్యవసాయ రంగానికి సబ్సిడీలు ప్రకటిస్తే, రైతుల రుణ బకాయిలను రద్దు చేస్తే గుండెలు బాదుకునే పారిశ్రామికవేత్తలు, టాక్స్ రాయితీల ద్వారా ముప్పై వేల కోట్ల రూపాయలు పరిశ్రమలకిస్తే తప్పునిపించదు.

ఇక 'సత్యం' విషయానికి వద్దాం. జనవరి 7, 2009న రామలింగ రాజు చేసిన ప్రకటనతో ఆ కంపెనీ సంక్షోభంలో పడితే, రెండు రోజుల్లో బోర్డును రద్దు చేసి, ముగ్గురు సభ్యులతో కొత్త బోర్డును ఏర్పాటు చేసింది ప్రభుత్వం. మరికొన్ని రోజుల్లో మరో ముగ్గురిని చేర్చింది. బ్యాంకింగ్ (దీపక్ పారెఖ్), ఇన్సూరెన్స్ (మైనక్), ఆడిటింగ్ (మనోహరన్) స్టాక్ మార్కెట్ (అచ్యుతన్), ఐటి (కిరణ్ కార్నిక్) రంగాల్లో విశేష అనుభవమున్న వారిని రంగంలోకి దించింది ప్రభుత్వం. దాదాపు 53,000 మంది ఉద్యోగుల భవిష్యత్తు దృష్ట్యా ఇది చాలమంచి నిర్ణయమన్న దాంట్లో బేధాభిప్రాయం లేదు. మెరుపు వేగంతో ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలను భారత కార్పొరేట్ రంగం చాలా మెచ్చుకుంది. 'సత్యం'ను అమ్మివేసే ప్రక్రియను వేగవంతం చేసే దిశలో ఈ నిర్ణయాలు ఉపయోగపడతాయని పొగిడింది. అంతేకాని 'బిజినెస్ ఈజ్ నాట్ ది బిజినెస్ ఆఫ్ ది గవర్నమెంట్'

**రాష్ట్రాల్లో ప్రభుత్వరంగ సంస్థల స్థితిగతులు**

| రాష్ట్రాలు | కంపెనీల సంఖ్య | ప్రైవేటీకరించబడినవి | ప్రైవేటీకరణ కానున్నవి | మూసివేయబడ్డవి | లాభాల్లో ఉన్నవి | నష్టాల్లో ఉన్నవి |
|---|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 128 | 30 | 0 | 22 | 15 | 25 |
| తమిళనాడు | 82 | 0 | 39 | 11 | 34 | 47 |
| అరుణాచల్‌ప్రదేశ్ | 5 | 0 | 0 | 2 | 0 | 0 |
| అస్సాం | 42 | 0 | 0 | 5 | 3 | 36 |
| బీహార్ | 54 | 0 | 0 | 30 | 8 | 0 |
| ఢిల్లీ | 15 | 0 | 0 | 0 | 5 | 3 |
| గోవా | 16 | 0 | 0 | 0 | 0 | 0 |
| గుజరాత్ | 49 | 3 | 0 | 6 | 22 | 24 |
| హర్యానా | 28 | 1 | 0 | 2 | 12 | 16 |
| హిమాచల్‌ప్రదేశ్ | 21 | 0 | 0 | 0 | 8 | 13 |
| జమ్ముకాశ్మీర్ | 23 | 0 | 0 | 2 | 3 | 16 |
| కర్నాటక | 79 | 0 | 5 | 12 | 32 | 38 |
| కేరళ | 109 | 0 | 15 | 23 | 34 | 59 |
| లక్షద్వీప్ | 1 | 0 | 0 | 0 | 0 | 0 |
| మధ్యప్రదేశ్ | 34 | 0 | 0 | 6 | 0 | 0 |
| మహారాష్ట్ర | 66 | 0 | 3 | 0 | 18 | 44 |
| మణిపూర్ | 16 | 0 | 0 | 2 | 0 | 0 |
| మేఘాలయ | 13 | 0 | 0 | 1 | 3 | 10 |
| మిజోరాం | 6 | 0 | 0 | 0 | 1 | 4 |
| నాగాలాండ్ | 6 | 0 | 0 | 0 | 0 | 3 |
| ఒరిస్సా | 67 | 1 | 0 | 1 | 14 | 10 |
| పాండిచ్చేరి | 11 | 0 | 0 | 0 | 5 | 5 |
| పంజాబ్ | 53 | 1 | 4 | 24 | 10 | 25 |
| రాజస్థాన్ | 29 | 1 | 0 | 1 | 11 | 11 |
| సిక్కిం | 11 | 0 | 0 | 2 | 0 | 0 |
| త్రిపుర | 9 | 0 | 0 | 0 | 0 | 0 |
| ఉత్తరప్రదేశ్ | 104 | 0 | 24 | 23 | 30 | 68 |
| పశ్చిమ బెంగాల్ | 81 | 0 | 10 | 5 | 20 | 62 |
| **మొత్తం** | **1158** | **35** | **103** | **180** | **288** | **519** |

(మూలం : ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంక్ రిపోర్ట్)

*ముంబయి దాడుల నేపథ్యంలో వచ్చిన యూపా సవరణ చటాన్ని హక్కుల సంఘం నేతపై ప్రయోగించడంలో ఆ చట్టం ఎందుకో బయటపడిందంటున్నారు* **ఎ. స్నేహలత**

# కొత్త చట్టం - హక్కుల నేతపై దాడి

గత నాలుగు దశాబ్దాలుగా హక్కుల ఉద్యమానికీ, పౌరహక్కుల సంఘం కార్యకర్తలకూ నిత్యం సవాళ్లే. ఒక హక్కుల సంఘం మీద నిర్బంధాన్ని అమలు చేయడం దౌర్భాగ్యం. సమాజం ముందు అందుకేన్నో తార్కాణాలు. ఇంతటి సుదీర్ఘ నిర్బంధ నేపథ్యం కలిగిన హక్కుల సంఘం చరిత్రలోకి ఇవాళ యూపా (యు.ఎ.పి.ఎ. - అన్ లాఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్) వచ్చి చేరి గతంలో టాడా, పోటా టెర్రరిస్ట్ చట్టాలు సాధించిదేమిటో, మిగిల్చిందేమిటో తెలిసిందే. నేడు వీటికి మారుపేరుగా ముంబాయి దాడుల్లో భాగంగా యూపా చట్టాన్ని తెచ్చిందీ ప్రభుత్వం. ఈ చట్టం ఏ పెను ప్రమాదాన్ని తెస్తుందో ఊహిస్తుండగానే హక్కుల సంఘం నాయకుడు సల్లంగి సుగునాథం మీద ప్రయోగించింది. అప్పుడే ఒక చేదు అనుభవాన్ని ప్రజలకందించింది.

నిజానికి ఎంత కఠినమైన చట్టాలైనా ఏ సామాజిక మార్పుకు దోహదం చేయలేవు. అందుకు నేరాల సంఖ్యే సాక్ష్యం. అయినా కొత్త పేర్లతో కొత్త చట్టం తెచ్చి అంతిమంగా ప్రజల మీద, ప్రజా ఉద్యమాల మీద నిర్బంధాన్ని అమలు చేస్తున్నాయి పాలక పార్టీలు. ఎందుకంటే ఈ దేశ రాజకీయ వ్యవస్థ పేదలను, మహిళలను, ఆదివాసులను, దళితులను, మైనారిటీలను ఒక అంధవిశ్వాసంతో, ఒక అజ్ఞానంతో పెంచాలి. ఇంకా ఈ శ్రామిక ప్రజల మధ్య వైరుధ్యాలను దోపిడీకి సోపానాలుగా ఉపయోగించుకోవాలి. అందుకే ఆ ప్రజలకి గొంతు, జ్ఞానం, అనుభవం ఉండకూడదు. వీటన్నిటినీ లేకుండా చేసే స్థితి సమాజంలో ఉండేలా ఎంతో జాగ్రత్తపడతాయి పాలకవర్గాలు.

ఒక పక్క ఈ దేశంలో ప్రతి మనిషి తనకు నచ్చిన రీతిలో జీవించవచ్చు. ఇష్టమైన కుల, మత, రాజకీయ విశ్వాసాలను కలిగి ఉండొచ్చని రాజ్యాంగం చెబుతోంది. మరోపక్క రాజ్యమే ఈ అభివృద్ధి మీద, ఈ హక్కులమీద ఆంక్షలు విధిస్తోంది. ప్రజల మనోభావాల్ని, చైతన్యాన్ని క్రూరంగా అణచివేస్తోంది. అంతేకాదు పెట్టుబడిదారుల, రాజకీయ నాయకుల అభివృద్ధికి పేద ప్రజల ఉపాధి, భూమి, వనరులు తాకట్టు పెట్టబడుతుంది. ఈ విధ్వంసంలో ప్రజల ఆశనూ, భరోసానూ,

---

అని ఈసడించుకోలేదు, వెక్కిరించలేదు. ఒక కంపెనీ అసమర్థతకు ఇంతమంది ఎందుకు సమయం వెచ్చించాలని వాదించలేదు. (ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేట్ పరం చెయ్యడానికి, మూసి వెయ్యడానికి పారిశ్రామికవేత్తలు ఉపయోగించిన అస్త్రం వాటి 'అసమర్థత')

ఒక దశలో 'సత్యం'కు ప్రభుత్వం రెండువేల కోట్ల రూపాయలు ప్యాకేజీ ఇచ్చే యోచన కూడా చేసింది.

ఇక్కడ ప్రభుత్వ ఆరాటం కాని, కార్పొరేట్ ప్రపంచం ఆతృత ఏమిటంటే ప్రపంచీకరణ మోడల్‌కు ముద్దు బిడ్డ అయిన ఐటి రంగాన్ని కాపాడుకోవడం. సత్యం మూతపడితే ఐటి రంగం ఇమేజికి తీరని నష్టం. అందుకే ప్రభుత్వం, ప్రతిపక్షం, కార్పొరేట్ రంగం ఈ కుంభకోణం గురించి మాట్లాడరు. ప్రభుత్వ వైఫల్యాలను, తమకు చెయ్యని ఉపకారాల గురించి రోజూ మాట్లాడే వాణిజ్య సంఘాలు, కార్పొరేట్లు సత్యం కుంభకోణం గురించి మాట్లాడవు. అట్లాంటివి నూటికో కోటికో జరిగే సంఘటనలుగా కొట్టిపారేస్తాయి. 'ఆ కంపెనీని అలా వదిలేస్తే అన్ని వేలమంది ఉద్యోగుల మాటేమిటి?' అని నిలదీస్తాయి. ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి కూడా అదే తమ బాధ అని అంటాడు.

కానీ కార్పొరేట్ రంగం చాలలి తెలివిగా విస్మరించిన విషయమేమంటే 1991-2000 మధ్యకాలంలో అంటే కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థల ప్రైవేటీకరణ జరుగుతున్న కాలంలో, ఐదులక్షల మంది ఉద్యోగాలు కోల్పోయారు. ఇవికాక వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన 1,158 కంపెనీల్లో దాదాపు రెండు వందల సంస్థలు మూతపడ్డాయి. ఐదు వందలకి పైగా నష్టాల్లో ఉన్నాయి. ఈ కంపెనీల్లోని వేలాది ఉద్యోగులు కూడా జీవనోపాధి కోల్పోయారు. ఒక్క మన రాష్ట్రంలోనే ఉన్న 128 ప్రభుత్వ రంగ సంస్థల్లో 22 మూతపడగా, 25 నష్టాల్లో ఉన్నాయి. పశ్చిమ బెంగాల్‌లో ఉన్న 81 ప్రభుత్వ రంగ కంపెనీల్లో 62 నష్టాల్లో ఉండగా, ఐదు మూతపడ్డాయి.

ఇక ప్రైవేట్ రంగంలో చూస్తే ఒక్క మన రాష్ట్రంలోనే ఇరవై లేదా అంతకంటే ఎక్కువ పనిచేసే సంస్థల్లో సగానికి పైగా (12,066 కంపెనీ నమోదైతే బతికి బట్టకట్టినవి 6,026 మాత్రమే) మూతపడ్డాయి. వీటి లెక్క తీస్తే ఎన్ని లక్షల మంది ఉద్యోగాలు కోల్పోయి ఉంటారో?

మరి ఈ కంపెనీలు, ఉద్యోగులు ఏం పాపం చేసాయి? ఆయా రంగాల్లో ఉద్దండుల్ని - దీపక్ పారెఖ్, రతన్ టాటా, కుమారమంగళం, బిర్లా, లక్ష్మీ మిట్టల్, నారాయణమూర్తి, అంబానీ, జిందాల్ వంటి వాళ్లని కూడా ఈ కంపెనీల బోర్డుల్లో వేసి, చక్రం తిప్పించి, రాయితీలు యిప్పించి, ఈ కంపెనీలను బతికిస్తే ఎన్ని లక్షల కుటుంబాలకు ఉపయోగమో కదా! వీ

ఊరటనూ సుదీర్ఘంగా ఎలా కాలరాస్తోందో మొదటే చెప్పుకున్నాం. పౌరహక్కుల సంఘం నాయకులు, కార్యకర్తలు పోలీసుల బెదిరింపులకు, దాడులకు, అరెస్టులకు, జైళ్లకు, హత్యలకు బలవుతూనే ఉన్నారు. ఆరుగురు అమరుల నెత్తుటి చరిత్ర కళ్లెదుటే ఉంది. ఈ రోజు యూపా చట్టం రూపంతో నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నాడు సుగునాధం.

సల్లంగి సుగునాధం ఒక ఆదివాసీ. విశాఖ మన్యంలో మారుమూల గ్రామంలో పుట్టాడు. కష్టాన్నీ, కన్నీటినీ తుడుచుకున్నాడు. అనాదిగా ఆదివాసీ సమాజం అనుభవిస్తున్న దోపిడీని తన అనుభవంలోంచి మరింత లోతుగా చవి చూసాడు. చేదు అనుభవాలెన్నో నేర్పిన జ్ఞానం నిరంతరం తన ఆదివాసీ ప్రజల హక్కుల కోసం పరితపించేలా చేసింది. గిరిజన హక్కుల పరిరక్షణ కమిటీ (ఒ.పి.జి.ఆర్.) లో భాగమయ్యాడు. విశాఖ ఆదివాసీ ప్రజల్లో రాజకీయ, ఆర్థిక, సామాజిక మార్పు కోసం చైతన్యాన్ని తెస్తున్న ఒ.పి.జి.ఆర్. ని నిషేధించింది ప్రభుత్వం. ఒక సంఘాన్నీ, ఒక వర్గ ప్రజల సంఘటిత శక్తిని ధ్వంసం చేసింది. అయినా తను హక్కులను కాపాడుకోవాలనీ పౌరహక్కుల సంఘంలో చేరాడు సుగునాధం. సుమారు పద్దెనిమిది సంవత్సరాలుగా హక్కుల సంఘాలలో క్రియాశీలకంగా పనిచేస్తూ వచ్చాడు. ఈ క్రమంలోనే ఎ.పి.సి.ఎల్.సి. రాష్ట్ర సహాయ కార్యదర్శిగా ఎదిగాడు. ఇది పోలీసులకు నేరమైంది.

సుగునాధం గిరిజన కార్పొరేషన్ ఉద్యోగి. భార్యా ముగ్గురు బిడ్డలతో పాడేరులో తన ఆదివాసీ ప్రజల మధ్య సహజీవనం సాగిస్తున్నాడు. ఆ ప్రజల్లో కష్టాల్లో, కన్నీళ్లలో భాగమయ్యాడు. తమ మెరుగైన జీవనం కోసం పాటుపడ్డాడు. ఇది పోలీసులకు, ప్రభుత్వానికీ, పాలకులకు కంటగింపయ్యింది.

విశాఖ మన్యంలో ఆదివాసుల బతుకు అధ్వానం. చుట్టూ కటిక దారిద్ర్యం, ఆకలి, అంతులేని మలేరియా మరణాలు. నీరు లేదు, తిండి లేదు. చదువు లేదు. రహదారి లేదు. ఆకో, అలమో, పండో, కాయో ఇచ్చే పచ్చని అడవి పై ఆదివాసేతరుల, దళారుల ఆగడాలు, మోసాలు ప్రభుత్వానికి పట్టవు. ఇది సహించలేక ప్రజలు 1/70 అమలు కోసం పోరాడుతున్నారు. ఇది ఆ ప్రజల హక్కన్నాడు సుగునాధం. అంతేకాక ఆదివాసుల బతుకుల్నీ, జీవనాధారాన్నీ, నిలువనీడను నాశనం చేసే బాక్సైట్ తవ్వకాన్ని వ్యతిరేకిస్తున్న ప్రజలకు అండగా నిలిచాడు. ప్రచారం చేసాడు. హాస్టల్‌లో ఆదివాసీ యువత అసహజ మరణాలకు, అత్యాచారాలకు స్పందించాడు. మావోయిస్టుల కోసం పోలీసులు గ్రామాలపై దాడి చెయ్యడాన్నీ, యువతను అక్రమకేసులకు, నిర్బంధానికీ గురిచేయడాన్ని ప్రశ్నించాడు. ఆ బాధిత కుటుంబాలకు అండగా నిలిచాడు. పోలీసుల బూటకపు ఎన్‌కౌంటర్లను ఎన్నింటినో బట్టబయలు చేసాడు.

వాకపల్లిలో పదకొండు మంది ఆదివాసీ మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసులు చేసిన అత్యాచారాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమించిన ప్రజలతో మమేకమయ్యాడు. తమ సమస్యల మీద పోరాడుతున్న ఆదివాసీలను మావోయిస్టులుగా చిత్రీకరించి చంపడాన్ని, అరెస్ట్ చేయడాన్ని తీవ్రంగా ఖండించాడు. ఇలా తన చుట్టూ ఉన్న ఆదివాసీ ప్రపంచంలో అనుక్షణం ఎదురవుతున్న ప్రతీ అన్యాయం మీద, విధ్వంసం మీద పౌరహక్కుల సంఘం ప్రతినిధిగా స్పందించాడు. అందులో ఆ ప్రజల అభివృద్ధిని ఆకాంక్షించాడు. దానికీ ప్రభుత్వం, పోలీసులు ఇచ్చిన ప్రతిఫలం బెదిరింపులు, ఇంటి పై దాడులు, స్నేహితులనీ, చుట్టాలని బెదిరించడం సుగునాధం కుటుంబాన్ని అభద్రతకు గురిచేసారు. పౌరహక్కుల సంఘానికి రాజీనామా చేయమని ఒత్తిడి తెచ్చారు. చివరకు ఉద్యమకారులు చంపిన జడ్.పి.టి.సి. వైస్ చైర్మన్ సమిడ రవిశంకర్ హత్యకేసును, పాడేరు ఎం.ఆర్.ఓ. ఆఫీసు పేల్చివేత కేసును బనాయించి జూలై 22, 2007న అరెస్ట్ చేసారు. ఉద్యోగం నుండి సస్పెండ్ అయ్యాక బెయిల్ మీద వచ్చిన సుగునాధం తోటి ఉద్యోగ సంఘాల సహకారంతో మళ్లీ విధుల్లో చేరాడు. ఇంటి చుట్టూ, ఆఫీసు చుట్టూ అడుగడుగునా పోలీసుల ఆటంకాలు. ఆందోళనకి గురిచేసే చర్యలు. స్టేషన్‌కి రమ్మని అనధికారిక నోటీసులు. సంతకం పెట్టడానికి స్టేషన్‌కి పోతే గంటల తరబడి నిర్బంధం, ఇంకా ఉద్యమకారుల ప్రతీచర్యకి సుగునాధాన్ని బాధ్యుడిగా చిత్రీకరిస్తున్నారు. మరింత దుర్మార్గంగా ఈ పోలీసులు బీసాయి జగన్ (18)ని అరెస్ట్ చేసి సుగునాధాన్ని హత్య చేయమన్నారు. ఒత్తిడి తెచ్చారు. డబ్బు, ఉపాధి ఆశ చూపారు. పోలీసు చెర నుండి బయటపడ్డ జగన్ కలెక్టర్‌కి, మానవహక్కుల కమిషన్‌కి, పత్రికలకి మొరపెట్టుకున్నాడు. ఇలా నిత్య నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నాడు. అయినా సుగునాధం ఆత్మస్థైర్యంతో అన్యాయాల్ని ప్రశ్నిస్తూనే ఉన్నాడు. గత నెల 20న ఒరిస్సాలోని కోటిపల్లి గ్రామంలో ఇద్దరు ఆదివాసీ రైతులను, ఒక మహిళను విశాఖ పోలీసులుకాల్చి చంపారు. వారంతా ఉద్యమకారులన్నారు. సుగునాధం హక్కుల సంఘం బాధ్యుడిగా నిజనిర్ధారణతో వాస్తవాల్ని బట్టబయలు చేసాడు. ఒరిస్సా ప్రభుత్వం మెజిస్ట్రేట్ విచారణతో నిజాల్ని వెల్లడించాడు. విశాఖ ఎస్.పి. సబర్వాల్ దీన్ని సహించలేకపోయాడు. కక్షతో సుగునాధాన్ని ఉద్యోగం నుండి సస్పెండ్ చేయాలని ఫిబ్రవరి 5న సస్పెన్షన్ పనిమీద హెడ్ ఆఫీసుకు విశాఖ వచ్చిన సుగునాధాన్ని మిత్రులతో మాట్లాడుతుండగా 15 మంది పోలీసులు బలవంతంగా లాక్కెళ్లారు. ఫలానా కేసులో అరెస్ట్ చేస్తున్నారనే సమాచారం లేదు. సుమారు పద్దెనిమిది గంటలపాటు బంధువులను, మిత్రులను, ప్రజలను భయానికి గురిచేసారు. ఎవరు తీసుకెళ్లారో తెలియని మిత్రులు స్థానిక పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేయగా రాత్రి రెండు గంటల వరకు ఫిర్యాదు తీసుకోకుండా వేధించారు. ప్రజా సంఘాలన్నీ స్టేషన్ ముందు ఆందోళన చేసాక మరునాడు పన్నెండు గంటలకు పోలీసులే తీసుకెళ్లారని ఆ స్టేషన్ సి.ఐ. చెప్పాడు. అప్పటి వరకు భార్యాబిడ్డలు మానసిక వ్యధకు గురయ్యారు. పోలీసుల అరెస్ట్ ఎంత అప్రజాస్వామికంగా, నిర్దయగా ఉంటుందో మరోసారి రుజువు చేసారు. అంతేకాదు, ఒక హక్కుల సంఘం ప్రతినిధి, అందునా ఆదివాసీ మీద 'యూపా' చట్టం కింద కేసు పెట్టడం ఇంత కన్నా అన్యాయం మరొకటుంటుందా? ఆదిలోనే ఈ చట్టం ఎంత దుర్వినియోగమో చూసాం. భవిష్యత్తులో ఇంకెంతగా మారబోతుందో ఊహించలేం. ఒక ఆదివాసీ నిస్వార్థంగా, నిర్భయంగా హక్కులడిగితే, ప్రజల భద్రత అడిగితే, అబద్ధాలతో కఠినమైన చట్టంతో జైల్లో బంధించిందీ రాజ్యం. విచ్చలవిడి పోలీసు అధికారాన్ని ప్రశ్నించాలి. అంతేగాక పీడిత ప్రజల జీవితాలను చిన్నాభిన్నం చేస్తున్న టెర్రరిస్టు చట్టాల రద్దు కోసం ఉద్యమించాల్సిన బాధ్యత ప్రతీ పౌరుడి మీద ఉంది. వీ

*ప్రభుత్వం చేపడుతున్న కోస్తా కారిడార్ వల్ల మానవ వనరుల విధ్వంసం జరగడమే కాకుండా, పర్యావరణం పై, ప్రజల ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం పడుతుందంటున్నారు* **ఎం. శ్రీనివాసరావు**

# కోస్తా కారిడార్ - పర్యావరణ సమస్యలు

రోజూ దినపత్రికలు చూస్తున్నవారు తరచూ రెండురకాల ప్రభుత్వ ప్రకటనలు గమనించవచ్చు. ఒకటి భూసేకరణ ప్రకటనలు, రెండు ప్రజాభిప్రాయ సేకరణ ప్రకటనలు. రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిన కోస్తాకారిడార్, ప్రత్యేక ఆర్థిక మండలాలలు, జలయజ్ఞం, వివిధ రకాల ఖనిజ తవ్వకాలకోసం ఈ ప్రకటనలు జారీ చేస్తోంది. భూసేకరణ ప్రక్రియ వేగంగా సాగిపోతోంది. కాకినాడ, పోలేపల్లి లాంటి చోట్ల ప్రజలు ప్రతిఘటిస్తున్నారు తప్ప మిగతా చోట్ల అడ్డూ అపు లేకుండా సాగుతోంది. దీని మీద ఇప్పటికే చాలా చర్చ జరిగింది. అయితే కోస్తా కారిడార్, ప్రత్యేక ఆర్థిక మండలాలలో వస్తున్న పరిశ్రమలు పర్యావరణం పై వాటి ప్రభావం జలయజ్ఞం, ఖనిజతవ్వకాలు పర్యావరణంపై వీటి ప్రభావం గురించి కొన్ని స్వచ్ఛందసంస్థలు ఆందోళన వ్యక్తం చేస్తున్నె తప్ప దీనిపై జరగాల్సినంతగా చర్చ జరగడం లేదు. భూసేకరణ ప్రజలు ఎదుర్కొంటున్న తక్షణ సమస్య. పర్యావరణంపై ప్రభావం అనేది దీర్ఘకాలిక సమస్య. ఏదైనా పర్యావరణంపై వీటి ప్రభావం, ఫలితాల గురించి ప్రజలలో అవగాహన కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. ప్రజలలో చర్చ జరిగి, ప్రజలు ఆమోదించిన తర్వాత ఈ కార్యక్రమాలు ప్రారంభించాలి. కాని పారిశ్రామికవేత్తల కొమ్ము కాస్తున ప్రభుత్వం ఇవేవీ పాటించకుండానే ఈ కార్యక్రమాలను ప్రారంభించి తూతూ మంత్రంగా పర్యావరణంపై చర్చ నడిపిస్తోంది. కనుక ప్రజాస్వామిక వాదులు, పర్యావరణ వేత్తలు, ప్రజాసంఘాలు పర్యావరణంపై ప్రజల్లో అవగాహన కల్పించవలసిన అవసరం ఉంది. అందులో భాగంగా కోస్తా కారిడార్, కొత్తగా వస్తున్న పరిశ్రమలు పర్యావరణంపై వాటి ప్రభావం గురించి చిన్నపాటి చర్చ చేయడమే ఈ వ్యాసం ఉద్దేశం.

నెల్లూరుజిల్లాలో తడ మండలం మాంబట్టులో అపాచీ చెప్పుల కంపెనీ ఉత్పత్తి ప్రారంభించింది. అందులో నుండి వచ్చే తుక్కును తగలబెట్టడం వల్ల పరిసర గ్రామాల ప్రజలు పొగవల్ల వచ్చే కార్బన్ మోనాక్సైడ్ తదితర వాయువుల బారినపడ వలసి వస్తోంది. అందులో నుండి వచ్చే వ్యర్థ జలాలు కాలువల ద్వారా చెరువులలోనికి వదులుతున్నారు. ఫలితంగా ప్రజలు కలుషిత జలాలు తాగవలసి వస్తున్నది. ఇంకా ఆ చుట్టు పక్కల విరివిగా పరిశ్రమలు ప్రారంభమ వుతున్నాయి. ఇవన్నీ ప్రారంభమైతే అక్కడి పరిసరాలు, భూగర్భ జలాలు కలుషితమై పరిసర గ్రామాల ప్రజలు ఖాళీచేయవలసిన పరిస్థితులు ఏర్పడతాయి.

అలాగే కృష్ణపట్నం పోర్టు ప్రారంభమై బళ్ళారి, ఓబుళాపురంల నుండి ఇనుపమట్టి చైనా, జపాన్, అమెరికావంటి దేశాలకు ఎగుమతి అవుతోంది. ఇనుప ఖనిజాన్ని రవాణా చేసే లారీలు వెళ్లే రహదారి ఇరువైపులా ఎర్రమట్టి ధూళిపొర ఏర్పడి పంట పొలాలు, ఉప్పుకొటార్లు నాశనమై పోతున్నాయి. కాలుష్య నియంత్రణ మండలి అధికారుల పరిశీలనలో నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు వద్ద గాలిలో దుమ్ముశాతం ఉండవలసిన దానికంటే ఎనిమిదిరెట్లు (200కు బదులు 1628) ఉంది. ముత్తుకూరు ప్రాంతంలో పదిరెట్లు ఉంది. దీని ఫలితంగా ఆ ప్రాంతంలో ప్రజలకు దుమ్ము కళ్ళల్లో పడినందువల్ల కళ్ల జబ్బులు, ధూళి వల్ల శ్వాసకోశ వ్యాధులు వస్తున్నాయి. లారీల కిందపడి మృతి చెందిన వారి సంఖ్య ఇప్పటికే రెండు వందలకు చేరింది. ఇంకా పశువులు, మేకలు, గొర్రెలు ఆస్తి నష్టాలు లెక్కలేనన్ని అయినా పాలకులకు చలనముండదు. అంతేగాక కృష్ణపట్నం పోర్టులో జరుగుతున్న డ్రెస్సింగ్‌వల్ల చుట్టు ప్రక్కల 16 గ్రామాల మత్స్య కారులంతా చేపల వేటలేక వలసలు పోతున్నారు. పోర్టులో కుప్పలుగా పోసిన ఇనుపఖనిజం వర్షాలు కురిసినప్పుడు సముద్రంలోకి పోతోంది. ఇంకా బిల్లకూరు మండలంలో టెక్స్‌టైల్‌పార్కు, మేనూరు ప్రత్యేక ఆర్థికమండలిలో ఆటోమొబైల్ పార్కు, కృష్ణపట్నం ప్రత్యేక ఆర్థిక మండలి, కోట మండలంలో రెండు ప్రత్యేక ఆర్థిక మండలాలు, కొడవలూరు మండలంలో ఇఫ్కో కిసాన్ సెజ్ రాబోతున్నాయి.

ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో ఓడరేవు, నిజాంపట్నం పారిశ్రామిక కారిడార్ కోసం భూసేకరణ మొదలైంది. ప్రకాశం జిల్లా మోటుపల్లి వద్ద ఒక ఓడరేవు, నిజాంపట్నం వద్ద ఒక ఓడరేవు రాబోతున్నాయి. మోటుపల్లి వద్ద షిప్‌బిల్డింగ్ యూనిట్, ఒక థర్మల్ విద్యుత్ కేంద్రం రాబోతున్నాయి. నిజాంపట్నం వద్ద కెమికల్ హబ్ రాబోతున్నది. కృష్ణాజిల్లాలో బందరు పోర్టు, అనుబంధంగా థర్మల్ విద్యుత్ కేంద్రం రాబోతున్నాయి. విశాఖజిల్లా భీమునిపట్నం వద్ద నుండి కాకినాడ వరకు 603 చదరపు కిలోమీటర్ల పరిధిలో పెట్రోలియం కెమికల్స్ అండ్ పెట్రో కెమికల్ రీజియన్ (పి.సి.పి.సి.ఆర్) ఏర్పాటు చేస్తున్నారు. ఇప్పటికే ఉన్న సింహాద్రి ఎన్‌టిపిసి కర్మాగారం నుండి వెలువడిన వ్యర్థ పదార్థాలు సముద్రంలో కలిసే ప్రాంతంలో అధిక సంఖ్యలో ఆలివ్‌రిడ్లే తాబేళ్ళు మృతి చెందాయి. విశాఖ నగరంలోని మల్కాపురం ప్రాంతంలో పోయిన సంవత్సరం ఫిబ్రవరి 14,15 తేదిల్లో టన్నుల కొద్ది చేపలు చనిపోయి

తీరానికి కొట్టుకువచ్చాయి. జనవరి నుండి ఏడు నెలల కాలంలో 34 టన్నుల చేపలు చనిపోయినట్లు అంచనా. 2004-05 సంవత్సర కాలంలో విదేశాలకు ఎగుమతి చేసిన రొయ్యల్లో రసాయన అవశేషాలున్నాయని తిప్పి పంపించాయి. వ్యాపారులు వీటిని సముద్రంలో పారబోసిన విషయం తెలిసిందే. నక్కలపల్లి మండలంలో ఏర్పాటు చేసిన హెట్రోలాబ్స్ కారణంగా చుట్టు పక్కల 20 కిలోమీటర్లలో కాలుష్యం, రసాయన వాయువుల వల్ల ఆ గ్రామాల ప్రజలు జీవించడమే కష్టమై పోయింది.

శ్రీకాకుళం జిల్లా అరిణాం, అక్కవలస గ్రామాల్లో నిర్మించిన నాగార్జున అగ్రికెమ్ క్రిమిసంహారక మందుల పరిశ్రమ, పొన్నాడ పంచాయితీలోని స్మార్ట్‌కెమ్ రసాయన పరిశ్రమ, రణస్థలం పైడిభీమవరం లో ఏర్పరచిన అరబిందో ఫార్మా, రెడ్డీస్ లాబ్స్, ఆంధ్రా ఆర్గానిక్స్ పరిశ్రమలవల్ల సుమారు 35 గ్రామాలు కాలుష్యం బారిన పడ్డాయి. విజయనగరం జిల్లాలో పూసపాటి రేగ మండలం గోవిందపురం జంక్షన్‌లో నిర్మించిన మాట్రిక్స్ (వీరాలాబ్స్), చరణ్‌బోకాండ్ (సిసి) పరిశ్రమల వల్ల 20 గ్రామాలు ప్రభావితమవుతున్నాయి. ఇవికాక విశాఖ జిల్లాలోనే భీమునిపట్నం మండలం చిననాగమల్యాపాలెం, పెదనాగమల్యాపాలెం, అన్నవరం, గ్రామాల నడుమ ఏర్పాటు చేసిన దివీస్ లాబ్స్, అచ్యుతాపురం మండలంలో ఏర్పాటు చేసిన రాంకీ ఫార్మాసిటీ, అనకాపల్లిలో ఏర్పాటు చేసిన జి.డి కెమికల్స్ పరిశ్రమల వల్ల 20 కిలోమీటర్ల పరిధిలో మత్స్యకారుల జీవనం ప్రశ్నార్థకమైంది. సముద్ర తీరం కలుషితమే చేపల పునరుత్పత్తి చాలావరకూ ఆగిపోయింది. చేపలు తినడానికి సైతం వీలులేకుండా రసాయనాల వాసన వస్తున్నాయి. ఈ రసాయన వ్యర్థాల వల్ల పంట భూములు భూసారాన్ని కోల్పోయి బీడుభూములుగా మారిపోతున్నాయి. ఫలితంగా వ్యవసాయం లేక రైతులు అవస్తలు పడుతున్నారు. అంతేగాక ఈ కాలుష్యం ప్రజలలో ఆయుర్దాయం తగ్గిపోతున్నది. పుట్టే పిల్లల్లో అంగవైకల్యం, గుండెజబ్బులు, కిడ్నీల్లో రాళ్ళు పెరగడం, ఇతర శ్వాస కోశ వ్యాధులు సర్వసాధారణమై పోయాయి. ఇవన్నీ ఒక ఎత్తైతే విశాఖపట్నంలో ఎప్పుడో ఏర్పడిన జింక్ పరిశ్రమ నుంచి వచ్చిన కాలుష్యం వల్ల ములగాడ, మిందీ, చుక్కవానిపాలెం గ్రామాల్లో ఎదురైన పరిస్థితి ఆందోళన కలిగిస్తోంది. ఇక్కడ ఈ గ్రామాల్లో పుట్టిన పిల్లలు వయసు పెరిగినా శరీరంలో ఎదుగుదల లేదు. ఒకవేళ శారీరక ఎదుగుదల ఉన్నా మానసిక ఎదుగుదల లేదు. చాలామంది శరీరంలో లెడ్‌కు సంబంధించిన అవశేషాలున్నాయని వైద్యులు చెబుతున్నారు. ఈ గ్రామాల్లో భూగర్భజలాలు పూర్తిగా కలుషితమై పోయాయి. ఇక్కడి పండ్లు, కాయలు, కూరగాయల్లో కూడ రసాయన అవశేషాలున్నాయి. పరిశ్రమ ప్రారంభమై ఇరవై ఏళ్లు దాటినా వారి పునరావాస సమస్యకాని, పర్యావరణ సమస్యగాని ప్రభుత్వాధినేతలకు పట్టలేదు.

ఇదిలాఉండగా తడ నుండి ఇచ్ఛాపురం వరకు మొత్తంగా చూస్తే కృష్ణపట్నంలో 3 భారీ ఓడరేవులు, 14 చిన్న ఓడరేవులు, ప్రతి ఓడరేవు దగ్గర ఒకటి లేక రెండు థర్మల్ విద్యుత్ కేంద్రాలు, ఒక అంతర్జాతీయ విమానాశ్రయం, రెండు విమానాశ్రయాల స్థాయిపెంపు, ప్రకాశం జిల్లాలో ఒక విమానాశ్రయం, అన్ని రేవుల దగ్గరా రసాయన పరిశ్రమలు, 16 వ్యవసాయాధార పరిశ్రమలు, పెట్రో కెమికల్ కాంప్లెక్స్‌లు, పెట్రోలియం రిఫైనరీలు, సహజవాయు టర్మినల్స్, షిప్‌లాండింగ్ కేంద్రాలు, పీ.టి పార్కులు, థీమ్‌పార్కు, వ్యాపార వృద్ధి కేంద్రాలు, చమురు, సహజవాయువులు వెలికితీసే ఆఫ్‌షోర్ (తీరానికి దూరంగా సముద్రంలో) బ్యాంకులు, వీటికోసం టౌన్‌షిప్పులు ఎక్స్‌ప్రెస్ హైవేలు, 666 కిలోమీటర్ల దూరం రహదారులు, 200 కిలోమీటర్ల దూరం కొత్త రైలుమార్గం ఏర్పాటుకోసం రాష్ట్రప్రభుత్వం ప్రణాళిక సిద్ధం చేసింది.

పోర్టుల నిర్మాణం వల్ల ఎలాంటి పరిస్థితులు ఎదురుకానున్నాయో కృష్ణపట్నం పోర్టు 4 బెర్తులకే దాని ప్రభావాన్ని చూశాం. ఇక 40 బెర్తులూ పూర్తై ఆసియాలోకల్లా పెద్ద ఓడరేవుగా అవతరిస్తే దాని విశ్వరూపం ఎంతగా ఉండవబోతుందో అర్థమవుతోంది. ఇక అన్ని ఓడరేవులూ నిర్మాణం జరిగితే ఆ విధ్వంసం ఊహించలేం. ఇక తీరంలో రేవుల దగ్గర ఏర్పాటయ్యే థర్మల్ విద్యుత్ కేంద్రాల వల్ల ఉష్ణకాలుష్యం ఏర్పడుతుంది. థర్మల్ విద్యుత్ కేంద్రాల్లో నీరు వేడి చేయబడి ఆవిరిగా మారి టర్బయిన్లు పనిచేయడానికి ఉపయోగ పడుతుంది. తర్వాత నీటి ఆవిరి నీరుగా మారి సముద్రంలోకి వదలి వేయబడుతుంది. ఈనీరు సాధారణ నీటికన్నా 15 డిగ్రీలు ఎక్కువ వేడిగా ఉంటుంది. థర్మల్ విద్యుత్ కేంద్రాల్లో ఒక కిలోవాట్ విద్యుత్ ఉత్పత్తికి సుమారు 40 గాలన్ల నీరు అవసరమవుతుంది. వేడినీరు సముద్రంలో కలవడం వల్ల నీటిలో ఆక్సిజన్ పరిమాణం తగ్గి అనేక జలచరాలు మృత్యువాత పడతాయి. సాగు, తాగు నీటిని థర్మల్ విద్యుత్ కేంద్రాలకు ఉపయోగించడం వల్ల వ్యవసాయం దెబ్బతింటుంది. ఇటు సముద్రంలో జలచరాలు మృత్యువాత పడటం వల్ల మత్స్యకారుల ఉపాధి దెబ్బతింటుంది. అలాగే థర్మల్ విద్యుత్ కేంద్రాలనుండి విడుదలయ్యే బూడిద వల్ల వాయు కాలుష్యం జరుగుతోంది.

పెట్రోకెమికల్ పరిశ్రమలు, ఆఫ్‌షోర్ బ్యాంకులు, నౌకా విచ్ఛేదన పరిశ్రమలవల్ల ప్రతిరోజూ కొన్ని వేల టన్నులకొద్ది చమురు సముద్రంలో కలుస్తుంది. దీనిఫలితం గుజరాత్‌లోని అలంగ్ షిప్ బ్రేకింగ్ యూనిట్ దగ్గర ప్రత్యక్షంగా చూడవచ్చు. సముద్రంలో జలచరాలేకాదు భూమి మీద 30 కిలోమీటర్ల పరిధిలో వ్యవసాయం, పాడి పరిశ్రమ వంటివీ బతికి బట్టకట్టలేదు.

బందరుపోర్టు నిర్మాణం కోసం తీరప్రాంతంలోని మడ అడవులను నరికివేస్తున్నారు. బందరు సమీపంలోని పోలాటతిప్ప వద్ద థర్మల్‌విద్యుత్ కేంద్రం నిర్మాణం కోసం వందల ఎకరాల మడ అడవులను నరికివేశారు. ఇప్పటికే ప్రపంచవ్యాప్తంగా రొయ్యల చెరువుల రూపంలో మూడోవంతు మడ అడవులను కబళించాయని ఐక్యరాజ్య సమితి పర్యావరణ కార్యక్రమం పేర్కొంది. ప్రపంచంలో ఒక కోటి 81.5 లక్షల హెక్టార్ల మడ అడవులుండగా ప్రస్తుతం 59లక్షల హెక్టార్లకు తగ్గిపోయినట్లు తెలుస్తున్నది. మనదేశంలో 1968లో 6,81,000 హెక్టార్ల విస్తీర్ణంలో మడ అడవులుండగా 1998 కల్లా ఐదు లక్షల హెక్టార్లకు పడిపోయింది. మన రాష్ట్రంలో కేవలం 0.9 శాతం మాత్రమే మడ అడవులు మిగిలాయి.

మడ అడవులు తీర ప్రాంతానికి చేసేమేలు అంతా ఇంతా కాదు. ఉప్పెనలు, తుపానులు, సునామీల సమయంలో తీరాన్ని కాపాడుతాయి. భూమికోతను నివారిస్తాయి. చేపలు, పీతలు, పక్షులు, జంతు

సమూహాలకు ఆవాసంగా ఉంటాయి. పలురకాల జీవసంబంధ ఉత్పత్తికి దోహదం చేస్తాయి. 2004లో సంభవించిన సునామీలో 2 లక్షలమంది అత్యధికంగా చనిపోవడానికి కారణం మడ అడవులు అంతరించిపోవడమే. శ్రీలంక గ్రామీణ ప్రాంతాల్లో సునామీవల్ల నష్టం తక్కువగా ఉండడానికి కారణం మడ అడవులే. కోస్తా కారిడార్ నిర్మాణం వల్ల మడ అడవుల నరికివేతవల్ల మాత్రమే కాక పరిశ్రమల నుండి వచ్చే రసాయన వ్యర్థాల వల్ల కూడా అంతరించే ప్రమాదముంది.

రసాయన పరిశ్రమలు, పెట్రోకెమికల్ పరిశ్రమలు, థర్మల్ విద్యుత్ కేంద్రాలు ఏర్పాటేకాక నెల్లూరు జిల్లాలో పులికాట్ సరస్సువద్ద, పశ్చిమగోదావరి జిల్లాలో కొల్లేరు సరస్సు వద్ద రెండు రాష్ట్ర పర్యాటక (యస్.టి.జడ్.) జోన్లు ఏర్పాటుచేయడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. ప్రభుత్వం అనుకున్న విధంగా అంతా సవ్యంగా జరిగితే వచ్చే పరిశ్రమల్లో పనిచేసే ఒకస్థాయి ఉద్యోగులూ, వ్యాపారులు, పెట్టుబడిదారుల విలాసాలకు ఈ కేంద్రాలు నిలయం కాబోతున్నాయి. ఇండోనేసియా, థాయ్‌లాండ్ తీరప్రాంతాల్లో, మనదేశంలో గోవా లాంటిచోట్ల ఉన్న విధంగా తీరంలో వ్యభిచార కేంద్రాలు ఏర్పాటు వల్ల స్థానిక మత్స్యకార మహిళలు, పేద దళిత బలహీన వర్గాల మహిళలల్ని సమిధలవుతారు.

## పర్యావరణం- అభివృద్ధి

రాష్ట్రప్రభుత్వం తలపెట్టిన ఈ కోస్తా కారిడార్ వల్ల రాబోయే 20 సంవత్సరాల కాలంలో 12 లక్షల మందికి ఉపాధి కలుగుతుందనీ తద్వారా తీరప్రాంత ప్రజలు అభివృద్ధి చెందుతారని ప్రభుత్వాలు చెబుతున్నాయి. అయితే ఇదంతా నిజమైన అభివృద్ధేనా? ప్రజల భాగస్వామ్యంతో ప్రజల అభీష్టం మేరకే జరుగుతున్నదా? ఈ అభివృద్ధి కోసం ప్రభుత్వం పర్యావరణ చట్టాలను సైతం పట్టించుకోక తూతూ మంత్రంగా అభిప్రాయసేకరణలు జరిపి లాబీయింగ్ ద్వారా, అధికారాన్ని అడ్డుపెట్టుకొని పర్యావరణ అనుమతులు తెచ్చుకుంటున్నది. తీర ప్రాంతంలో సుమారు 80 లక్షలమంది మత్స్యకారుల జీవిస్తున్నారు. ఇందులో ఏర్పాటయ్యే పరిశ్రమల్లో ఉద్యోగార్హత ఉన్నవాళ్లు కేవలం ఒక్క శాతమో రెండు శాతమో ఉంటారు. అత్యధికంగా నిరక్షరాస్యులే. ఏటా ఏడు వేల కోట్ల రూపాయల విలువచేసే మత్స్యసంపద సమాజానికి అందిస్తున్నారు. తీరంలో సెంటు, కుంట పొలంలో సరుగు, కూరగాయలు, పూలు, వరి, వేరుశనగ పండించే సన్న, చిన్నకారు రైతాంగం ఉన్నారు. వీరిలో కూడా నిరక్షరాస్యులే అధికులు. తడ దగ్గర అపాచీ కంపెనీ ఉదాహరణను తీసుకుంటే అందులో 5000 మంది కార్మికులు పనిచేయగా, ఐదు వందలమంది మాత్రమే సమీప గ్రామాల ప్రజలు. అందులో ఆడవాళ్లే అధికం. కనుక తీరప్రాంత ప్రజలకు ఉద్యోగాలు ఒట్టిమాటే. కోస్తాకారిడార్ నిర్మాణమైతే సముద్రమూ, తీరప్రాంత భూగర్భజలాలు కలుషితమై లక్షలాదిమంది బతుకే ప్రశ్నార్థకమవుతుంది.

నిజంగా అభివృద్ధి జరిగితే స్థానిక ప్రజల ఆమోదంతో, ప్రమేయంతో తక్కువ పర్యావరణ నష్టం, ఎక్కువ స్థానిక ప్రజల జీవన ప్రమాణాలు పెరిగే విధంగా ఉండాలి. దీనికి ఇంత భారీ ఎత్తున బహుళజాతి, దేశీయదళారీ సంస్థల ప్రవేశం అవసరం లేదు. ఇక్కడ ఒక ఉదాహరణ చెప్పుకోవాలి. స్టాలిన్ నాయకత్వంలోని సోవియట్ రష్యా చైనాకు ఒకప్పుడు మావో నాయకత్వంలోని చైనాకు ఉక్కు పరిశ్రమలు స్థాపించడానికి సాంకేతిక, ఆర్థిక సహాయం చేయడానికి ప్రతిపాదన చేసింది. కాని చైనా ఆ ప్రతిపాదనను తిరస్కరించింది. దేశీయ సాంకేతిక పరిజ్ఞానంతో చిన్న చిన్న పరిశ్రమలను స్థాపించింది. క్రమంగా భారీ స్థాయిలో ఉక్కు ఉత్పాదకతను సాధించి స్వయం సమృద్ధిని సాధించింది. ఆ విధంగా తక్కువ పర్యావరణ నష్టంతో అభివృద్ధి సాధ్యమైంది. కాని ఇక్కడి మన పాలకులు ప్రారంభం నుండి సాంకేతిక పరిజ్ఞానం, పెట్టుబడుల దిగుమతితోనే అభివృద్ధి అంటున్నారు.

వస్తున్న పరిశ్రమలను పరిశీలిస్తే ఏ పార్టీ అధికారంలోకొస్తే ఆ పార్టీకి కొమ్ముకాసే దళారీ పారిశ్రామికవేత్తలు, విదేశీ బహుళజాతి సంస్థలతో కలిసి స్థాపించేవే ఎక్కువ. గతంలో తెలుగుదేశమైనా ఇప్పుడు కాంగ్రెసైనా వారు చెప్పే అభివృద్ధి పెట్టుబడిదారుల, పాలక వర్గాల కోసం ఉద్దేశించిందే తప్ప ప్రజల కోసం కాదనేది స్పష్టం. ఈ అభివృద్ధి స్థానికులకు ఉన్న ఆధారాలను ఊడగొట్టి ఏ ఆధారంలేని బానిస వర్గంగా తయారు చేసేది తప్ప మరోటి కాదు.

## పర్యావరణం - చట్టాలు

పారిశ్రామిక విప్లవం తర్వాతనే ప్రపంచ పర్యావరణం కలుషితం కావడం ప్రారంభమైందని చెప్పవచ్చు. పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెంది, బహుళజాతి గుత్తసంస్థలు ఏర్పడి, లాభాపేక్షే తప్ప ప్రజలు, పర్యావరణం అప్రధానమైపోయాయి. ప్రపంచవ్యాప్తంగా పరిశ్రమల అభివృద్ధి, అణు ఇంధన కార్యక్రమాల పర్యవసానంగా కాలుష్యం పెరిగి పర్యావరణ సమతుల్యం దెబ్బతింటున్నది. ఈ నేపథ్యంలో మానవ హక్కులకు సంబంధించిన అంశం చర్చనీయాంశం అయింది. ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణలో చాలా ఆలస్యంగా 1972లో 113 దేశాలతో స్టాక్‌హోమ్‌లో ఒక అంతర్జాతీయ సదస్సు జరిగింది. ఈ సదస్సు 26 సూత్రీకరణలతో ఒక డిక్లరేషన్‌ను ఆమోదించింది. ఇందులో మానవహక్కులు అత్యంత ప్రాథమికమైనవిగాను, గౌరవ ప్రదమైన, ఆరోగ్యవంతమైన జీవితాన్ని అనుభవించడం, ప్రపంచ ప్రజల ప్రాథమిక హక్కుగాను గుర్తించింది. ఈ డిక్లరేషన్ సూచనలకు కార్యరూపం ఇచ్చేందుకుగాను 1973లో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ, ఐక్యరాజ్యసమితి పర్యావరణ పథకాన్ని (యుఎన్ఇపి) ఏర్పాటు చేసింది.

స్టాక్‌హోమ్ డిక్లరేషన్ వెలువడిన తర్వాత అంతర్జాతీయ పర్యావరణ సంరక్షణా చర్యలను సమీక్షించే నిమిత్తం ప్రపంచ పర్యావరణ సదస్సు 1982లో కెన్యా రాజధాని నైరోబీలో జరిగింది. 1992లో బ్రెజిల్ రాజధాని రియోలో జరిగిన జీవ వైవిధ్య సదస్సులో రియోడిక్లరేషన్ వాతావరణ పరిరక్షణకుగాను, జపాన్‌లో క్యోటో పట్టణంలో 1997లో జరిగిన వాతావరణ పరిరక్షణ సదస్సులో క్యోటో ప్రోటోకాల్‌ను ఆమోదించడం జరిగింది. 2002లో జోహన్స్‌బర్గ్‌లో జరిగిన సదస్సులో ఆరోగ్య పరిరక్షణ గురించి కూడా చర్చించడం జరిగింది. మొత్తంగా చూస్తే ప్రపంచ పర్యావరణాన్ని కలుషితం చేయడంలో అమెరికా, బ్రిటన్, జపాన్, యూరోపియన్ యూనియన్ తదితర అభివృద్ధి చెందిన దేశాల పాత్ర ప్రధానంగా ఉంది. ఉదాహరణకు వాతావరణాన్ని కలుషితం

చేయడంలో ఒక్క అమెరికా వాటానే 25 శాతం ఉంది. అయితే వాతావరణ కాలుష్యాన్ని తగ్గించే బాధ్యతను తమతో సమానంగా తీసుకోవాలని చైనా, భారత్, బ్రెజిల్ లాంటి వర్ధమాన దేశాలపై అమెరికా ఒత్తిడి తెస్తోంది.

భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలను పరిశీలిస్తే కాలుష్య రహిత పర్యావరణం పౌరుల ప్రాథమిక హక్కు, పౌరుల ప్రాథమిక హక్కులను పరిరక్షించడం ప్రభుత్వ బాధ్యత అని అర్థమవుతుంది. ప్రాథమిక హక్కులలో పర్యావరణం గురించి నిర్దిష్టంగా పేర్కొనకపోయినప్పటికీ అంతర్లీనంగా పర్యావరణానికి సంబంధించినదే. "చట్టం నిర్దేశించిన విధంగా తప్ప, మరొక విధంగా జీవించే హక్కును గాని, స్వేచ్ఛనుగాని హరించరాదు" అని చెప్తుంది. అదేవిధంగా ఆదేశిక సూత్రాలలోని అధికరణం 48 (ఎ) "అడవులను వన్యప్రాణులను సంరక్షించడం ద్వారా పర్యావరణాన్ని కాపాడడానికి ప్రభుత్వం కృషి చేయాలి" అని చెప్తుంది.

నీరు మానవ మనుగడకు ప్రధానమైనది కనుక జల కాలుష్య నివారణకు, జలకాలుష్యానికి కారకులైన వారిని శిక్షించడానికీ రాజ్యాంగంలోని 25(1) అధికరణం కింద జల కాలుష్య నివారణ చట్టం 1974ను కేంద్ర ప్రభుత్వం రూపొందించింది. ఈ చట్టం లక్ష్యంలో భాగంగానే జాతీయ స్థాయిలో ఒక కాలుష్యనివారణ బోర్డును ఏర్పాటు చేయడం జరిగింది. దీని కొనసాగింపుగానే రాష్ట్రాలలో కూడ కాలుష్య నియంత్రణ బోర్డులు ఏర్పాటు చేయడం జరిగింది. అలాగే 1981లో వాయు కాలుష్యనివారణ చట్టం చేయడం జరిగింది. ఇంకా పర్యావరణ పరిరక్షణ, కాలుష్య నివారణకు సంబంధించి అనేక చట్టాలు చేశారు. ప్రధానంగా స్టాక్‌హోమ్ డిక్లరేషన్ స్ఫూర్తితో 1986లో పర్యావరణ పరిరక్షణ చట్టం చేయబడింది. ఇదే అన్నిటికంటే ప్రధానమైంది. ఇందులో 26 సెక్షన్లు మాత్రమే వున్నప్పటికీ అత్యంత విలువయినవి. భోపాల్ గ్యాస్ దుర్ఘటన నేపథ్యంలో మొదలైన చర్చవల్ల ఈ చట్టం ప్రాధాన్యత సంతరించుకుంది. ఈ చట్టం ప్రకారం స్థానికుల జీవనవిధానంపై ప్రభావం చూపే భారీ ప్రాజెక్టులను నిబంధనలననుసరించి అనుమతులు పొందాల్సి ఉంటుంది. 'పర్యావరణ ప్రభావ అంచనా నోటిఫికేషన్' 1994 ప్రకారం అనుమతి ప్రక్రియలో ప్రజలతో సంప్రదింపులు తప్పనిసరి. అయితే పారిశ్రామికవేత్తలకు కొమ్ముకాస్తున్న ప్రభుత్వాలు ఈ లక్ష్యాన్ని నీరుగార్చాయి. 1986లో చేసిన చట్టానికి, 1991లో సవరణ చేశారు. 1981 నుండి ఇప్పటి వరకు 19 సార్లు నిబంధనలు సవరించారు. చట్టాలను తమ చుట్టాలుగా చేసుకుంటూ పాలక వర్గాలు, పెట్టుబడిదారీ వర్గాలు కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వశాఖనుకూడ నామమాత్రం చేశారు.

ఇంతేకాక ఒక ప్రత్యేకమైన జీవనవిధానాన్ని, విలక్షణమైన పర్యావరణాన్ని కలిగిఉన్న తీరప్రాంత రక్షణకోసం 1991లో కేంద్ర ప్రభుత్వం కోస్టల్ రెగ్యులేషన్ జోన్ నిబంధనలను రూపొందించింది. దీనికి ముందే 1976లో చట్టం చేసినప్పటికీ అది ప్రధానంగా జలరవాణాకు, ఖనిజ నిక్షేపాల వెలికితీతకు సంబంధించినది. సి.ఆర్.జడ్. నిబంధనల ప్రకారం సముద్రపు అలలు అధికంగా వచ్చే హైటైడ్ లైన్‌నుండి 500 మీటర్ల వరకు జలాలకు సంబంధించిన పరిశ్రమలు, తీరప్రాంత సౌకర్యాలకు సంబంధించిన పరిశ్రమలు తప్ప ఎలాంటి ఇతర పరిశ్రమలు ఏర్పాటు చేయరాదు. ఉన్న వాటిని విస్తృత పరచరాదు. అలాగే ఎలాంటి వాణిజ్య సముదాయాలు, నివాసగృహ సముదాయాలు, హోటళ్ళు, వినోదశాలలు, మొదలైనవి ఏర్పాటుకు అనుమతివ్వరాదు. కాని ఈ నిబంధనలను తుంగలో తొక్కి కోస్తా కారిడార్ నిర్మాణాన్ని ప్రభుత్వం చేపట్టింది. కేంద్ర ప్రభుత్వం ఇండియన్ కోస్తా పారిశ్రామిక కారిడార్ కోసం సి.ఆర్.జడ్ నిబంధనలను సడలించి కోస్టల్ మేనేజ్‌మెంట్ జోన్ (సి.యం.జడ్) ఏర్పాటు కోసం సన్నాహాలు చేస్తోంది.

ప్రపంచ వ్యాప్తంగా చూస్తే రసాయన పరిశ్రమలు ప్రధానంగా అమెరికా, జపాన్, పశ్చిమ యూరప్‌దేశాల్లో ఉన్నాయి, బ్రిటన్, జర్మని, ఫ్రాన్స్, నెదర్లాండ్స్‌లోని రసాయన పరిశ్రమల వాణిజ్య వాటా యూరప్‌లో మూడింట రెండువంతులుంది. ఆయా దేశాల్లో 60వేల పరిశ్రమలున్నాయి. అమెరికాలో 170 బహుళజాతి రసాయన పరిశ్రమలున్నాయి. ప్రపంచ వాణిజ్యంలో అధిక భాగం వీటిదే. ఫలితంగా మన దేశంతో సహ 27 దేశాల తీరప్రాంతాల్లో, ఏ జీవులూ బతకలేని 450 కిపైగా నిర్జీవప్రాంతాలు ఏర్పడినాయి. పర్యావరణం ధ్వంసమై ఉపాధి కరువైపోయింది. దీంతో పాలకులు, పారిశ్రామిక వేత్తలు ప్రజల ప్రతిఘటన నెదుర్కోవలసి వస్తోంది. అభివృద్ధి చెందిన దేశాల పాలకులు, బహుళజాతి గుత్త సంస్థలు, ప్రపంచ బ్యాంకు ద్వారా అభివృద్ధి చెందుతున్న చైనా, భారత్, పాకిస్థాన్, బంగ్లాదేశ్, కొరియా, నైజీరియా, బ్రెజిల్, ఇండోనేషియాలలో రసాయన పరిశ్రమల ఏర్పాటుకు వత్తిడి తెస్తున్నాయి. కనుకనే దళారీలైన పాలకవర్గాలు ఇక్కడి సహజ వనరులను, శ్రమశక్తిని దోచిపెట్టేందుకు ఉవ్విళ్లూరుతున్నారు. దీనినే అభివృద్ధిగా చెబుతూ ప్రజలపై విధ్వంసాన్ని రుద్దుతున్నారు. ఇందుకు ఏ చట్టాలూ నిబంధనలూ అడ్డురావడంలేదు. వీ

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - ఏప్రిల్ 2009 : ఎన్నికల వేళ జనం నాడి
- ఫోకస్ - మే 2009 : నలభై సంవత్సరాల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం
- మాదిగ సాహిత్యం - తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు - సాంబయ్య గుండిమెడ
- పంట పొలాల్లో పరిశ్రమలా? - లింగబత్తిని మల్లేష్, పిట్ట నర్సింగం

*చత్తీస్‌గఢ్ ప్రభుత్వం సల్వాజుడుం ఏర్పాటు చేసి దండకారణ్యంలో అనాదిగా నివసిస్తున్న ఆదివాసులపై సామూహిక హత్యాకాండకు పాల్పడుతున్నదని వివరిస్తున్నారు* **గుంటి రవి**

# సల్వాజుడుం కాదది, సర్కారీ జులుం

చరిత్ర - వర్తమానాలలో విశాఖ దండకారణ్యం అత్యంత విలువైన అటవీ సంపదకు నిలయం, రకరకాల అటవీ ఉత్పత్తులకు కేంద్రం. ఆదివాసుల జీవనోపాధికి వ్యవసాయం తర్వాత అటవి ఉత్పత్తులే ప్రధాన ఆధారం. ఇట్లాంటి దండకారణ్యాన్ని బ్రిటిష్ దురాక్రమణకు ముందు ఆదివాసులకు బయటి ప్రపంచంతో సంబంధం ఉండేది కాదు. ఈ ప్రాంతాలలోకి బయటివారు వచ్చేవారుకారు. ఆదివాసులు అటవీ ఉత్పత్తులు సేకరించేవారు, వేటాడేవారు. తర్వాతి కాలంలో పోడు వ్యవసాయం చేసేవారు. ఈ క్రమంలోనే నాగలితో చేసే వ్యవసాయానికి మారారు. ఏ ప్రాంతంలో నైతే ఆదివాసులు నివసిస్తూ ఉండినారో ఆ ప్రాంతంలోని భూమిపైన, వనరుల పైన వారికి పూర్తి హక్కు ఉండేది. అంటే ఆదివాసులకు స్వతంత్ర నిర్ణయాధికారం కలిగిన స్వేచ్ఛ ఉండేది. కొన్ని ప్రాంతాలలో స్వతంత్ర రాజ్యాలు కూడా ఉండేవి. ఇలాంటి అటవీ ప్రాంతానికి ఆదివాసులు కానివారు రావడం బ్రిటిష్ కాలంలోనే మొదలైంది. వారు అటవీ వనరులను ఆదివాసులు వాడుకోవడంపై కట్టడులు విధించారు. బ్రిటిష్ వాళ్లు ప్రతి వస్తువుపైనా, భూమి, నీరు, కలప తదితర అటవీ ఉత్పత్తులపై పన్నులు విధించారు. బ్రిటిష్ ప్రభుత్వం అడవినంతటినీ తమ స్వంత ఆస్తిగా పరిగణించింది. వలసలకు పన్నుల విధింపు తోడై ఆదివాసుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు దెబ్బతిన్నాయి.

సామ్రాజ్యవాద నమూనాకు భిన్నమైన స్వావలంబన రాజకీయాల పై ప్రజల అధికారాన్ని గ్యారంటీ చేసే దిశగా ఆదివాసీ ఉద్యమాలు అనేకం వచ్చాయి. బ్రిటిష్ విధానాన్ని స్వతంత్ర భారతదేశం కూడా కొనసాగించడంతో నక్సల్బరీ, సంతాల్ రైతాంగ పోరాటాలు, శ్రీకాకుళం, గోదావరి, వరంగల్, కరీంనగర్ జిల్లాల్లో ఆదివాసులు నివసించే ప్రాంతాలకు - కేరళ వైనాడ్ అడవులకు, కలకత్తా, పంజాబ్, బీహార్ నుండి తెలంగాణలోని మైదాన ప్రాంతాల వరకు ఈ పోరాటాలు విస్తరించాయి.

జగిత్యాల జైత్రయాత్ర తర్వాత విప్లవోద్యమం విస్తరిస్తూ గోదావరి నదిని దాటి సిరొంచ, గడ్చిరోలీల గుండా బస్తర్ దాకా విస్తరిస్తూ దండకారణ్యంలో విప్లవోద్యమం బలంగా వేళ్లూనుకుంది. ఇదే సందర్భంలో ప్రపంచీకరణలో భాగంగా దేశంలో తీవ్రతరమవుతున్న నూతన ఆర్థిక విధానాల అమలు, పెట్టుబడిదారులకు, జాతీయ బూర్జువాలకు ద్వారాలు మరింతగా తెరచి దండకారణ్యంలో గల విస్తారమైన ప్రాంతంలోని అటవీ సంపదను, ప్రపంచంలోనే నాణ్యమైన ఇనుప గనులను, ఆభ్రకం, డోలమైట్, బాక్సైట్, సున్నపురాయి, తగరం, యూరేనియం మొదలైన ఖనిజ సంపదను కొల్లగొట్టడాన్ని ఎదుర్కొంటూ విప్లవోద్యమం స్థిరపడి బలపడుతూ వస్తోంది. దండకారాణ్యంలోని నాలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు తమ నిర్బంధ విధానాలను తీవ్రతరం చేస్తూ సమన్వయంతో కమెండోలతో అణచివేతను పకడ్బందీగా అమలుచేస్తున్నాయి.

ప్రభుత్వం ఒకవైపు రాజ్య నిర్బంధాన్ని కొనసాగిస్తూనే ఆదివాసులను చీలుస్తూ విప్లవోద్యమాన్ని నిర్మూలించాలనే లక్ష్యంతో 1990వ దశకంలో ఆదివాసుల మధ్య బ్రిటిష్‌వారు విభజించి పాలించు అనే విధానాన్ని కొనసాగించారు. భూస్వాములు - పోలీసులు సంయుక్తంగా దాడులు చేస్తూ దీనినే జన జాగరణ్ అభియాన్ అని పేరు పెట్టారు. అభియాన్ ఏం చేసిందంటే, 'నక్సలైట్లతో కలవం, వారికి అన్నం పెట్టం, వారిని పట్టిస్తాం' అని ఆదివాసులతో ప్రమాణాలు చేయించారు. అంతే గాకుండా స్థానిక భూస్వామ్య, పెత్తందారి శక్తులను, లుంపెన్ గ్యాంగులను, ఖాకీలు సమన్వయం చేస్తూ విప్లవ సానుభూతి పరుల ఇండ్లను కూల్చడం, ఆస్తులను కొల్లగొట్టడం, మహిళలపై అత్యాచారాలు చేయడం జరిగింది.

జనజాగరణ్ అభియాన్ నాయకుడు మహేంద్రకర్మ. ఎవరీ మహేంద్ర కర్మ? ఇతను ఆదివాసీ భూస్వామి. మహేంద్ర కర్మ తండ్రి బొడ్డా. ఇతడు ఆదివాసీ మాంజీ. భూస్వామ్య తెగ నాయకుడు. బస్తర్‌లో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా 1910లో జరిగిన 'భూంకాల్' మహా తిరుగుబాటులో బొడ్డా కుటుంబం బ్రిటిష్ నాయకులతో కుమ్మక్కై ఆదివాసులకు, ఆదివాసీ పోరాటాలకు తీరని ద్రోహం చేసింది. కర్మ కుటుంబ చరిత్రంతా బస్తర్ పోరాటాలతో ముడివడిన విద్రోహ చరిత్రే. ఆ కుటుంబ వారసత్వాన్ని నేడు మహేంద్రకర్మ కొనసాగిస్తున్నాడు.

ఈశాన్య రాష్ట్రాలకు వరిస్తున్న రాజ్యాంగంలోని ఆరవ షెడ్యూల్‌ను బస్తర్‌లో అమలు చేయాలని 1990వ దశకంలో ఆదివాసులు పెద్ద ఎత్తున ఉద్యమం కొనసాగిస్తే, దానికి వ్యతిరేకంగా డబ్బులందుకొని వ్యాపార వర్గాలకు మద్దతునిచ్చాడు. బస్తర్‌లో చేపట్టే ప్రతి న్యాయమైన డిమాండ్‌ను వ్యతిరేకించడమే ఇతడి లక్ష్యం. బస్తర్‌లో 1997లో వెలుగు చూసిన 'మాలక్ - మక్బుజా' కుంభకోణానికి బాధ్యుడు. ఆదివాసులు టేకు చెట్లను అమ్మడంలో మధ్యవర్తిగా వ్యవహరిస్తూ చివరికి వారిని మోసం చేసి అరవై ఆరు లక్షల రూపాయలను కాజేసి వారి భూములను కూడా కొల్లగొట్టాడు.

సాధారణ ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తూ విప్లవకారులను

ఆదివాసీల నుండి వేరు చేయాలనే పథకంలో భాగంగా జనజాగరణ్ అభియాన్ రెండు విడతలలో బస్తర్, బైరాంగఢ్, గంగులూర్, మద్దేడ్, కుంట రేంజిలలో తమ కార్యకలాపాలు కేంద్రీకరించారు. కాని అనతి కాలంలోనే తేరుకున్న ఆదివాసులు జనజాగరణ్ నేతలను నిలదీశారు. మరోవైపు ఆదివాసీ పోరాటాలు బలంగా ముందుకొచ్చాయి. కొత్త ప్రాంతాలకు పోరాటాలు విస్తరించాయి. విస్తరించిన పోరాటాలు భూస్వామ్య పెత్తందార్లకు, తెగ పెత్తనానికి, దోపిడీకి ఆదివాసి పోరాటాలు అడ్డుకట్టవేయడంతో జనజాగరణ్ వెనుకంజ వేస్తూ సద్దుమణిగింది. కాని ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకొని మహేంద్రకర్మ విప్లవోద్యమానికి వ్యతిరేకంగా ప్రధాన భూమికను నిర్వహిస్తూనే ఉన్నాడు. అందుకోసం పెత్తందార్లందరినీ కూడగట్టే ప్రయత్నం చేస్తూ విప్లవోద్యమ వ్యతిరేక వేదిక కోసం తన ప్రయత్నాలను వదులుకోలేదు.

దంతేవాడ జిల్లా చత్తీస్‌గఢ్‌కు దక్షిణాన ఉంది. సరిహద్దు రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా. జిల్లాలోని 1354 గ్రామాలలో 455 పూర్తి ఆదివాసీ గ్రామాలే. 458 గ్రామాలలో 90 శాతం పైగా కోయ, దురువ ఆదివాసీలే. పట్టణ జనాభా శాతం 7.2 శాతం అయితే గ్రామీణ జనాభా శాతం 92.8 శాతం. ఆదివాసులు వ్యవసాయంపైన, అటవి ఉత్పత్తులపై ఆధారపడతారు. జిల్లాలో 29 శాతం భూమి మాత్రమే వ్యవసాయం చేయడం జరుగుతోంది.

మహేంద్రకర్మ ప్రయత్నంలో సల్వాజుడుం ఏర్పాటు చేస్తే చత్తీస్‌గఢ్ బిజెపి ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ మద్దతు పలికాడని, సల్వాజుడుం 2005 వేసవిలో ఏర్పాటు చేసినట్లుగా వార్తా కథనాలు వెలువడ్డాయి. నక్సలైట్ల అణచివేతకు సల్వాజుడుం కార్యక్రమం ఉండాలని దంతేవాడ కలెక్టర్ కె.ఆర్. పిస్డా రూపకల్పన చేస్తూ, ఈ ఆపరేషన్‌కు అయ్యే ఖర్చు ఏ శాఖ నిర్వహించాలో కూడా స్పష్టంగా డాక్యుమెంట్‌లో వివరించాడు. సల్వాజుడుంను దంతేవాడ ప్రభుత్వమే ప్రమోట్ చేస్తూ బడ్జెట్‌ను కేటాయించింది. కాని అందులో పారదర్శకత గాని, బడ్జెట్ కేటాయించి నట్లుగాని, అధికారికంగా ఎక్కడా కూడా చూపలేదు. ప్రభుత్వ నిర్వహణతోనే బస్సులు పెట్టి జనాలను తరలించి, మావోయిస్టులకు బలమైన గ్రామాల్లో సమావేశాలు పెట్టి సానుభూతిపరుల ఇండ్లను తగులబెట్టి, పశువులను, పందులను, కోళ్లను, తిండి పదార్థాలైన బియ్యం, వడ్లు, రాగులను, పనికివచ్చే వస్తువులను లూటీ చేస్తూ మహిళలపై అత్యాచారాలు చేస్తూ పాదయాత్రలు, సభలు పెడుతూ బీభత్సం సృష్టించారు. ఈ సమావేశాలలో, పాదయాత్రలో సల్వాజుడుం కార్యకర్తలు కత్తులు, గొడ్డళ్లు, బరిసెలు, 303 రైఫిళ్లు, తుపాకులు చేతబూని భయోత్పాతం సృష్టించారు. సల్వాజుడుం కార్యకర్తలనే ఎస్‌పిఒ లుగా నియమిస్తూ, నెలకు 1500 రూపాయలు వేతంగా ఇచ్చారు. పోలీసుల ప్రకారమే బస్తర్ ప్రాంతంలో నాలుగు వేల మందిని ఎస్‌పిఒ లుగా నియమించారు. దంతేవాడ జిల్లాలోనే 2007 జనవరి వరకు 139 పాదయాత్రలు, 47 సభలు పెట్టామని దంతేవాడ కలెక్టర్ పీస్ అండ్ జస్టిస్ కమిటీకి చెప్పారు. అంటే పాదయాత్రల పొడవునా ఎంత బీభత్సం జరిగిందో అవగాహన చేసుకోవచ్చు. చత్తీస్‌గఢ్ పోలీసుల కథనం ప్రకారం 2006లో 250 మందిని ఎన్‌కౌంటర్‌లో చంపామన్నారు. 2005-07 లో సుమారుగా ఐదు వందల మందిని చంపారని స్వచ్ఛంద సంస్థలు పేర్కొంటూ జూన్ 2005 నుండి మార్చ్ 2007 వరకు 450 మంది ఆదివాసీలను చంపారని, 700 గుడాలను తగులబెట్టారని మావోయిస్ట్ పార్టీ తన ప్రకటనలో చనిపోయిన, తగులబడిన గ్రామాల వివరాలను ప్రకటించింది.

సల్వాజుడుం సి.ఆర్.పి.ఎఫ్. బలగాలతో వచ్చి ఆదివాసులను అతి కిరాతకంగా చంపడమే కాకుండా గ్రామాలలో ఉంటే మావోయిస్టులకు సహాయం చేస్తున్నారని వారిని బలవంతంగా క్యాంపులలో నిర్బంధించారు. చత్తీస్‌గఢ్ ప్రభుత్వ లెక్కల ప్రకారమే దంతేవాడ జిల్లాలోని బీజాపూర్, ఉసూర్, గిదం, బైరాంగఢ్, కుంట పంచాయతీలలో ఇరవై క్యాంపులలో 47,500 మంది ఆదివాసులను తరలించామని చెప్పారు.

అడవిని నమ్ముకొని అడవిపై ఆధారపడి జీవించే అమాయక ఆదివాసీలు ప్రతిరోజు అడవికి వెళ్లకుండా బతకలేరు. పొలాలు దున్నుకోకుండా, పండిన పంటను అడవి జంతువుల బారి నుండి కాపాడుకోకుండా వారి జీవితం గడవదు. తాము క్యాంపులలో ఉంటే తమ కోళ్లు, గొర్లు, పశువుల కోసం, తమ వృద్ధ తల్లిదండ్రుల కోసం తీవ్రమైన మానసిక సంఘర్షణకు లోనైనారు. అంతేగాకుండా క్యాంపులలో తినడానికి తిండి దొరకదు. కనీస అవసరాలు - పరిశుభ్రత లేక అనేక అంటు రోగాల బారిన పడ్డారు. అట్లాంటి అవస్థలు పడలేక క్యాంపుల నుండి తప్పించుకునే ప్రయత్నం చేస్తే విప్లవ సానుభూతిపరులని, కాబట్టే పారిపోతున్నారని తీవ్ర చిత్రహింసలు పెట్టారు. మహిళలపై అత్యాచారాలు చేయడం సర్వసాధారణమై పోయింది. ముఖ్యంగా ఆదివాసీ మహిళలు సామాజిక దోపిడీకి వ్యతిరేకంగా మౌలిక అవసరాల కోసం, అటవీ ఉత్పత్తులకు న్యాయమైన ధరకోసం, మహిళలపై అమలవుతున్న కాలం చెల్లిన సామాజిక దురాచారాలకు, అణచివేతకు వ్యతిరేకంగా పితృస్వామ్యంతో కూడా పోరాడారు, కాబట్టి, క్యాంపులలో గాని, గ్రామాలలో గాని సల్వాజుడుం బీభత్సానికి అధికంగా అణచివేతలకు, అత్యాచారాలకు గురైంది ఆదివాసీ మహిళలే. చిన్న పిల్లల నుండి మొదలుకొని ముసలివాళ్ల వరకు వారిపై ఎట్లా అత్యాచారాలు చేశారో ఆదివాసి మహిళల, గ్రామాల వివరాలను కావో తన నివేదికలో పేర్కొంది. ఆదివాసీల కనీస అవసరాలకు ఉపయోగపడే మార్కెట్, పాఠశాలలు, అంగన్‌వాడీ కేంద్రాలు, ఆరోగ్య కేంద్రాలను సి.ఆర్.పి.ఎఫ్. బలగాలు ఆక్రమించి తమ బేస్ క్యాంపులుగా మార్చుకోకూడదనే అంతర్జాతీయ ఒప్పందాలను కాలరాశాయి. షెడ్యూల్డ్ కులాల 1996 చట్టం ప్రకారం (పీసా) ఆదివాసీ గ్రామాలలో ఏ నిర్ణయాలు జరగాలన్నా గ్రామసభ తీర్మానించాలే కాని ఎలాంటి తీర్మానాలు లేకుండా ఆదివాసీ గూడాలను ఆక్రమించుకొని ఆదివాసి సంస్కృతిని - ఆదివాసీల జీవన విధానాన్ని ధ్వంసం చేస్తున్నారు. పోలీసు బలగాలతో కలిసి సల్వాజుడుం ఆధివాసులపై చేస్తున్న అఘాయిత్యాలతో ఆదివాసుల సమూహ జీవన విధానాన్ని కాపాడే క్రమంలో జరుగుతున్న విప్లవోద్యమ ప్రతిదాడులను ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. ఆ క్రమంలో జరిగిందే సింగారంలో జరిగిన 18 మంది అమాయక ఆదివాసులను కాల్చి చంపిన దురాగతాన్ని అర్థం చేసుకోవాలి.

కుంట బ్లాకులోని సింగారంలో 55 కుటుంబాలున్నాయి. ఇండ్లన్నీ కూడా విసిరేసినట్లుగా అక్కడక్కడ ఉన్నాయి. జనవరి 9 శుక్రవారం రోజున 200 మంది సల్వాజుడుం ఎస్.పి.ఒ లు యుద్ధాన్ని తలపించేలా

దంతానపూర్, కొర్రాస్‌గూడ, మల్యసూర్య వివిధ గ్రామాలలోని ఆదివాసులను బంధించి, సింగారం గ్రామంపై మూడు గంటల సమయంలో దాడిచేసి దొరికిన వారిని దొరికినట్లుగా చితకబాది, ఇండ్లలోని డబ్బును ఎత్తుకెళ్లారు. నలుగురిని బంధించి తీసుకెళ్లారు. అట్లా బంధించబడ్డ ముప్పై మంది ఆదివాసీ యువతీ యువకులను సింగారానికి రెండు కిలోమీటర్ల దూరంలోని వాగుదొడ్డి దగ్గరకు తీసికెళ్లి చిత్రహింసలు పెట్టి నలుగురు మహిళలపై అత్యాచారాలు చేసి అతి కిరాతకంగా కాళ్లు చేతులు విరిచేసి కాల్చి చంపారు. సింగారం నుండి తీసుకెళ్లిన గంటలోనే కాల్పుల శబ్దాలు వినపించాయని గ్రామస్తులు తెలిపారు. రాత్రికి ఇంటికి చేరని తమ వారికోసం వెతుకుతుండగా వాగుదొడ్డి దగ్గర పద్దెనిమిది శవాలై కనిపించారు. మహిళల శవాలపై బట్టలు లేకుండా కనిపించాయి. ఎవరికి సంబంధించిన వారు వారి శవాలను తీసికెళ్లి దహనం చేశారు.

సింగారంలోని వాగుదొడ్డి దగ్గర మావోయిస్టు పార్టీకి, పోలీసులకి ఎన్‌కౌంటర్ జరిగిందని ఆ ఎన్‌కౌంటర్‌లో 18 మంది చనిపోయారని ఇంకా మృతులు పెరిగే అవకాశం ఉందని దంతేవాడ ఎస్.పి. ఎలక్ట్రానిక్ మీడియాతో మాట్లాడారు. ఎస్.పి. ప్రకటన వార్త అనేక టి.వి. ఛానెళ్లలో ప్రసారమయింది. మరుసటి రోజు సల్వాజుడుం, నక్సలైట్ దళాల మధ్య జరిగిన కాల్పుల్లో మృతి చెందాని పేర్కొన్నారు. చాలామంది సల్వాజుడుం – పోలీసు బలగాలు బొమ్మ బొరుసు లాంటి వంటారు. వాస్తవానికి ఒకేసారి బొమ్మ బొరుసు కనిపించవు. అందుకే సర్కార్ సల్వాజుడుంపై బొమ్మబొరుసు కాదు. సల్వాజుడుం, సెక్యూరిటీ బలగాలు కలిసి తిరుగుతూ, కలిసి దాడులు, లూటీలు, అత్యాచారాలు చేస్తారు. సర్కార్ గుండెకాయ అయితే సల్వాజుడుం కాళ్లు చేతులు. అందుకే ఈ ఘాతుకాన్ని సర్కార్ జుడుంగా భావించాలి.

సింగారంలో మల్లం సీత 19 సంవత్సరాల అవివాహిత ఆదివాసీ మహిళను తండ్రి లచ్చయ్య, తల్లి ముత్తమ్మ ముందే తీవ్ర దుర్భాషలాడుతూ బట్టలూడదీసి తీవ్రంగా గాయపరిచారు. సాధారణంగా బిడ్డను రక్షించుకోవాలనుకునే తల్లిదండ్రులు తమ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని పరిగెత్తారు. అంటే ఎంత భయానక పరిస్థితి ఉందో అర్థం చేసుకోవాలి. ఇదే గ్రామానికి చెందిన కారం ముత్తయ్య, కారం లచ్చయ్య స్వంత అన్నదమ్ములు. ఒకరికి 18 సంవత్సరాలు మరొకరికి 20 సంవత్సరాలు. వారికి రెండు మూడు సంవత్సరాల పిల్లలున్నారు. కొర్రాస్ గూడానికి చెందిన ఒకే కుటుంబంలో ముగ్గురిని కాల్చి చంపారు. తండ్రి ముందే చితకబాది తీసుకెళ్లారు. ఇంట్లో నుండి 3,500 రూపాయలను ఎత్తుకెళ్లారు. చనిపోయిన వారిలో మిగతా గ్రామాల ఆదివాసీల వయస్సు 20 నుండి 24 సంవత్సరాల లోపే అంటే ఒక నూతన తరాన్ని లేకుండే చేసే పన్నాగమే.

సింగారానికి ఏడు కిలోమీటర్ల దూరంలోని గొల్లపల్లి పోలీసులు సల్వాజుడుం కార్యకర్తలతో సహ మళ్లీ మూడు రోజుల తర్వాత అంటే 12 జనవరి నాడు వచ్చి ఎవరెవరు చనిపోయినారని వివరాలు సేకరించి పూడ్చిపెట్టిన రెండు శవాలను తీసికెళ్లి పోస్ట్‌మార్టంకు పంపారు. సల్వాజుడుం తీసుకెళ్లిన ముప్పై మందిలో పద్దెనిమిది మంది శవాలు దొరికితే మిగిలిన పన్నెండు మంది ఏమయ్యారనే ఆందోళన ఆదివాసులలో పెరిగింది.

కొర్రాస్‌గూడకు చెందిన నలుగురు ఆదివాసీలు తప్పించుకున్నారు. మిగతా గ్రామాలవారు నలుగురు తప్పించుకున్నారు. అంటే ఇంకా నలుగురి జాడలేదు. వారిని చంపారా లేక జుడుం కార్యకర్తలతోనే ఉన్నారా అనేది తెలియలేదు. అట్లా తప్పించుకున్న హేమ కథనం ప్రకారం– 'అందరిని ఒకే దగ్గర కూర్చోబెట్టారు. కొంతమందిని తీవ్రంగా హింసించారు. ఎవరినీ తలెత్తి చూడకుండా ఒడిసి పట్టుకున్నారు. నన్ను లెమ్మన్నారు. నాభుజాలపై తుపాకి పెట్టి కాల్చారు. పక్కన ఎవరో అరుస్తూ పడిపోయారు. నన్ను కూడా చంపేస్తారని అర్థమై ఒకే ఉదుటున తుపాకిని నెట్టేసి ప్రాణాలు బిగపట్టి వెనుకకు చూడకుండా పడుతూ లేస్తూ నాలుగు ఐదు గంటలు పరిగెత్తా'ని చెప్పాడు. అట్లా ఎనిమిది మంది ప్రాణాలు దక్కించుకొని వారం రోజుల తర్వాత వారి కుటుంబాలను కలిశారు. ఇప్పటికీ వారు మమ్మల్ని వచ్చి చంపుతారేమోనని భయం భయంగా బతుకుతున్నారు.

అసలు సింగారంనే లక్ష్యం చేసుకోవడానికి బలమైన కారణం ఉంది. సంవత్సర క్రితం సింగారంతోపాటు చుట్టు పక్కల గూడాలను కూడా కాలబెట్టారు. గత అయిదు సంవత్సరాల క్రితం తోడుకు అడ్డంగా కుంటను మావోయిస్టు పార్టీ సహకారంతో నిర్మించుకున్నారు. ఈ కుంట కింద పారకం యాభై ఎకరాల వరకు ఉంటుంది. సింగారం దాని చుట్టు పక్కల గూడాలకు కుంట నిర్మించడంతో పంటలకు, పశువులకు ఉపయోగపడుతూ అది విప్లవోద్యమానికి సంకేతంగా ఉంటుందనే కక్షతో సర్కార్ – సల్వాజుడుం దాడులకు దిగింది.

సల్వాజుడుం అనైతికమని ప్రభుత్వాలే ఆయుధాలు అందజేసి మారణకాండకు కారణమవుతున్నారని హక్కుల సంఘాలు ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేయడం జరిగింది. చత్తీస్‌గఢ్ హైకోర్టు, జాతీయ మానవ హక్కుల కమిషన్ లు గత సంవత్సరమే ప్రభుత్వం సల్వాజుడుంను ఎత్తి వేయాలని ప్రభుత్వం ఇతరులెవరికి ఆయుధాలు ఇవ్వకూడని చెప్పడంతో పాటు ఇతరులెవరైనా ఆదివాసీలను చంపితే ఐపిసి 302 కింద కేసు పెట్టాలని పేర్కొంది. ప్రభుత్వం మాత్రం మేం ఎవరిని ప్రోత్సహించ లేదంటూ తప్పించుకుంది. 2009 జనవరిలో సుప్రీం కోర్ట్ ప్రధాన న్యాయమూర్తి బాలకృష్ణన్ చత్తీస్‌గఢ్ ప్రభుత్వ కౌన్సిల్ కె.కె. వేణుగోపాల్ చెప్పిన దానికి స్పందిస్తూ ఆయుధాలు సల్వాజుడుంకు ఇవ్వడం నేరం, అట్లాంటి వారినుండి ఆదివాసీలను రక్షించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదని చెప్పారు. ఈ నేపథ్యంలో ప్రభుత్వంపై ఒత్తిడి పెరుగుతూ వచ్చింది. ఈ క్రమంలోనే అసెంబ్లీ ఎన్నికలు రావడం జరిగింది. రమణ్‌సింగ్ ప్రభుత్వం ఏర్పడడం, మహేంద్రకర్మ ఓడిపోయినప్పటికీ మేం సల్వాజుడుంనూ కొనసాగిస్తామనీ ఆదివాసులకు, హక్కుల సంఘాలకు చత్తీస్‌గఢ్ ప్రభుత్వం తీవ్రమయిన హెచ్చరిక చేసింది.

జనజాగరణ్ అభియాన్ అయినా సల్వాజుడుం అయిన రేపు మరొకటి అయినా రాజ్య హింసలో భాగమై అణచివేస్తూ దండకారణ్యంలోని మానవ, ప్రకృతి వనరులను కొల్లగొట్టటం, దిన దినం తమ జీవితాలను వినాశనంలోకి నెడుతున్న దోపిడీ పాలకవర్గాల పాలనకు వ్యతిరేకంగా పోరాడుతూనే అభివృద్ధి కార్యక్రమాలను ప్రధానంగా వ్యవసాయంతో పాటు విద్య, ఆరోగ్యం, పర్యావరణానికి సంబంధించిన ఆదివాసీల ప్రత్యామ్నాయ అభివృద్ధిని నమూనాను చేపడుతున్నారు. వీ

*లోహియా భావాలు అత్యంత ఆదర్శవంతమైనవని అంటూ, ఆయన వ్యక్తిత్వాన్నీ, అభిప్రాయాలనూ వివరిస్తున్నారు* **డా. వెల్చాల కొండల రావు**

# రామమనోహర్ లోహియా-వ్యక్తి, వ్యక్తిత్వం

*"లోహియాగారు ఎచటికి వెళ్ళినా, ఎవరితో మాట్లాడినా వారి ఆలోచనా విధానానికి ఒక చక్కందనాన్ని, చిక్కందనాన్ని ఆపాదించేవారు. కొన్ని క్రొత్త ప్రశ్నలు లెవదీసేవారు. కొన్ని క్రొత్త జవాబులు అందించేవారు. కొన్ని సమస్యలకు క్రొత్త పరిష్కారాలు సూచించేవారు"*

*"గత పదేళ్ళలో నేనెందరో అమెరికన్లు ఉపన్యసించగా విన్నాను. ఇపుడు లోహియాగారిని కూడా. వారిలా మా అమెరికన్లలో ఏ ఒక్కరైనా మాట్లాడగలిగితే ఎంతో గర్విస్తాను."*

*"లోహియా చాలా ఖులాసా మనిషి. ఎంత చక్కగా ఉపన్యసించగలడో అంత చక్కగా సంభాషించగలడు, ఎంత చక్కగా సంభాషించగలడో అంత చక్కగా చర్చించగలడు, ఎంత చక్కగా చర్చించగలడో అంత చక్కగా ఆలోచించగలడు. అతని మధ్య గడపడం అదొక స్ఫూర్తి, ప్రేరణ, వికాసం, వినోదం."*

**- అమెరికన్ మేధావులు**

మనమొక వ్యక్తిని అతని గుణం ద్వారా తెలుసుకుంటాం, అతని వ్యక్తిత్వాన్ని అతని ప్రతిభ ద్వారా.

వ్యక్తిగా డా. రామమనోహర్ లోహియా చాలా గుణవంతుడు, నిరాడంబరుడు, నిప్పులాంటి నిజాయితీ కలవాడు, మానవతావాది, మచ్చెరగని ప్రజల మనిషి. గాంధీ అంతటివాడు అతనిని 'డా. రాం మనోహర్ లోహియా వంటి సాహసీ, ధైర్యశాలిని నేనెరగను' అని అన్నాడంటే అతడెంత ధీరుడో, సచ్చీలుడో, మనం ఊహించుకోవచ్చు.

జీవితంలో సాదాగా జీవించలేనివాడు సీదాగా కూడా జీవించలేడు. సీదాగా జీవించడానికి సాదాగా జీవించడమొక పునాది, ఒక ముఖద్వారం లాంటిది. ఎన్ని కోరికలు ఎక్కువైతే అన్ని ఆరాటాలెక్కువ, ఆడంబరాలు, దురాశలు. ఎన్ని దురాశలెక్కువైతే అంత అవినీతులు, అధర్మాలు, అన్యాయాలు, దగాలు, ధోకాలు, దోపిడీలు, హింసలు. అందుకే జీవితంలో అతి ముఖ్యమైన విలువ నిరాడంబరత. డా. రామమనోహర్ లోహియాకది జన్మతః వచ్చిన సంస్కారం. దానినతడాతని ఆఖరు క్షణం వరకు పాటించాడు. అందుకే బహుశా జవహర్‌లాల్ నెహ్రూపై డా. లోహియా విసిరిన అన్ని విసురుల్లోకల్లా 'మామూలు పౌరుని సగటు రోజానా ఖర్చు 5 పైసలైతే మీపై అయ్యే ఖర్చు ఇరవై ఐదు వేలు' అన్నది అతిపెద్దదేమో.

లోహియాలాంటి నిరాడంబరుడైన నాయకులు పట్టుమని పది మంది కూడా దొరకరు; అప్పటికీ ఇప్పటికీ మన దేశంలో. బహుశా గాంధీ గారిని మన దేశీయులు ప్రేమించింది కూడా అతని రాజకీయ నీతికన్నా ఎక్కువ అతని నిరాడంబర జీవన సరళి కొరకేనేమో. లోహియాగారు ప్రతిపాదించిన 'కల్చరల్ హ్యూమనిజం', 'సాంస్కృతిక మానవత్వం' ఈ నిరాడంబరత పునాది పైనే ఆధారపడి ఉంది. అదే లేకపోతే సంస్కృతి, సంస్కారం, మానవత్వమే లేదు. సంస్కారానికి ఎవరెన్ని నిర్వచనాలిచ్చినా దానికి 'సహనం', 'నిగ్రహం', 'నిష్కామమే' అసలు సిసలైన నిర్వచనం అనకు తప్పదు. కోరికలపై, ఆడంబరాలపై, అత్యాశలపై నిగ్రహం. అదే అచ్చమైన గాంధేయవాదం కూడా. ఎందుకంటే, నిగ్రహమే లేకపోతే అహింస సాధ్యం కాదు, అహింసే సాధ్యం కాకపోతే సత్యం, ధర్మం, న్యాయం, నీతి, నిజాయితీ సాధ్యం కావు. అందుకే మన పవిత్ర గ్రంథాలు, వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, తాత్త్విక దార్శనిక సాహిత్యాలు మున్నగునవన్నీ నిష్కామాన్ని, నిరాడంబరతనే నొక్కి వక్కాణిస్తాయి.

లోహియాగారి వ్యక్తిత్వానికొస్తే, మొదట మనం అతడెంత వికాసవంతుడో, ప్రతిభావంతుడో గ్రహించాలి. డా. లోహియా చాలా చదువుకున్నవాడు, పాండిత్యమే కాదు రుష్యత్వం కూడా తెలిసినవాడు. అంటే, ఆతడు కేవలం దర్శన దృష్టే కాదు దార్శనిక దృష్టి కూడా కలవాడు. అందుకే ఒకసారి విశ్వనాథ సత్యనారాయణగారి ఉపన్యాసం విని 'మీరీతనిని పండితుడన్నారు. ఇతడు సాక్షాత్తు రుషి" అని అన్నారట లోహియాగారు, వారిని విశ్వనాథవారి ఉపన్యాసానికి తీసికెళ్ళిన జువ్వాడి గౌతమరావుగారితో. అందుకే అంతపాటి సామ్యవాది, మానవతావాది, గాంధేయవాది కాగలిగాడాతడు. మార్క్సిజాన్ని ఒక రాజకీయ దృష్టితోనే కాక తాత్త్విక దృష్టితో చూడగలిగాడు. భారతీయ సంస్కృతికి మార్క్సిజం నీతి, రీతి ఏ మేరకు పనికొస్తుందో బేరీజు వేసి భారతీయ స్థితిగతుల కనుగుణ్యంగా దానిపై వ్యాఖ్యానించగలిగాడు.

లోహియా బహుభాషా కోవిదుడు. మూడు మాసాలలో జర్మనీ భాష నేర్చుకొని, ఆ భాషలోనే వ్రాసి డాక్టరేట్ పొందాడు. అర్థంతోపాటు చమత్కారాన్ని, హాస్యాన్ని, వ్యంగ్యాన్ని, సందర్భోచితంగా జోడించి అభివ్యక్తీకరించినవాడు. దేశ, విదేశీయ విషయాలు ఎంతో క్షుణ్ణంగా తెలిసినవాడు. వాటి సాహిత్య సారస్వతాలు బాగా అధ్యయనం చేసినవాడు. మతాలు, గతాలు, చరిత్రలు లోతుగా ఎరిగినవాడు. అతని ప్రతిభ అతని మాటల్లోనే కాదు చూపుల్లో కూడా తాండవించేది. అంతపాటి మేధావి, ప్రతిభ మెలుకువలు తెలిసినవారు చాలా అరుదు. లోహియాగారిది ఆర్జించిన, పోషించిన ప్రతిభ కాదు, సహజ స్వచ్ఛంద ప్రతిభ ఊటలా ఊరేది.

డా. లోహియా చాలా సహజమైన మనిషి. వికాసవంతులతో, వినయవంతులతో, స్నేహితులతో, చాలా సరదాగా, నవ్వుతూ నవ్విస్తూ

అందరిలో ఒకనిగా, అందరివాడుగా మాట్లాడుతూ మసలేవాడు. అతని ప్రతిభను అనవసరంగా అన్ని చోట్లా నెత్తికెక్కించుకునేవాడు కాదు. తాను నమ్మిన విశ్వాసాన్ని వదిలేవాడు కాదు. దాని కొరకు సంకుచిత రాజకీయాలకు, పాల్పడే వాడు కాదు. ఆయన ఒక హుందాగల, సరదా అయిన రాజకీయవేత్త. అందుకే ఆనాటి మురికి రాజకీయాలలో నెగ్గలేకపోయాడు.

డా. లోహియా సిద్ధాంత పర రాజకీయవేత్త కనుక సిద్ధాంతానికే పెద్దపీట వేసేవాడు. అందుకే అతనికి కుటుంబ రాజకీయాలు, వంశ పారంపర్య రాజకీయాలు, మత రాజకీయాలు, అధికార వ్యామోహ రాజకీయాలు మున్నగునవి గిట్టేవి కావు. వాటికి వ్యతిరేకంగా చివరి వరకూ నిర్భయంగా, నిర్మోహమాటంగా ఉద్యమించాడు, వ్రాశాడు, మాట్లాడాడు.

డా. లోహియా ఏది మాట్లాడినా ఎన్నో సాక్ష్యాలతో, ఉదాహరణలతో, ఉటంకింపులతో మాట్లాడేవాడు. ఈనాటి రాజకీయవేత్తల్లాగా కేవలం నిందల, అపనిందల కొరకు నిరాధారంగా మాట్లాడేవాడు కాదు. అందుకే అతడు పార్లమెంటులో మాట్లాడినా, బయట మాట్లాడినా అతని ఉపన్యాసాలను. అందరూ సవినయంగా వినేవారు. డా. లోహియా విమర్శలన్నీ వ్యవస్థాగతంగా ఉండేవి కాని వ్యక్తిగతంగా కాదు. ఎప్పుడైనా వ్యక్తిగతంగా మాట్లాడినా పాలసీలతో, పరిపాలనలతో, విధి విధానాలతో ప్రమేయం లేకుండా మాట్లాడేవాడు కాదు.

డా. లోహియా ఇంగ్లీషు భాష చాలా బాగా మాట్లాడేవాడు, రాసేవాడు. తమాషా ఏమిటంటే డా. లోహియా ఆంగ్లేయ భాషను మన దేశంపై రుద్దడాన్ని తీవ్రంగా వ్యతిరేకించేవాడు. కాని దానిని ఒక భాషగా ద్వేషించేవాడు కాదు. స్వామి వివేకానంద ఆంగ్ల భాషను ఆధ్యాత్మికంగా ఎంత శక్తిమంతంగా వాడేవాడో డా. లోహియా దానిని సామాజికంగా, రాజకీయంగా ఆర్థికంగా అంత శక్తిమంతంగా వాడేవాడు. అతని సాహిత్యం చదివితే, ఆడియో క్యాసెట్లు వింటే మనకది తెలుస్తుంది. ఆంగ్లేయ భాషపై లోహియాకున్న పట్టు అంతా ఇంతా కాదు. ఒక్కొకసారి దానికి ఆంగ్లభాషీయులే ముగ్ధులయేవారు.

డా. లోహియా సాహిత్యం చదువుతుంటే మనకెన్నో సరికొత్త భావాలతోపాటు, సరికొత్త పదాలు దొరుకుతాయి.

బేబీ మర్డర్, కంజీల్డ్ క్లాస్, మొబైల్ కాస్ట్, ఇక్వెల్ ఇర్రెలవెన్స్, మోనాటనిక్ మైండ్, జాయ్‌లెస్ కంఫర్ట్, కల్చరల్ హ్యూమనిజం, ప్రాపగండిస్టిక్ థింకింగ్, టోట‌ల ఎఫిషియన్సీ, మాక్జిమం ఎఫిషియన్సీ, స్టిమ్యూలేటెడ్ అర్జ్, ఇమ్మొబైల్ క్లాస్, ప్రిఫరెన్షియల్ ఆపర్చునిటి, ఫాల్స్ ఫైర్స్, మూవింగ్ రిలిజన్, బాల్డర్‌డాష్, ట్రిపుల్ లీగ్, ఫోక్ టంగ్, ఆర్క్ స్టోన్, ఫ్యూడల్ డ్రెస్సింగ్, రోటి అండ్ బేటి, బందూక్ కి గోలీ అంగ్రేజీ కి బోలి లాంటివి.

కొందరి రచనలు భావోద్వేగాని కొరకే కాదు, భాషోద్వేగాని కొరకు కూడా చదవాల్సినవి. లోహియాగారి రచనలు అలాంటివి.

లోహియాగారి భావాలు అత్యంత ఆదర్శవంతమైనవి. కొన్నిసార్లు ప్రవచనాల్లాంటివి, నిర్వచనాల్లాంటివి. అలాంటివి లోహియా సాహిత్యంలో కోకొల్లలు. వాటికొరకైనా లోహియాగారి సాహిత్యాన్ని చదవాలి. వారి శాస్త్రీయ, దార్శనిక దృష్టి దృక్పథాన్ని తెలిసికొని ఆనందించాలి. వాటిలో మనకు వెలుగుతోపాటు వెటకారాలు, వేళాకోళాలు కూడా లభిస్తాయి. "మీరు నా భావాలు ఒప్పుకోకపోతే కాలమే మిమ్ముల మున్ముందు ఒప్పిస్తుందన్న సూచన వారి రచనల్లో అంతర్లీనంగా ప్రవహిస్తుంది.

లోహియాగారు బతికున్న రోజుల్లో వారి భాషను, భావాలను, వినడానికి ఎంతో మంది ఉత్సాహంతో వెళ్ళేవారు. వారిని వినడం ఆ రోజుల్లో అదొక సరదా, సంబరం, వికాసం. అతనితో ఏ మాత్రం ఏకీభవించని వారు కూడా అతని ఉపన్యాసాలు వినడానికి పెద్ద సంఖ్యలో వెళ్ళేవారు. గిట్టినవారే కాదు గిట్టనివారు కూడా వారి భావాలను ఎంతో జాగ్రత్తగా వినేవారు. వారిలా అంత సాధికారికంగా, విశ్వసనీయంగా మాట్లాడేవాళ్ళు, వ్రాసేవాళ్ళు ఆనాడైనా ఈనాడైన చాలా అరుదు. అతని మరణంతో ఈ దేశం ఒక గొప్ప మేధావిని, రచయితను, వ్యక్తిని, భావుకున్ని కోల్పోయింది. అతడు ఆతని భావాలను ఎంత వికాసంతో వినోదంతో అందించేవాడో కొన్ని వాక్యాల ద్వారా ఇపుడు చూద్దాం.

1. ఒక జాతి జీవన సరళిని, సంస్కృతిని కాపాడుకోవడానికి ఆ జాతీయుడు ప్రాణాలు కోల్పోవలసి వచ్చినా వెనుదీయగూడదు.
2. అమెరికా వారికెప్పటికీ వారు చేసింది మంచిదా లేదా యను దానిపై దృష్టి కన్నా దాని గురించి ఇతరులు ఏమనుకుంటున్నారను దానిపైననే దృష్టెక్కువ.
3. ఒకరి నాగరికత మంచి చెడుల గురించి మనకు ఆ నాగరికతకు చెందిన స్త్రీలద్వారానే ఎక్కువ తెలుస్తుంది. వారు నివసించే, ఆలోచించే విధానం ద్వారా.
4. ఆంగ్ల పదాలపై మోజున్నవారు, ఆంగ్ల పేర్లు కూడా ఎందుకు పెట్టుకోరు వారి పిల్లలకు విక్టోరియా ఎలిజెబెత్, జాన్ లాంటివి, కృష్ణ, రామలాంటి భారతీయ పేర్లు ఎందుకు పెట్టుకుంటారు?
5. ఆంగ్లభాష ధనికుల మధ్య, దరిద్రుల మధ్య, అగ్రకులాల మధ్య అణగారినకులాల మధ్య, విద్యావంతుల మధ్య, విద్యకు నోచుకోని వారి మధ్య ఎంత అగాధాలను సృష్టించిదంటే ఆ భాషొక్కటే మన దేశంలోని అన్ని అసమానతలకు కారణమేమోననిపిస్తుంటుంది.
6. పెట్టుబడిదారీ విధానం, కమ్యూనిజం, రెండింటికీ "కేంద్రీకరణ" వైపే దృష్టి ఎక్కువ. ఇతర దేశాలపై ఎలా పెత్తందారీతనం చెలాయించాలను దానిపై.
7. మీ ప్రశ్నలు మీరే వేసుకోజాలకపోతే, ఇతరులు వేసే ప్రశ్నలకు ఎలా జవాబివ్వగలరు?
8. ఈనాటి ఆలోచనలన్నీ, ఆలోచనలకన్నా ఎక్కువ ప్రచారం కొరకు. అందుకే అవి చాలా వరకు కృత్రిమంగా అనిపిస్తాయి.
9. ఆసియా ఖండంలో స్వేచ్ఛకూ రొట్టెకున్న సంబంధం విడదీయరానిది.
10. ఇతర దేశాల సహాయ సహకారాల వలన ఆసియా ఖండం కమ్యూనిజం నుండి కాపాడుకోజాలదు. తనదైన సిద్ధాంతం వలన తప్ప.
11. అమెరికన్లు ఆసియాలో పెట్టే పెట్టుబడి ఆసియా వారిని కాపాడుటకు కాదు వారిని వారు కాపాడుకొనుటకు.
12. ఇండియాలో ఇంత వరకే సాత్వికులు మరీ ఎక్కువున్నారు. అలాంటప్పుడు అలాంటి వారిని పరాయి దేశాల నుండి దిగుమతి చేసుకోవడం దేనికి?

13. మీరొక విశ్వవిద్యాలయంలో నేర్చుకునే దాని కన్నా భారత దేశంలోని ఒక పల్లెటూరి నుండి ఎక్కువ నేర్చుకోవచ్చు.
14. నాకు సామ్యవాదమంటే సృజనాత్మక ఆలోచనకు, ఆచరణకు ఒక ద్వారం, ఒక రహదారిలాంటిది.
15. అమెరికాలో మీకు రెండే రెండు వర్గాలు ఎక్కువగపడతాయి. ఒకటి స్విమ్మింగ్ పూల్లు ఉన్నవర్గం, ఒకటి లేనిది.
16. ఆసియా గురించి ఆసియా వాళ్ళకు ఎక్కువ తెలియనట్లే అమెరికా వాళ్లకు అమెరికా గురించి ఎక్కువ తెలియదు.
17. మనకు మన చిహ్నాల గురించి పట్టినంతగా వాటి వెనకాల ఉన్న ఆదర్శాల గురించి పట్టదు.
18. మీకు సిద్ధాంతాలే పట్టకపోతే మీకు మిగిలేవి మీ దైనందిన చర్యలే. అవి బ్రతకడానికి అక్కరకొస్తే అక్కరకొస్తాయేమో కాని జీవించడానికి కాదు.
19. ప్రజాస్వామ్యం వలె సామ్యవాదం కూడా పూర్తిగా ఎదిగిన వ్యవస్థ కాదు, ఎదుగుతోన్న వ్యవస్థ.
20. ఈనాటి 'నేతలు' జాతీయ దృష్టిలో గట్టివారే కాని అంతర్జాతీయ దృష్టిలో వట్టివారు.
21. ప్రజలంతా ఎక్కడైనా ఒక్కరే, ప్రభువులే వేర్వేరు.
22. విప్లవవాదికి జరిగిన అన్యాయంపై మీరు కన్నెర్ర చేయకపోతే అతనికి జరిగిన అన్యాయంపై కంటతడి ఎలా పెట్టగలరు.
23. పెట్టుబడిదారీ విధానం తక్కినవన్నీ అటుంచి బీదదేశాలకు కనీసం పెట్టుబడి కూడా సమకూర్చజాలడం లేదు.
24. యూరోపియన్ల ఆలోచనా విధానాలకు, అమెరికా పరాకాష్ఠ. యూరప్‌లో వారు కావాలనుకున్నవన్నీ వారికి అమెరికాలో లభిస్తాయి.
25. విప్లవానికి సానుభూతి, కోపం, రెండూ సమపాళ్ళలో అవసరం. గాంధీగారు ఎంత నిగ్రహంగా ఉండేవారో ఒక్కొక్కసారి అంత ఆగ్రహంగా, అసహనంగా కూడా ఉండేవారు.
26. 'సైబర్ నాటిక్స్' ఒక ప్రసార సాధన శాస్త్రం. అది మన అభివృద్ధికి ఎంతో అవసరం. కాని ఇపుడది ఎంత సంక్లిష్టమవుతోందంటే ఎప్పుడో ఒకప్పుడు అది "స్ఫోటకం"లా బ్రద్దలవుతుందేమోనని భయమేస్తుంది నాకు ఒక్కొక్కప్పుడు.
27. సగటు ఆదాయమూ, సగటు జీవన ప్రమాణమూ ఒకటే కావు. అయినా సర్కారు వారి అంచనాలెప్పటికీ వంచనలే.
28. పాత ఫ్యూడలిజం పోయింది, కొత్త ఫ్యూడలిజం వచ్చింది, ఇది దానికంటే తెలివి కలది.
29. పాశ్చాత్యులవంటి వస్త్రాధారణ మన వాతావరణంలో మనను ఉక్కపోతకు గురి చేస్తుంది. అయినా వాటిని ధరిస్తాం మనం, అలాంటిది మన బానిసత్వ అనుకరణ మన మనస్తత్వం.
30. మేధావులనే వాళ్ళు, మేధావులు కాని వాళ్ళు వారి తలపైకెక్కితేనే తలవంచుతారు. ఏనుగు మావటి వానికి తలవంచినట్లు.
31. ఇంగ్లిషు, ఇంగ్లిషు భాషైనందువలన గొప్పది కాలేదు, ధనవంతులభాషయినందున, అగ్రకులాల వారి భాషైనందున తప్ప.
32. ఒకసారి జీసస్ క్రైస్ట్ ఇంగ్లిషులో ఉపన్యసించాడంటే నాకాతని తెలియనితనంపై ఆశ్చర్యం వేసింది. జీసస్ ఉపన్యసించింది అరమిక్ భాషలో, ఇంగ్లిషులో కాదు. ఆ భాష సంస్కృతానికి దగ్గర.
33. ఆంగ్లభాషకు కళ్లెం వేయకుండా అనుకున్నంత మేరకు మీరు ఆకలినీ అరికట్టలేరు, ఆర్థిక అసమానతను కూడా.
34. ఒక కమ్యూనిస్టు పార్టీయే కాంగ్రెసంత తెలివికలది. దాని పాఠాలు దానికే నేర్పగలిగేది. అది గురువును మించిన శిష్యుని లాంటిదవుతోంది. ముమ్ముందు కాంగ్రెస్‌కు అదే బలమైన ప్రత్యర్థి. సిద్ధాంతాలను పక్కకు పెట్టి "సిద్ధి" కొరకేపాటుపడడం అది నేర్చుకుంటోంది.
35. పండిట్ నెహ్రూ, రాజగోపాలాచారి లా ముక్కుసూటి మనిషి కాదు, ముసుగులోగుద్దులాటి మనిషి. పామును చావనీయడు, కట్టెను విరిగినీయడు. అటూ ఇటూ కాకుండా అయోమయంగా మాట్లాడతాడు. అతని 'సోషలిస్టిక్ పాటర్న్' దానికి తార్కాణం. అది సామ్యవాదం కాదు సామ్యవాదపు ముసుగు మాత్రమే. ఈ దేశానికేదైనా 'శాపం'లా దాపురించిందంటే అది 'కులం' ఒక్కటే. దానిని మనం కులాంతర వివాహాల ద్వారా జన్మించిన వారికి విద్యల్లో, ఉద్యోగాల్లో తదితర వాటిలో 'రిజర్వేషన్లు' సబ్సిడీలు మున్నగునవి కల్పించక కులాలవారికే కల్పించి కులాలను మరింత బలపరిచాం. ఇది మన మేధావులు, నాయకులు చేసిన క్షమించరాని పాపం.

అంతపాటి మేధావి, రాజనీతిజ్ఞుడు సోషలిస్టు పార్టీని ఎందుకంత ముందుకు తీసుకోపోలేకపోయాడో ఇప్పుడు ఆలోచిద్దాం.

దానికి మనకు ప్రధానంగా రెండూ కారణాలు కనిపిస్తాయి. జాతీయ కారణాలు, అంతర్జాతీయ కారణాలు.

సోషలిస్టు సిద్ధాంతాలు మొదటి నుండీ అనేకానేక భేద విభేదాలు కలవి. ఆ భేద విభేదాలు అప్పటికీ ఇప్పటికీ ఇంకా ఎక్కువౌతున్నాయి కాని తక్కువకావడం లేదు. ఈ పరిస్థితుల్లో ఏది సామ్యవాదమో ఏది కాదో అర్థం చేసుకోవడం ఎంతో మందికి అయోమయమయింది, ఇంకా అవుతూనే ఉంది. స్వేచ్ఛకు, ప్రజాస్వామ్యానికి లాగే సామ్యవాదానికి కూడా శాఖలు, ఛాయలు, వ్యాఖ్యానాలు, విశ్లేషణలు కోకొల్లలు. ఫేబియనిజం, మార్క్సిజం, ట్రాట్స్కీయిజం, టిటోయిజం, లెనినిజం, స్టాలినిజం, మావోయిజం మున్నగునవి.

ఒక్క భారతదేశపు సోషలిస్టు పార్టీ, కమ్యూనిష్టు పార్టీలలోనే ఒక్కొక్కదానికి అయిదారు కుంపట్లకన్నా తక్కువ లేవు. లోహియాగారి సామ్యవాదం ముందంజ వేయకపోవడానికి ఈ సిద్ధాంతపరమైన అయోమయం ప్రధానమైన అంతర్జాతీయ కారణం.

జాతీయ కారణాలకొస్తే లోహియాగారికి గాంధేయవాదంపై అపరిమితమైన విశ్వాసముండేది. ప్రత్యేకంగా గాంధేయవాదంలోని 'అహింసావాదం', 'సహాయ నిరాకరణోద్యమం', 'సత్యాగ్రహం' 'నిరహారదీక్ష' మున్నగు నీతులపై, రీతులపై.

స్వాతంత్ర్యానంతరం గాంధేయవాదం కాంగ్రెస్‌వారికి ఎంత దూరమవుతూ పోయిందో, జయప్రకాష్ నారాయణ్, రామమనోహర్ లోహియా, నరేంద్ర దేవ్ మున్నగు వారికి అది అంత దగ్గరవుతూ పోయింది. కాని, కాంగ్రెస్‌వారు మాత్రం గాంధేయవాదానికి మేమే వారసులమని చాటుకుంటూనే పోయేవారు, ఇంకా చాటుకుంటూనే

*ఆధునిక భారత స్వతంత్ర మేధావిగా ఎదిగిన లోహియా విశిష్టతను వివరిస్తున్నారు*

**డా. జె.వి. రాఘవేంద్ర రావు**

# మహా మేధావులు - మార్క్స్, లోహియా

పంతొమ్మిదవ శతాబ్దంలోని మహా తాత్వికుల్లో విశిష్ఠ స్థానం కల మేధావి కార్లమార్క్స్. ఆయన వివిధ సామాజిక దశలలో - ముఖ్యంగా పెట్టుబడిదారీ సమాజంలోని దోపిడీ వ్యవస్థను చాలా విపులంగా, నిశితంగా విశ్లేషించారు. దీని ఆధారంగా నూతన విప్లవాత్మక సమాజవాద వ్యవస్థాపనను కార్మికవర్గం రూపొందించ వచ్చునని దానికే వర్గ పోరాటమూ, విప్లవమే మార్గమని ఉల్లేఖించాడు. ఈ భావ సరళిని ఇంకా ముందుకు తీసుకు వెళుతూ లెనిన్ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వాదం చరమదశ లేదా ఉన్నతదశ గా సూత్రీకరించాడు.

సామ్రాజ్యవాద పెట్టుబడుల వల్ల (రష్యాలో) పెట్టుబడిదారీ వ్యవస్థ బాగా అభివృద్ధి చెందిందని లెనిన్ అభిప్రాయం. దీన్ని అనేక మంది ఐరోపా మేధావులు, స్టెర్న్‌బర్గ్, ఫ్రెడరిక్ క్లేర్ మాంట్ మొదలగు వారు ఆమోదించలేదు.

అలాగే భారతదేశంలోని సోషలిస్ట్ తాత్వికులలో ఇందుకు భిన్నమైన అభిప్రాయాలుండేవి. వారిలో మొదలు కాంగ్రెస్ సోషలిస్టుగా, అటు తర్వాత సోషలిస్టు పార్టీ నాయకుడిగా ప్రసిద్ధిగాంచిన రామ్ మనోహర్ లోహియా ముఖ్యుడు.

1934లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ప్రాథమిక స్థాపకులలో లోహియా ఒకరు. ఆయన సి.ఎస్.పి. కి సాధారణ కార్యదర్శిగా పనిచేశారు. మీరట్‌లో 1936లో జరిగిన మహాసభలో మార్క్సీయ సోషలిజం సిద్ధాంతాన్ని తమ రాజకీయ భావజాలంగా అంగీకరించారు.

1936 నుండి 1942 మధ్య స్వాతంత్ర్య పోరాట వేగం కొంత మందగించింది. మళ్లీ 8 ఆగస్ట్, 1942 నుండి ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. గాంధీజీ 'క్విట్ ఇండియా' ఉద్యమానికి పిలుపునిచ్చారు. కాంగ్రెస్‌వారు, సోషలిస్టులు, ఇతర రాజకీయవాదులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రజలు ముమ్మరంగా సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్లడంతో, బ్రిటిష్ సామ్రాజ్యం కంపించిపోయింది. బ్రిటిష్ పాలకులు అప్పటికే రెండవ ప్రపంచ మహాసంగ్రామంలో చిక్కుకుని ఉన్నారు. ఒకవైపు భారత జాతీయ పోరాటాన్ని, ఇంకోవైపు జపాను-జర్మనీ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తూ బ్రిటిష్‌వారు పోరాడాల్సి వచ్చింది. యుద్ధం గెలవాలంటే భారత ప్రజల సైన్యం మద్దతు వారికే చాలా అవసరం. గాంధీజీతో బేరసారాలు సాగించారు. కాని అవి ఫలించలేదు.

ఉన్నారు. దానికి తోడు సామ్యవాదానికి అటూ ఇటూ కాని "సోషలిస్టిక్ ప్యాటర్న్ ఆఫ్ సొసైటీ" వంటి కాంగ్రెస్‌వారి ఆర్థిక పాలసీ కూడా పోటీగా రూపొందింది. అలాగే కమ్యూనిష్టు పార్టీ సిద్ధాంతాలు కూడా వీటన్నింటి వలన సోషలిస్టు పార్టీ సిద్ధాంతాలకొక స్పష్టత లేకుండా పోయింది. పార్టీ కార్యకర్తలు, అనుయాయులు, వాటిని నిర్దుష్టంగా విశ్వసించుటకు.

వాటికి తోడు రాను రానూ భారత రాజకీయాలు ఓటు బ్యాంకు రాజకీయాలుగా తయారయ్యాయి. వాటి వలన ఓటర్లు ఏ పార్టీకి అధికారానికొచ్చే అవకాశాలు ఎక్కువుంటే ఆ పార్టీకే ఓటు వేసే మనస్తత్వాన్ని అలవర్చుకున్నారు. కాంగ్రెస్, బిజెపి వారి ఓటు బ్యాంకు రాజకీయాలు వారికి బాగా పనికొచ్చాయి. దిన దినం కేంద్ర ప్రభుత్వం బలహీనపడడం వలన ప్రాంతీయ పార్టీలు కూడా ఎన్నో పుట్టుకొచ్చాయి. వాటికి ప్రాంతీయ సమస్యలే సిద్ధాంతాల లాంటివైపోయాయి. ఈ విధంగా సిద్ధాంతపరమైన రాజకీయాలు వెనకబడి స్వార్థపర రాజకీయాల ప్రమేయం పెరిగిపోయింది. దాని వలన లోహియా సోషలిస్టు పార్టీ సిద్ధాంత పరంగా నిలదొక్కుకోలేకపోయింది.

అంతేకాకుండా పారిశ్రామిక అభివృద్ధి జరిగి, వృత్తి పరుల సంఖ్య పెరిగిన కొద్దీ వారికి చెందిన సంఘాలు కూడా పెరిగి అవి సిద్ధాంత రాజకీయాలను దెబ్బతీశాయి. వాటికి సిద్ధాంతాలతో అవసరం లేకుండా వాటి అవసరాలు, వాటి ప్రయోగాలే ముఖ్యమైపోయాయి. వాటి వలన ఎన్నో అహింసేతర పద్ధతులు ముందుకొచ్చాయి. పరువు, ప్రతిష్ఠ లేని వారు కూడా సత్యాగ్రహాలు, నిరాహారదీక్షలు చేపట్టడం వలన వాటి ఖదరు పోయింది. వాటిని బూటకాలుగా, నాటకాలుగా జమ కట్టేవారు ఎక్కువైపోయారు. అలా గాంధేయవాదమే మెలమెల్లగా మరుగున పడి పోయింది. ఆ గాంధేయవాదాన్ని ఒక నీతిగా రీతిగా స్వీకరించిన డా. లోహియాగారి సోషలిస్టు పార్టీ కూడా. అధికార దాహం, ఓటు బ్యాంకు రాజకీయాలు బాగా బలపడిపోయి ప్రజలలో రాజకీయమంటేనే ఒక నిస్పృహ, నిరాశ, జుగుప్స పెరిగిపోయింది.

ఈ విధంగా లోహియా గారి సిద్ధాంతాలు, విలువలు, విశ్వాసాలు ఎంత మంచివైనా వాటికి కాల దోషం పట్టింది. దానికి లోహియాగారు ఏ మాత్రం కారణం కాదు. కాలమే కారణం. భారతదేశంలో పెరిగిపోయిన, ఇంకా పెరిగిపోతోన్న స్వార్థ రాజకీయాలు, మత రాజకీయాలు, ప్రాంత రాజకీయాలు, ఓటు బ్యాంకు రాజకీయాలు, అధికార దాహ రాజకీయాలు మాత్రమే కారణాలు కాని లోహియాగారు, వారి సోషలిస్టు పార్టీ కానీ కాదు. వీ

ఎందుకంటే గాంధీజీ ఒక షరతు పెట్టారు. బ్రిటిష్ పాలకులు తాము భారత్ నుండి నిష్క్రమించే తేదీని ప్రకటిస్తే తాము యుద్ధానికి అనుకూలంగా నిర్ణయం తీసుకుంటామని చెప్పారు. బ్రిటిష్ పాలకులు ఒప్పుకోలేదు. దీని ఫలితంగా స్వాతంత్ర్యోద్యమ తీవ్రతను, వేగాన్నీ పుంజుకుంది.

ఎం.ఎన్.రాయ్ (రాడికల్ హ్యూమనిస్ట్ సిద్ధాంతకర్త) భారతీయ కమ్యూనిస్ట్ పార్టీ నాయకులు, రెండవ ప్రపంచ మహా సంగ్రామంలో బ్రిటిష్ వారు నిర్వహిస్తున్న పాత్రను సమర్థించారు. అది ప్రజల యుద్ధమని, దానికి భారత ప్రజలు సాయపడాలని లేకపోతే మొత్తం ప్రపంచం ఫాసిజం నియంతృత్వానికి బలైపోతుందని వారు హెచ్చరించారు. దీన్ని కాంగ్రెస్ నాయకులతో పాటు సోషలిస్టులు కూడా తిరస్కరించారు.

జీవితాంతం మార్క్సిస్ట్‌గా ఉన్న ఆచార్య నరేంద్రదేవ్, రెండవ ప్రపంచ మహా సంగ్రామం (బ్రిటిష్ వారితో సహా) 'సామ్రాజ్యవాద నిర్మూలనకు వ్యతిరేకంగా జరిగే యుద్ధం కాదని - భారతీయ కమ్యూనిస్టులు సోషలిజానికి ద్రోహం చేస్తున్నారని, మార్క్సిజానికి, గతితార్కిక వాదానికి వ్యతిరేకంగా తప్పుడు వ్యాఖ్యానం చేస్తున్నారని' ఆయన ఘాటుగా విమర్శించాడు.

రామ్‌మనోహర్ లోహియా కమ్యూనిస్టుల ప్రవర్తన పట్ల దిగ్భ్రాంతి చెందాడు. ఈ ప్రవర్తన బీజాలు కమ్యూనిస్టుల ఆచరణకే పరిమితమై ఉన్నాయా లేక మార్క్సిస్టు సిద్ధాంతంలో కూడా ఇమిడి ఉన్నాయా అనే ప్రశ్న లోహియాలో మొలకెత్తింది. ఆయన కొత్త ప్రేరణతో మార్క్స్ సిద్ధాంతాన్ని సమూలంగా ఒలకబోసి చూశాడు.

1942-43లో జైలులో ఉద్యమ సత్యాగ్రహిగా ఉన్నపుడు, 1943లో 'మార్క్స్ తరువాయి అర్థశాస్త్రం' అనే అరవై పేజీల సిద్ధాంత వ్యాసం రాశాడు. జైలు గోడల మధ్య, అటు తర్వాత ఉద్యమాల మధ్య ఆయన జీవితం అవిశ్రాంతంగా సాగిపోవడం వల్ల ఈ వ్యాసం అసంపూర్ణంగానే మిగిలిపోయింది. తరువాత ఇలాంటి పరిశోధనలో లోహియాకు ఆసక్తి తగ్గిపోయింది.

### లోహియా సిద్ధాంత ప్రతిపాదన

పైనుదహరించిన వ్యాసంలోనే లోహియా తనదైన సృజనాత్మకమైన ప్రతిపాదన చేశాడు. ఇది మార్క్స్-లెనిన్ సిద్ధాంతానికి భిన్నమైంది.

లోహియా దృష్టిలో పెట్టుబడిదారీ వాదం సామ్రాజ్యవాదం పుట్టుక, అభివృద్ధి కవల పిల్లల్లాంటివి. ఈ రెండూ ఒకే కాలంలో జన్మించిన పరస్పరాభివృద్ధికి సహాయపడ్డాయి. అంతేకాని, ఈ రెండు పెట్టుబడిదారీ విధానంలోని విభిన్న దశలను సూచించవు. దీనినే ఇంగ్లిష్‌లో లోహియా 'ది ట్విన్ ఆరిజిన్ ఆఫ్ కాపిటలిజం అండ్ ఇంపీరియలిజం' అని నామకరణం చేశాడు.

పెట్టుబడిదారీ వ్యవస్థ పెరగడానికి రెండు రకాల కారణాలున్నాయి. 1) ఆ వ్యవస్థ అంతర్గత గతిశీలత; 2) బాహిర గతిశీలత. అంతర్గత గతిశీలతలో ద్రవ్యానికీ, శ్రమకూ వైరుధ్యం ఉంది. కార్మికుడికిచ్చే వేతనం, అతను సామాజికంగా ఖర్చు పెట్టే ఉత్పాదన సమయం చాలా తక్కువ. ఎందుకంటే అతను ఉత్పాదన చేసే సరుకుల విలువ కార్మిక వేతనం కంటే ఎన్నో రెట్లు అధికంగా ఉంటుంది. దానిలోని కొంత భాగమే (కొద్ది విలువ మాత్రమే) కార్మికులకు వేతనంగా ఇవ్వబడుతుంది. మిగిలిన సరుకుల అదనపు విలువను యజమాని స్వంతం చేసుకుంటాడు.

మెరుగైన ఉత్పత్తి సాధనాల ద్వారానే భూస్వామ్య విధానాన్ని తోసిపుచ్చి పెట్టుబడిదారీ విధానంపైకి వచ్చింది. యాంత్రికీకరణ వల్ల యాంత్రిక శ్రమ వల్ల సరుకుల ఉత్పత్తి పెరిగి, లాభార్జన ఎక్కువవుతుంది. దీనినే లా ఆఫ్ ఎక్యుములేషన్ అన్నాడు మార్క్స్. యాంత్రికీకరణ ఫలితాలు కార్మికులకు నకారాత్మకంగా ఉంటాయి. వారు ఉద్యోగాలు పోగొట్టుకోవడమో లేదా తక్కువ వేతనానికి పని చేయడమో జరుగుతుంది. దీనివల్ల కార్మికులు అతిశయ దారిద్ర్యానికి, బాధకు గురి అవుతారు. దీనినే మార్క్స్ - 'ది లా ఆఫ్ పాపరైజేషన్ అండ్ ఇమ్మైసరైజేషన్' గా పేర్కొన్నాడు. దారిద్ర్యాన్ని, బాధను భరించలేక, కార్మికులందరు సంఘటితమై ఒక చైతన్యవర్గంగా ఎదిగి హింసాత్మక విప్లవం ద్వారా పెట్టుబడిదారీ రాజ్యాన్ని కూలదోసి కార్మిక నియంతృత్వాన్ని స్థాపిస్తారు. పెట్టుబడిదారీ గుత్తాధిపత్యానికి బదులుగా సోషలిస్టు సమాజ స్థాపన జరుగుతుంది. మార్క్స్ సిద్ధాంతంలో తాను ప్రతిపాదించిన న్యాయాలన్నీ పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్గత నిర్మితి నుండి పుట్టినవే.

అయితే ద్రవ్య వ్యవస్థను అర్థం చేసుకోవడంలో మనం బాహిర కారణాలను, బాహిర గతిశీలతను కూడా పరిశీలించాలని లోహియా వక్కాణించాడు.

సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధికీ - అలాగే పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాద విస్తరణకూ తోడ్పడ్డాయనేది ఆయన సృజనాత్మక ప్రతిపాదన. ఈ ప్రతిపాదన వెనకాల లోహియాకున్న విస్తృత అధ్యయనము, పదునైన ఆలోచనాశక్తి, విశాల దృక్పథం సహకరించాయి. తన వాదనను సమర్థించుకోవడానికి బ్రిటిష్ ఆర్థిక చరిత్ర నుండి, ప్రపంచ ఆర్థిక చరిత్ర నుండి అనేక ఉదాహరణలను, ఆధారాలను మనముందుంచాడు.

18వ శతాబ్దం ఆరంభం వరకు నూలు, బట్టల ఎగుమతులలో భారత దేశం అగ్రస్థానంలో ఉండేది. కాని ఈస్ట్ ఇండియా కంపెనీ (ఇకపై కంపెనీ అని వాడుదాం) రావడంతో భారతీయ అంతరంగిక వ్యాపారమంతా వారి గుప్పిట్లోకి వెళ్లిపోయింది. కంపెనీవారు దూది, జనుము, క్యాలికో బట్టలను బ్రిటన్‌కు ఎగుమతి చేసేవారు. బ్రిటన్ వాటిని తిరిగి అమెరికాకు ఎగుమతి చేసేది. ఈ ఎగుమతుల వల్ల 1700 సంవత్సరంలో 1,000 పౌండ్ల ఆదాయాన్ని సంపాదించిన బ్రిటన్, 1772లో 34,000 పౌండ్ల ఆదాయాన్ని ఆర్జించింది. లాభాలు విపరీతంగా పెరిగిపోయినాయి.

పారిశ్రామిక విప్లవం 1748లో బ్రిటన్‌లో ఆరంభమైంది. మ్యాంచెస్టర్ లో యంత్ర సామాగ్రితో ఉత్పత్తి చేసే మొట్టమొదటి బట్టల కర్మాగారాన్ని స్థాపించారు. తరువాత లాంకషైర్ మిల్లులు వచ్చాయి. నేతబట్టల అధిక ఉత్పత్తి వల్ల, విపరీతమైన లాభాలు సంపాదించవచ్చునని బ్రిటిష్ వారు గ్రహించారు. ఈ ఉద్దేశ్యంతోనే కంపెనీ వారు బ్రిటిష్ ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి 1788 నుండి భారతీయ నూలు బట్టలను దిగుమతి చేసుకోకుండా చేశారు. బ్రిటిష్ పార్లమెంట్ దీనికి అనుకూలంగా ఒక చట్టాన్ని రూపొందించింది. అంతేకాదు, మాంచెస్టర్ మిల్లుల బట్టలను భారత్‌కు ఎగుమతి చేశారు. కంపెనీ వ్యాపారం పెంచడానికి కంపెనీలో బ్రిటిష్ వారి పెట్టుబడులను ప్రోత్సహించింది.

సామ్రాజ్యవాద ప్రభుత్వం ఆ పెట్టుబడులపై కచ్చితమైన వడ్డీ వచ్చే గ్యారంటీలను ప్రకటించింది. భారతీయ చేనేత కార్మికులను, వారి బట్టల ఉత్పత్తిని నిరోధించడానికి 1520 అంతరంగిక సుంకాన్ని విధించింది. దీనితో విదేశీ బట్టలు చవుకై, దేశీయ వస్త్రాలు ప్రియమైనాయి. క్రమంగా దేశీయ చేనేత కార్మికులు, మగ్గాలను మూసుకోవలసి వచ్చింది. ఎదిరించిన కార్మికులను రాజ్యాధికారం (పోలీసులు, సైన్యం) ఉపయోగించి, బ్రిటిష్ వారు వారిని అణచివేశారు. 1835లో బ్రిటిష్ కాటన్ వాడకం భారతదేశంలో 82 మిలియన్ల గజీలకు పెరిగింది.

## రైల్వేలు - బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానం

బ్రిటన్‌లో తయారైన రైలు ఇంజన్లను భారతదేశంలోని ఆంగ్ల ప్రభుత్వం విరివిగా దిగుమతి చేసుకొంది. దీనివల్ల బ్రిటిష్ ద్రవ్య వ్యవస్థ బలీయమైంది - లాభాలు బాగా పెరిగినాయి. రైలు నిర్మాణం భారతీయులకు గొప్పగా ఉపయోగపడలేదు. ప్రయాణానికి తప్ప. దూది జనపనార, ఇండిగో ఎగుమతులకు బ్రిటిష్ రైళ్లు బాగా ఉపయోగపడ్డాయి.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం తన పెట్టుబడిదారీ అభిరుచుల కనుగుణంగా భారతంలోని వ్యవసాయంలో మార్పులను ప్రవేశపెట్టింది. ఆహార పంటల బదులు వ్యాపార పంటలను పండించడానికి రైతులను ప్రోత్సహించారు. అస్సాంలోని భూమిలేని కూలీలకు పేదరికపు వేతనాలను ఇచ్చారు. బెంగాల్, యు.పి., బీహార్‌లో కూడా అంటే కలోనియల్ - ఇంపీరియల్ వేతనాలనిచ్చి, బ్రిటిష్ సామ్రాజ్యం తన లాభాలు పెంచుకుని, పెట్టుబడిదారీ వ్యవస్థను విస్తృతం చేసుకుంది. బ్రిటిష్ కార్మికుల వేతనాలు పెరిగి వాళ్లు సాపేక్ష్యంగా ధనవంతులైన కార్మికులైనారు. వారి జీవనశైలిలో మార్పురావడం వల్ల విప్లవానికి దూరమైనారు.

## అంతర్జాతీయ వ్యాపారం

బ్రిటిష్ ఇండియా తన ముడి సరుకులను వ్యాపార నిమిత్తం ఐరోపా దేశాలకు పంపుతూండేది. దానివల్ల వచ్చే లాభాలను బ్రిటిష్ సామ్రాజ్యం యూరప్, అమెరికా దేశాలలో పెట్టుబడిగా పెట్టేది. దానివల్ల జనించే లాభాల ఫలితంగా బ్రిటన్ ఆదాయ నిధులు సమృద్ధిగా పెరిగాయి. ఈ సందర్భంలో బ్రిటిష్ ద్రవ్య వ్యవస్థ, పారిశ్రామికీకరణం వల్ల కాకుండా, వ్యాపారం వల్ల బాగా అభివృద్ధి చెందిందని హాబ్స్‌బామ్ అనడం గమనార్హం.

జర్మనీ, ఫ్రాన్స్‌ల అభివృద్ధిని పరిశీలిస్తూ లోహియా ఇలా అన్నాడు: 'ఐరోపా దేశాలలోని పెట్టుబడిదారీ అభివృద్ధి అంతర్గతంగా పెరిగిన ధన సంచయం కంటే అధికంగా విదేశాలతో నిరంతరం సాగించిన వ్యాపారం వల్లనే సాధ్యమయింది. వ్యాపారం వల్ల వచ్చిన లాభాలను పెట్టుబడులుగా మార్చి, పెట్టుబడిదారీ విధానాన్ని వేగంగా ముందుకు నడిపించగలిగింది.'

పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి, సామ్రాజ్యవాదం తాలూకు ఆర్థిక, రాజకీయ పరివ్యాప్తి ఒకేసారి జరిగినవి. ఈ రెండింటి మధ్య పరస్పర సంబంధమూ, పారస్పరిక ప్రభావమూ ఉన్నాయి. అందుకే ఈ రెండు దృగ్విషయాలు విశ్లేషణాత్మకంగా వేర్వేరుగా కనిపించినా అవి ఒకే ప్రక్రియ రెండు పార్శ్వాలు.

ద్రవ్యవాదం అంతర్గత కారణాలతో పాటు సామ్రాజ్యవాద సంబంధాల నుండి ఆవిర్భవించింది. అలాగే సామ్రాజ్యవాదం రాజ్యాల జాతీయవాదంతోపాటు ఆ రాజ్యాల మధ్య పెరిగిన పెట్టుబడిదారీ సంబంధాల నుండే జన్మించింది. ఇదే లోహియా 'ట్విన్ ఆరిజిన్స్ ఆఫ్ కాపిటలిజం అండ్ ఇంపీరియలిజం' సిద్ధాంతం.

దీనిలో కనిపించే దృక్పథం, ఆలోచన ఆధునికమేకాదు, అది అసాధారణమూ, విప్లవాత్మకమూనూ.

'మార్క్స్ తరువాయి అర్థశాస్త్రం" సిద్ధాంత వ్యాసంలోనే లోహియా మరికొన్ని విశిష్ఠ ప్రతిపాదనలు చేశాడు:

1) ద్రవ్య సమాజం పుట్టుక, అభివృద్ధిని జాతీయ చరిత్ర పరిధిలోనే చూడకూడదు - దానిని అంతర్జాతీయ ఆర్థిక చరిత్రలోని భాగంగా చూడాలి. అప్పుడే మనకు పెట్టుబడిదారీ వ్యవస్థ గతిశీలత సంపూర్ణంగా అవగాహన అవుతుంది. ఈ విషయాన్ని మార్క్స్ ఎందుకో పట్టించుకోలేదు. ఈ మధ్య మార్క్సిస్ట్ మేధావుల ఆలోచనా విధానంలో మార్పులు వచ్చినాయి. లోహియా దూరదృష్టితో ప్రతిపాదించిన ప్రపంచ ద్రవ్య విధానం, ప్రపంచ ఆర్థిక విశ్లేషణ బలాన్ని పుంజుకున్నాయి. నవ్య - మార్క్సిస్ట్ మేధావులు ఆంద్రే గుండర్ ఫ్రాంక్, ఇమాన్యూల్ వాలర్‌స్టిన్, సమీర్ అమీన్ మొదలగువారు లోహియా ఆశించిన పంథాలోనే ప్రపంచ ద్రవ్య విధానాన్ని విశ్లేషించారు. అయితే వివరాలలోకి వెళ్లినపుడు మనకు తేడాలు కనిపిస్తాయి.

2) అదనపు విలువను పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడి - శ్రమకున్న అంతర్గత వైరుధ్యాన్ని సూచించే కారకంగా సూచిస్తే సరిపోతు. దాన్ని ప్రపంచ ద్రవ్య సమాజం తాలూకు శ్రమ విభజనగా చూడాలి. అప్పుడే దాని సరియైన విలువను మనం నిర్ధారించగలుగుతాం. అది చేయాలంటే కార్మికుడి నిజవేతనాలకు, ప్రపంచ ఉత్పత్తి పై వెచ్చించిన సామాజిక విలువల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గణించాలి. అప్పుడే మనకు అదనపు విలువ స్వరూపం కచ్చితంగా తెలుస్తుంది. ఇది లోహియా మౌలిక ఆలోచనా శక్తికి తార్కాణం. ఎందుకంటే ఇలాంటి ప్రతిపాదనను వేరే ఆర్థిక శాస్త్రజ్ఞులు, చరిత్రకారులు చేయలేదు.

3) పెట్టుబడిదారీ వ్యవస్థ, సామ్రాజ్యవాదం కలిసి వలస దేశాలను, అక్కడి ముడిసరుకులను, ఉత్పత్తులను, కార్మిక శ్రమను తీవ్రంగా, అమానుషంగా దోచుకున్నాయి. అందువల్లే వలస దేశాలు, బడుగుదేశాలుగా, అతి దరిద్ర దేశాలుగా నిలిచిపోయినాయి. బ్రిటిష్ వలసగా ఉన్న ఒక్క భారతదేశానికే ఇది పరిమితం కాదు. ప్రపంచంలోని యూరోపియన్, లాటిన్ అమెరికన్, ఆఫ్రికన్ వలస దేశాలకు కూడా ఇది సంపూర్ణంగా వర్తిస్తుంది. అందుకే ప్రపంచంలోని 2/3 దేశాలు పేద దేశాలుగా ఉండిపోయినాయి.

ద్రవ్యవాదం, సామ్రాజ్యవాదం వ్యాప్తివల్ల ప్రపంచమంతా రాజకీయ, ఆర్థిక, సామాజిక అసమానతలు దారుణంగా పెరిగి పోయినాయి. ఇవి తగ్గాలంటే మనం రాజకీయ స్వాతంత్ర్య పోరాటాలే కాదు, ఆర్థిక స్వాతంత్ర్య పోరాటాలు కూడా పటిమతో నిర్వహించాలి. ఆర్థిక సామ్రాజ్యవాదాన్ని సమూలంగా దాడిచేసి, దానిని నిర్మూలనకు పోరాటం చేసినప్పుడే, మనం ప్రపంచ ఆర్థిక సమానతకు దగ్గరవుతాం. అప్పుడే బడుగు దేశాలలో సమానతా విప్లవకాంతులు, సోషలిస్టు జీవిత పరిమళాలు సకల దిశలలో పరివ్యాప్తమవుతాయి అని లోహియా కాంచిన స్వప్నం. వీ

*భారత రాజకీయ వ్యవస్థలో సామాజిక భావనను బలంగా ప్రవేశపెట్టిన లోహియా పాత్రను విశ్లేషిస్తున్నారు*

**బి.ఎస్. రాములు**

# బి.సి.ల సాధికారికత రామ్‌మనోహర్ లోహియా

**డా.** రామ్ మనోహర్ లోహియా శతజయంతి సంవత్సరం ఇది. 1910 మార్చి 23న జన్మించిన లోహియా భారత రాజకీయాల్లో నిర్వహించిన పాత్ర ప్రత్యేకమైనది, విశిష్టమైనది. డా. రామ్ మనోహర్ లోహియా సమకాలికులను ప్రభావితం చేశారు. తనకన్నా రాజకీయాల్లో సీనియర్లయిన గాంధీ, నెహ్రూ వంటి వారిని కూడా ప్రభావితం చేయడం లోహియా విశిష్టత.

రామ్ మనోహర్ లోహియాలో ఒక నిశితమైన మేధావి వున్నాడు. ఆయనలో వైరుధ్యాలు వున్నాయని కొందరు అంటుంటారు. గాంధీని, అంబేద్కర్‌ని సమానంగా గౌరవించడం లోహియాలో గల వైరుధ్యం అంటారు. రాముణ్ణి, కృష్ణుణ్ణి భారతీయ జాతీయ నాయకులు అని చెప్పడంలో వైరుధ్యముందంటారు. చరిత్ర ఇతిహాస చక్రాన్ని ప్రతిపాదించడంలో కూడా ఈ వైరుధ్యం చూడవచ్చునంటారు. భారతదేశంలో హిందీని ఇతర భాషా ప్రాంతాలవారు కూడా ఖచ్చితంగా నేర్చుకోవాలని, ఆచరించాలని చెప్పడంలో తీవ్రమైన వైరుధ్యముందంటారు. పార్టీ నిర్మాణంలో కూడా అనేక వైరుధ్యాలు ఉన్నాయంటారు. బి.సి.లకు పార్టీల్లో అరవై శాతం రిజర్వేషన్లు కల్పించాలని ఆచరించి చూపాడు. కాంగ్రెస్‌ను తీవ్రంగా విమర్శిస్తూనే, గాంధీ ఆలోచనా విధానాన్ని ఆచరిస్తాడంటారు. ఇలా, ప్రధానమైన వైరుధ్యాలను లోహియాను అంగీకరించడానికి, వ్యతిరేకించడానికి చూపిస్తూ వుంటారు.

జాతీయోద్యమకాలంలో లోహియా, లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్, డా. బి.ఆర్.అంబేద్కర్, పెరియార్ రామస్వామి నాయకర్, గిరిజన పోరాటాలు, కమ్యూనిస్టు ఉద్యమాలు, కమ్యూనిస్టు పార్టీ మొదలైనవి కాంగ్రెస్‌కు సమాంతరంగా, అప్పుడప్పుడు వ్యతిరేకంగా కొనసాగాయని వర్గీకరిస్తుంటారు. కాంగ్రెస్ ఒక ముద్దగా పెద్దగా కనపడుతుంది. కానీ, కాంగ్రెస్‌కు వెలుపల దాంతో పోటీ పడి సమాంతరంగా రైలు పట్టాల్లాగా సాగిన జాతీయోద్యమ చరిత్ర ఎంతో వుంది.

1920 నుండి అంబేద్కర్ దళిత వాద సిద్ధాంతాలను ముందుకు తీసుకుని వచ్చాడు. భారతదేశంలో స్వాతంత్ర్యం ఎవరికి? ఇందులో అంటరానివాళ్లకు అందేదేమిటి? అంటరానివాళ్లకు స్వాతంత్ర్యం ఇవ్వకపోతే ఆ స్వాతంత్ర్యం అంటరానివాళ్లని మరింత అణచివేయడానికే పనికొస్తుంది అని అన్నాడు. 1932లో పూనా ఒప్పందంతో దళితులకు రిజర్వేషన్లు సాధించారు.

ఈ చారిత్రక నేపథ్యంలో రామ్ మనోహర్ లోహియా జన్మించాడు. లోహియా వయస్సు పెరుగుతున్నకొద్దీ చైతన్యం పెరుగుతూ వచ్చింది. సోషలిస్టుగా ఎదిగాడు. సోషలిస్టుగానే గుర్తింపు పొందాడు. సోషలిస్టుగానే అనేక విషయాలపై తన అవగాహనను ప్రసంగాల ద్వారా స్పష్టం చేశాడు. లోహియా సోషలిజం ప్రత్యేకమైనది. కమ్యూనిస్టులు, నక్సలైట్లు చెప్పే సోషలిజానికి, లోహియా చెప్పే సోషలిజానికి తేడా వుంది. సోషలిజాన్ని సాధించే మార్గంలో, దృక్పథంలో, ఆచరణలో కూడా తేడా వుంది. ఈ తేడాయే లోహియా సోషలిజాన్ని ప్రత్యేకంగా నిలుపుతుంది.

'లోహియా సోషలిజం' ఫ్రెంచ్ సోషలిస్టుల నుండి స్ఫూర్తి పొందింది. కమ్యూనిస్టు, మార్క్సిస్టు క్యాంపుల సోషలిజానికి వెలుపల గల ప్రపంచంలో సోషలిజానికి సంబంధించిన చర్చలు, ఉద్యమాలు ఎన్నో కొనసాగాయి. జాతీయోద్యమంలో కాంగ్రెస్ చరిత్ర వరుస క్రమంలో రికార్డయి మిగతా ఉద్యమాల చరిత్ర శకలాలుగా మార్చబడ్డట్టుగా, ప్రపంచ సోషలిస్టు ఉద్యమాల్లో మార్క్సిస్టుల ఉద్యమాలు వరుస క్రమంలో రికార్డయి మిగతా సోషలిస్టుల చరిత్ర శకలాలుగానైనా పెద్దగా రికార్డు కాలేదు. రికార్డు అయింది, కానీ, తరానికి తరానికి అందడం లేదు. అలాంటి వాటిలో భారతదేశంలోని లోహియా, జయప్రకాశ్ నారాయణ్ వంటి వారి సోషలిస్టు ఉద్యమాల చరిత్ర కూడా ఒకటి.

నిజానికి, లోహియా సోషలిస్టు ఉద్యమానికి ఈ దుస్థితి పట్టాల్సిన అవసరంలేదు. అది నిర్వహించిన పాత్ర దేశంలో ప్రముఖమైనది. రెండో స్వాతంత్ర్య పోరాటం సాగడానికి 1975లో ఇందిరాగాంధీ పెట్టిన ఎమర్జెన్సీకి ముందు, తరువాత కూడా కృషి చేసిన చరిత్ర సోషలిస్టులది. ప్రజాస్వామిక విలువల కోసం, ప్రతిపక్ష పాత్ర నిర్వహణ కోసం సోషలిస్టులు చేసిన కృషి తక్కువేమీ కాదు. భారతదేశ చరిత్రలో లోహియా సోషలిస్టుల స్థానం ప్రత్యేకమైనది. దేశ చరిత్రను మలుపు తిప్పారు. అవన్నీ చదువుకున్నవారికి తెలుసు. సామాన్య పౌరులకు తెలియడంలేదు. రామ్ మనోహర్ లోహియా సిద్ధాంతాలు, ఆచరణ లేకుండా లాలూ ప్రసాద్ యాదవ్, ములాయం సింగ్ యాదవ్, శరద్ యాదవ్, జార్జి ఫెర్నాండెజ్ వంటి వారిని ఊహించలేం. బహుజన సమాజ్ పార్టీ గానీ, అంబేద్కరైట్లు గానీ, రామ్ మనోహర్ లోహియాను స్ఫూర్తిదాతగా స్వీకరించలేదు. సామాజిక న్యాయం కోసం గుళ్లను నిర్మించిన నారాయణ గురును, భక్తిని ప్రచారం చేసిన గురు రవిదాస్, కబీర్ వంటి వారిని కూడా బీఎస్పీ స్ఫూర్తిదాతలుగా స్వీకరించినప్పటికీ లోహియాను స్వీకరించలేదు.

గాంధీ వలె లోహియాకు, అంబేద్కర్‌కు మధ్య వ్యతిరేక లక్ష్యాలతో

సిద్ధాంత సంఘర్షణ జరగలేదు. అంబేద్కర్‌ను లోహియా అపారంగా గౌరవించాడు. అయితే, గాంధీని కూడా బాగా గౌరవించాడు. అదే సమయంలో, హిందూ మతాన్ని, రాముడు, కృష్ణులను లోహియా స్వీకరించాడు. ఇది ఒకటే వైరుధ్యమా? ఇంకా ఏమైనా వున్నాయా? లోహియా బీసీల కోసం, వారి రిజర్వేషన్ల కోసం ఎంతగానో తపన పడ్డాడు.

లోహియా అగ్ర కులాల్లో పుట్టడమే కారణమా? అలాగైతే, బుద్ధుడు కూడా గణ తెగల నాయకుడి కొడుకుగానే పుట్టాడు. అశోకుడు స్వయంగా చక్రవర్తి కూడా. వారిని స్వీకరిస్తున్నాము. లోహియాలో వున్న మంచిని బేరీజు వేయడం, లోపాలను తులనాత్మకంగా పరిశీలించడం శతజయంతి సందర్భంగా అవసరం. తద్వారా, మంచిని ముందుకు తీసుకుని పోతూ లోహియా స్ఫూర్తిని కూడా భవిష్యత్ తరాలు పొందడానికి ఉపయోగపడుతుంది.

లోహియా సోషలిస్టులు లేకుండా భారత పార్లమెంటు రాజకీయాలను, అందులోని పరిణామాలను చెప్పడం సాధ్యమా? లోహియా లేకుండా భారతదేశంలో బీసీలకు రాజ్యాధికారం, రిజర్వేషన్లు, వాటి పరిణామాలు సాధ్యమయ్యాయా? బీసీలకు లోహియా సోషలిస్టులు ఏమీ చేయలేదా? వీటిని బీసీలు తెలుసుకోవడం అవసరం.

అలా చూసినప్పుడు, భారతదేశానికి లోహియా సోషలిస్టుల కాంట్రిబ్యూషన్ ఎంతో వుంది. బీసీలకు వారు చేసిన మేలు ఎంతో వుంది. భారత రాజకీయాల్లో ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాల్లో 1967 నాటికే లోహియా సోషలిస్టులు అధికారంలోకి వచ్చారు. ముఖ్యమంత్రులయ్యారు. ఉత్తరప్రదేశ్‌లో రామ్ నరేష్ యాదవ్, బీహార్‌లో కర్పూరి ఠాకూర్ ముఖ్యమంత్రులయ్యారు. ఇద్దరూ బీసీలే. ఇది కాంగ్రెస్ ప్రభుత్వాల్లో సాధ్యమా? ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో లోహియా సోషలిస్టుల కృషి, పరిణామాలు లేకుండా బహుజన సమాజ్ పార్టీ ఆవిర్భావం, ఎదుగుదల, విజయం సాధ్యమా? సోషలిస్టులు తెచ్చిన పరిణామాల్లో భాగంగానే బహుజన సమాజ్ పార్టీ ఎదిగింది. విజయం సాధించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1962 నాటికే బీసీలు అధికారంలోకి వస్తారని 1956లో రామ్ మనోహర్ లోహియా అనేక ప్రసంగాల్లో చెప్పారు. ఎందుకు అలా జరగలేదు? ఉత్తరప్రదేశ్, బీహార్ లలో 1967 నాటికి లోహియా అనుకున్నట్టుగానే అధికారంలోకి వచ్చినప్పటికీ అది ఆంధ్రప్రదేశ్‌లో ఎందుకు సాధ్యం కాలేదు? ఈ రెండు పరిణామాల మధ్య తేడా ఏమిటి? ఈ విషయం అధ్యయనం చేయాల్సిన అవసరం వుంది.

రామ్ మనోహర్ లోహియా, గాంధీలో ఏం చూసి ప్రేమించాడు, గౌరవించాడు? పరిశీలించాల్సిన అవసరం వుంది. కేవలం కులం ఒక్కటే కారణం కాదు. లోహియా, గాంధీ చేతి వృత్తులను గురించి, ఆ కులాల, గ్రామీణుల అభివృద్ధి గురించి తీవ్రంగా పట్టించుకున్నారు. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అంటే, మానవ వనరులైన ప్రజల శక్తి సామర్థ్యాల అభివృద్ధి, నైపుణ్యాల అభివృద్ధి అని, వారికి ఉపాధి కల్పన, జీవన భద్రత ప్రధానమని, దీనికి లోబడే దీనికి అనువైన పారిశ్రామికీకరణ జరగాలని కోరారు. మావో, గాంధీ, లోహియాల మధ్య ఈ ఏకత్వం వుంది.

శాంతియుత పరివర్తనలో, బహుళ పార్టీ వ్యవస్థలో సాధ్యమైన మేరకు సోషలిజాన్ని సాధించడమే ఫ్రెంచ్ సోషలిస్టుల, భారతీయ సోషలిస్టుల లక్ష్యం. పేద ప్రజలకు సబ్సిడీలతో కూడు, గుడ్డ, నీడ ఏర్పాటు చేయాలని కోరారు. సంక్షేమ పథకాలకు ప్రాధాన్యత ఇవ్వాలన్నారు. పారిశ్రామికవేత్తలకు పారిశ్రామిక అభివృద్ధి పేరిట కాంగ్రెస్ పార్టీ లక్షల కోట్ల రూపాయల పన్నుల మినహాయింపులను, ఇతరత్రా భూసేకరణలో సహకరించింది. ప్రజలకు ఇవ్వడానికి అభ్యంతరమేమిటి? ప్రజలకు ఇవ్వని ప్రభుత్వం దేనికి? ఈ దృష్టితో రామ్‌మనోహర్ లోహియా అనేక ఆలోచనలు చేశాడు. వాటిని జనతా పార్టీ అనుసరించే ప్రయత్నం చేసింది. ముఖ్యంగా, 1977లో జార్జి ఫెర్నాండెజ్, శరద్ యాదవ్, తదితరులు మొరార్జీ దేశాయ్ ప్రధానమంత్రిగా జనతా పార్టీ, లోక్ నాయక్ జయప్రకాశ్ నారాయణ్ నేతృత్వంలో ఒక్కటై అధికారంలోకి వచ్చినప్పుడు రూపాయికే స్నానపు సబ్బు ఇవ్వాలని ఉత్తర్వులిచ్చారు. అన్ని కంపెనీలు తమ ఉత్పత్తులను మార్కెట్లోకి తెచ్చాయి కూడా. అలాగే జనతా సబ్బులతో పాటు జనతా చీరలు, జనతా ధోతులు తక్కువ ధరకు సబ్సిడీపై గోధుమలు, బియ్యం, తదితర సరుకులు ఇచ్చారు.

ఏమైనప్పటికీ, హింద్ మజ్దూర్ సంఘ్, తదితర పేర్లతో సోషలిస్టుల కార్మిక సంఘాలు కార్మిక రంగంలో గొప్ప పాత్ర నిర్వహించాయి. 1974లో జార్జి ఫెర్నాండెజ్ నాయకత్వంలో దేశవ్యాప్తంగా రైల్వ సమ్మె జరిగింది. అది ఇందిరాగాంధీ ప్రభుత్వాన్ని కదిలించింది. మరోవైపు, అదే సమయంలో లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్ సర్వోదయ ఉద్యమం నుండి తిరిగి సామాజిక, రాజకీయ రంగంలోకి వచ్చారు. దేశవ్యాప్తంగా అవినీతికి వ్యతిరేకంగా ఉద్యమించారు. ఉత్తరప్రదేశ్, బీహార్ లలో లక్షలాది విద్యార్థులు, యువకులు కదిలారు.

1962లో లోహియా నెహ్రూపై పోటీ చేసి ఓడిపోయాడు. 1963 ఉప ఎన్నికల్లో లోకసభకు ఎన్నికయ్యాడు. లోహియా అనుచరుడైన రాజ్‌నారాయణ్ ఇందిరాగాంధీపై పోటీ చేశాడు. ఇందిరాగాంధీ ఎలాగో గెలిచింది. ఎన్నికల్లో అక్రమాలు చేసి గెలిచిందని రాజ్‌నారాయణ్ కోర్టులో కేసు వేశాడు. 1975లో సుప్రీం కోర్టు నిజమేనని, అక్రమాలు జరిగాయని నిర్ధారించి ఇందిరాగాంధీ లోక్‌సభ ఎన్నిక చెల్లనేరదని లోక్‌సభ సభ్యత్వాన్ని రద్దు చేసింది. దాంతో, ఇందిరాగాంధీ ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేయాలి. కాంగ్రెస్‌లోని మరొకరికి అధికారం అప్పగించాలి. తన పదవి కోసం, తన ఒక్క ప్రాణం కోసం ఇందిరాగాంధీ లోకం ఏమైనా కానీ అని అనుకున్నది. ఎమర్జెన్సీ ప్రకటించింది. ప్రతిపక్ష నాయకులను, లక్షలాది ప్రజలను జైళ్లల్లో పెట్టారు. పత్రికలపై, రేడియోలపై సెన్సార్ విధించారు. అలా, తన పదవి కోసం ఇందిరాగాంధీ ప్రపంచ చరిత్రలో ఒక చీకటి అధ్యాయాన్ని సృష్టించింది.

జయప్రకాశ్ నారాయణ్, రాజ్‌నారాయణ్, జార్జ్ ఫెర్నాండెజ్, శరద్ యాదవ్ వంటి సోషలిస్టులు అవినీతికి వ్యతిరేకంగా, ప్రజలకు, సామాజిక న్యాయం జరగాలని శాంతియుతంగా చేపట్టిన ఉద్యమాలు దేశంలో గొప్ప చైతన్యాన్ని తీసుకువచ్చాయి. ఆ క్రమం నుండే, ములాయం సింగ్, లాలూ ప్రసాద్ వంటి వాళ్లు ఎదిగివచ్చారు. ఎమర్జెన్సీ తర్వాత జనతా పార్టీ అధికారంలోకి వచ్చింది. అది రెండో స్వాతంత్ర్య పోరాటం అన్నారు. స్వాతంత్ర్యం విలువ తెలిసింది. రాజ్యాంగంలో ఇంత క్రూరమైన అణచివేతకు అవకాశాలున్నాయా అని సమాజం విస్తుపోయింది. మళ్లీ

అలాంటి ఎమర్జెన్సీ పెట్టకుండా రాజ్యాంగ సవరణ చేశారు. అలా, జనతా పార్టీ అందులోని సోషలిస్టులు చరిత్రాత్మకమైన పాత్ర నిర్వహించారు.

లోహియా ప్రతిపాదించిన 'ఇతిహాస చక్రం' అనే చారిత్రక దృక్పథం ఆయన రచనల్లో ఒకటి. ఇది వివాదాస్పదమైంది. సమాజం ముందుకు సాగుతూనే వుంటుందని ప్రజాస్వామిక వాదులు, సోషలిస్టులు, మార్క్సిస్టులు భావిస్తుంటారు. లోహియా దీనికి కాస్త భిన్నంగా ఆ యా దేశాల జాతుల చరిత్రను చర్చిస్తూ మళ్లీ ఒకనాటికి ఇండియా, చైనా వంటి ప్రాచీన జాతులు తిరిగి ప్రపంచానికి నాయకత్వం వహిస్తాయని ఇప్పుడు నాయకత్వం వహిస్తున్న యూరప్, అమెరికాల ఆధిపత్యం పోతుందని చెప్పాడు. ఇలాంటి కోణంలో ఇతిహాస చక్రాన్ని ప్రతిపాదించాడు.

తెలుగు అకాడమీ రామ్‌మనోహర్ లోహియా రచనల అనువాదాలను కొన్నిటిని ప్రచురించింది. రామ్ మనోహర్ లోహియా భావాలను తెలుగు ప్రజలకు చేరవేయడంలో అనువాదకుడిగా తెలంగాణ తొలి తరం కథకుడు అయిన జి.సురమౌళి పాత్ర మరువలేనిది. బద్రి విశాల్ పిత్తి, రావెల సోమయ్య, కె.యన్.రామదాస్ వంటి ఎందరో లోహియా భావాలను, పార్టీని ప్రజల్లోకి తీసుకువెళ్లడంలో కృషి చేశారు. తెలుగుదేశం పార్టీ ప్రజాకర్షక రెండు రూపాయలకు కిలో బియ్యం వంటి పథకాలను ప్రవేశపెట్టడంలో టీడీపీలో చేరిన సోషలిస్టుల పాత్ర ఉందని అంటారు. అలా, టీడీపీలో లోహియా సోషలిస్టు భావాలు అనేక రూపాలు తీసుకుని కొనసాగాయి.

లోహియాలో ఉత్తరాదికి చెందినవాడుగా కొన్ని అవగాహన లోపాలు చోటుచేసుకున్నాయి. హిందీని దక్షిణాది రాష్ట్రాల మీద బలవంతంగా రుద్దే ప్రయత్నం చేశారు. బెంగాల్ ప్రజలు కూడా తమిళనాడు వలెనే హిందీ రుద్దడాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ప్రతి ఒక్కరు భారతదేశంలో పాఠ్యాంశాల్లో మూడు భాషలు నేర్చుకోవాలని ప్రతిపాదించారు. దక్షిణాది రాష్ట్రాల్లో ఇది కొనసాగుతున్నది. ఉత్తరాది రాష్ట్రాల్లో తెలుగునో, తమిళాన్నో, మరొకటో స్వీకరించడం, నేర్చుకోవడం చాలా తక్కువ. లోహియా హిందీ దురభిమానం వల్ల తమిళనాడులో హిందీ వ్యతిరేక ఉద్యమాలు పెద్ద యెత్తున సాగాయి.

భాషా సమస్య విషయంలో లోహియా పొరపాటు చేశాడనిపిస్తుంది. ఇంగ్లిష్ ప్రాధాన్యతను గుర్తించలేదు. హిందీకి బదులుగా లోహియా ఇంగ్లిష్‌ని అవసరమని చెప్పి ఉంటే ఆయన భారతదేశానికి మరింత ఆరాధ్యుడై ఉండేవాడు. నేటి సాఫ్ట్‌వేర్ విప్లవానికి లోహియా ఇంగ్లిష్ ప్రతిపాదన ఎంతో ఉపయోగపడిందని చరిత్ర గుర్తు చేసుకుని ఉండేది. రాజ్యాంగంలోని షెడ్యూల్‌లో చేర్చిన ప్రతి భాష కూడా భారతీయ జాతీయ భాషే. రాముడు, కృష్ణుడు విషయంలో జాతీయ నాయకులు అని లోహియా అన్న మాటను అంబేద్కర్ వద్దన్నా బి.సి లు ఆచరిస్తూనే ఉన్నారు. అంబేద్కర్ భావజాలం ప్రాధాన్యత ఇక్కడే ఉంది. కులాల మధ్య సఖ్యత కోసం లోహియా సిద్ధాంతాలు ఉపయోగపడితే, కులాల వ్యవస్థను నిర్మూలించడానికి అంబేద్కర్ సిద్ధాంతాలు ఉపయోగపడతాయి.

కులాల సమస్య విషయంలో లోహియా అవగాహన వర్తమానానికి సరిగ్గా సరిపోయిన అవగాహన. వర్తమాన పరిస్థితులకు అనువుగా అందరు కలిసి జీవిస్తూ కొద్ది కొద్దిగా మారుతూ శాంతియుత పరివర్తన సాగించాలని, ఒక జాతిగా ఎదగాలని లోహియా వంటి వాళ్లు భావించారు. సోషలిస్టు పార్టీలో ప్రధాన పదవుల్లో అరవై శాతం పదవులు బీసీలకే కేటాయించాలని లక్ష్యంగా పెట్టుకుని ఆచరించారు. ఈ పరిణామం నుండే ఉత్తరప్రదేశ్, బీహార్ లలో స్వాతంత్ర్యానంతరం బీసీలు కింది స్థాయి నుండి ఎదుగుతూ 1967 నాటికి అధికారంలోకి వచ్చి ముఖ్యమంత్రులయ్యారు. ఇదేమీ చిన్న విషయం కాదు.

ఇలా, స్వాతంత్ర్యానంతరం బీసీలకు, వారి రిజర్వేషన్లకు లోహియా ఒక పెద్ద దిక్కుగా నిలిచారు. ఎన్ని పరిమితులు ఉన్నప్పటికీ లోహియా లోని ఈ అవగాహన బీసీలకు లోహియా అంబేద్కర్ వంటివాడు అని కొందరు విశ్లేషిస్తున్నారు. దీన్ని చరిత్ర లోతుల్లోకి వెళ్లి నిగ్గు తేల్చాల్సిన అవసరం వుంది. అంబేద్కర్ దళితులకు రిజర్వేషన్లు సాధించాక, మహిళల సమాన హక్కుల కోసం హిందూ కోడ్ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టాడు. నెహ్రూ కాంగ్రెస్ పార్టీ సభ్యులకు విప్ జారీ చేయకపోవడం వల్ల బిల్లు వీగిపోయింది. అలాంటి బిల్లు బీసీ రిజర్వేషన్ల కోసం ప్రవేశపెట్టడం జరగలేదు. ఎవరు బీసీలు? ఎవరెవరిని బీసీల్లో చేర్చాలి? అనే అంశాన్ని సామాజిక, ఆర్థిక స్థితిగతుల పరిశీలనకు, సిఫారసులకు కాకా కాలేల్కర్ కమిషన్‌ను ఏర్పాటు చేశారు. బీసీ రిజర్వేషన్లు ఇవ్వాలనుకుంటే అందుకు జనభా లెక్కలే ప్రాతిపదిక కావాలనుకుంటే దానికి మార్గముంది. ఒక ఏడాది సమయంలో ప్రత్యేకంగా 1952 పార్లమెంటు ఎన్నికల తర్వాత జనాభా లెక్కల సేకరణ చేస్తే సరిపోయేది. లేదా, 1961 జనాభా లెక్కల్లో బీసీలు ఎవరెవరో లెక్కలు తీస్తే సరిపోయేది. కాంగ్రెస్ పార్టీ ఉద్దేశ పూర్వకంగానే ఈ పని చేయలేదు. బీసీలకు కాంగ్రెస్ పార్టీ చేసినంత ద్రోహం జాతీయోద్యమ కాలం నుండి మరెవరూ చేయలేదు. అయినా, కాంగ్రెస్ వెంట బీసీలు నడుస్తూనే వున్నారు. బీజేపీ, ఆరెస్సెస్ పరివారం బీసీ రిజర్వేషన్లకు వ్యతిరేకమని తెలిసి కూడా బీసీలు వాటి వెంట నడుస్తూనే వున్నారు. మాయలఫకీరు బాలనాగమ్మను కుక్కను చేసుకుని తీసుకుపోతున్నట్టుగా బీసీలను కాంగ్రెస్, బీజేపీ తమ వెంట తీసుకుపోతూనే ఉన్నది. ఇలాంటి చారిత్రాత్మకమైన సన్నివేశంలో లోహియా జాతీయోద్యమంలో, స్వాతంత్ర్యానంతరం నిర్వహించిన పాత్ర, బీసీల కోసం ఆయన చేసిన కృషి, ఆయన సిద్ధాంతాలు, జీవితం, అధ్యయనం ఎంతో అవసరం.

బీసీ రిజర్వేషన్ల కోసం జనతా పార్టీ 1977లో మండల్ కమిషన్‌ను నియమించింది. వాళ్లు 1980 లోనే అధికారం కోల్పోయి తిరిగి కాంగ్రెస్ రావడం వల్ల, ఇందిరాగాంధీ తిరిగి ప్రధానమంత్రి కావడం వల్ల బీసీ రిజర్వేషన్లు రాకుండా పోయాయి. తిరిగి కాంగ్రెసేతర జనతాదళ్ పార్టీ అధికారంలోకి వచ్చాకే, మండల్ కమిషన్ సిఫారసులను, ప్రతిపాదించిన రిజర్వేషన్లను ఆచరించే ప్రక్రియ మొదలైంది. అలా, వి.పి. సింగ్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు బీసీ రిజర్వేషన్లను ముందుకు తెచ్చారు. దాంతో ఆయన ప్రభుత్వాన్ని పడగొట్టారు. పి.వి.నరసింహారావు ప్రధానమంత్రి అయ్యాక బీసీ రిజర్వేషన్లు కొద్ది కొద్దిగా ఆచరణలోకి రావడం మొదలైంది.

ఇలా, రామ్ మనోహర్ లోహియా, ఆయన కృషి, ఆయన సహచరులు, వారసులు చేసిన కృషి భారతదేశ చరిత్రలో విశిష్టమైనది. అది చెరిపేస్తే చెరిగిపోయేది కాదు.

డా. రామ్‌మనోహర్ లోహియా కాంట్రిబ్యూషన్

1. కుల నిర్మూలన గురించి డిస్ట్రక్షన్ ఆఫ్ క్యాస్ అండ్ క్లాస్ అని అది ఎలా జరగాలో వివరించారు. డిక్లాస్ కావడం, డిక్యాస్ట్ కావడం

గురించి స్వామి వివేకానంద వలె తీవ్రంగా నొక్కి చెప్పారు. కులాలు, వర్గాలు అంతరించాల్సిన క్రమం సూచించాడు.

2. గ్రామీణ పేదల అభివృద్ధి, పరిశ్రమల, అధికార వికేంద్రీకరణ, చేతివృత్తుల అభివృద్ధి ప్రధానం అని భావిస్తూ యూరప్ దేశాల పారిశ్రామిక విధానం ఆసియా దేశాల్లో పనికిరాదని అధిక జనాభా గల మానవ వనరులను సద్వినియోగం చేసుకోవడానికి ప్రజల నైపుణ్యాలను అభివృద్ధి పరచి ఉత్పత్తి శక్తులుగా తీర్చిదిద్దాలని కోరారు. ఈ విషయంలో మావో, గాంధీ, లోహియా మాత్రమే సీరియస్‌గా ఆలోచించారు. నెహ్రూ, అంబేద్కర్, లెనిన్, మార్క్స్, ఏంగెల్స్ ఇందుకు భిన్నంగా ఆలోచించారు. వారు నగరాల, భారీ పరిశ్రమల అభివృద్ధి అధికార కేంద్రీకరణను కోరారు. కాని లోహియా అధికార వికేంద్రీకరణే నిజమైన ప్రజాస్వామ్యమని నొక్కి వక్కాణించారు.

3. 1936లో నెహ్రూ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు లోహియా ఫారెన్ అఫైర్స్ కార్యదర్శిగా ఉంటూ ప్రపంచంలో భారతదేశ సంబంధాలను అధ్యయనం చేసి అవగాహన పత్రం రూపొందించాడు. అదే స్వాతంత్ర్యానంతరం ఆచరించబడుతున్నది.

4. శూద్రులకు, బి.సి.లకు రాజకీయ అధికారంలో జనాభా అనుసరించి వాటా ప్రజాస్వామ్యయుతంగా పార్టీలోను, ప్రభుత్వాల్లోను, ఉద్యోగాల్లోను కల్పించాల్సిన అవసరం ఉందని ఉద్యమించారు. ఆచరించారు. దానివల్ల 1967లో భారతదేశంలో సగానికి పైగా రాష్ట్రాల్లో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

5. 1949 దాకా లోహియా నెహ్రూ, ఇందిరా కుటుంబ స్నేహితుడిగా కొనసాగినప్పటికీ ఆ తరువాత సీరియస్‌గా వ్యతిరేకించాడు. గాంధీ సిద్ధాంతాలను వదిలి భారీ పరిశ్రమల, ప్రాజెక్టుల, నగరాలు కేంద్రీకరణ, అధికార కేంద్రీకరణ చేస్తున్న నెహ్రూను వ్యతిరేకిస్తూ బి.సి.లకు అధికారంలో వాటా కావాలని నిరంతరం కృషి చేశాడు.

6. యూరప్ దేశాల అభివృద్ధి, ఆసియా దేశాల దోపిడీ ద్వారానే జరిగిందని విశ్లేషించి చూపాడు.

బీసీలు చారిత్రక శక్తులుగా, చరిత్ర శోధకులుగా రాజకీయాల్లో కీలకపాత్ర నిర్వహించే క్రమంలో లోహియా, అంబేద్కర్, పెరియార్ రామస్వామి నాయకర్, నారాయణ గురు వంటి చారిత్రక పురుషులతో, మహనీయులతో సమన్వయం, సంశ్లేషణ చెందే అవకాశం ఉంది. అందుకు లోహియా కులస్థులైన వ్యాపార, పారిశ్రామిక వర్గాలు, వైశ్యులు, మార్వాడీలు మొదలైనవారు బీసీ రిజర్వేషన్లను, బీసీ రాజకీయాధికారాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తూ తమ వాటాను, స్థానాన్ని బీసీలతో కలిసి పంచుకునే అవగాహనకు చేరుకున్నప్పుడే ఇది సాధ్యం. అంటే, బీజేపీ వెనుక గల గాంధీ, లోహియా కులాల, వర్గాల వారు బీసీ రాజకీయ శక్తుల వెనుక మద్దతుగా సాగినప్పుడు బీజేపీ ఎదుగుదల ఆగిపోతుంది. బీసీల రాజకీయ అధికారం సాకారం అవుతుంది. మరొక వైపు బీఎస్పీ, దళిత శక్తులు తమ అవగాహనను బీసీలకు అనుకూలంగా మార్చుకుంటారు. ఇప్పటికే, సర్వజన సంక్షేమం నినాదంతో బీఎస్పీ తన అవగాహనను మార్చుకుంటున్నది. ఇప్పుడు బీఎస్పీ నడుస్తున్న క్రమం దళితుల నాయకత్వంలో లోహియా చెప్పిన సోషలిస్టు పరివర్తనే తప్ప మరొకటి అవుతుందా? అయితే, అంబేద్కరిజం సిద్ధాంతంగా కొనసాగుతున్నది.

చేతి వృత్తి కులాల అభివృద్ధి గురించి, చిన్న స్థాయి ఉత్పత్తి గురించి లోహియా, గాంధీ ఎంతగానో ఆలోచించారు. నెహ్రూ, అంబేద్కర్, మార్క్స్, లెనిన్, స్టాలిన్ భారీ పారిశ్రామిక విస్తరణను ప్రతిపాదించి ఆచరించారు. లోహియా, మావో, గాంధీలు ఆసియా దేశాల జనాభా వనరులను గురించి, వారి జీవన భద్రత గురించి, వ్యవసాయ సమాజంలోని గ్రామీణ ప్రజల గురించి, వారి అభ్యున్నతి గురించి ఆలోచించారు. ప్రతిపాదించారు. అందువల్ల, ఈ విషయంలో భారతదేశంలోని లోహియా సోషలిస్టులు ఫ్రాన్స్ లోని సోషలిస్టుల కన్నా భిన్నమైన, ఆసియా దేశాలకు అవసరమైన సరియైన పాత్రను నిర్వహించారు. ఇలా, లోహియా ప్రపంచ సోషలిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరుగా ఎదిగారు. ఆసియా దేశాల సోషలిస్టు ఉద్యమాల నిర్మాణం ప్రజాస్వామిక వ్యవస్థలో ఎలా సాధించుకోవాలో అని ఆలోచించిన తరానికి, ప్రపంచానికి ఒక మార్గదర్శకుడిగా లోహియా నిలిచిపోయారు.

వర్గ వివక్ష, సామాజిక వర్గాల అసమానతలు తొలగడానికి బి.సి, ఎస్.సి, ఎస్.టి, మైనారిటీ సామాజిక వర్గాల్లో వర్గ దృక్పథాన్ని ప్రవేశపెట్టి వర్గీకరించడానికి మార్క్సిజం, వర్గ దృక్పథం ఎంతగానో ఉపయోగపడుతుంది. బహుళ పార్టీ వ్యవస్థలో శాంతియుత పద్ధతిలో రాజ్యాంగం మనం నిర్దేశించుకున్న ప్రజాస్వామ్య సామ్యవాదాన్ని సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో సాధించుకోవడానికి లోహియా భావాలు, వాటిలోని అంతస్సారం ఎంతగానో ఉపయోగపడుతుంది. అటు మార్క్సిజం చెప్పిన సామ్యవాదాన్ని, వర్గదృక్పథాన్ని, బి.సి ల, దళితుల ప్రయోజనాలను ముందుకు తీసుకువెళ్లే క్రమంలో లోహియా స్థానం మరింత స్థిరపడే అవకాశం ఉంది.

అక్టోబర్ 12, 1967 న లోహియా ఆస్పత్రిలో చనిపోయాడు. ఒక పథకం ప్రకారం ఆస్పత్రిలో చంపబడ్డారని కొందరు ఇప్పటికీ భావిస్తుంటారు. లోహియా శతజయంతి సంవత్సరాన్ని అంబేద్కర్ శతజయంతి వలె దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున జరపడం ద్వారా మరుగున పడిన లోహియా కృషి, భావాలు, బి.సిల సాధికారికత, చైతన్యం మెరుగులు దిద్దుకుంటాయి. వీ

రాజకీయ కార్యాచరణకు ఏ ఒక్క వ్యక్తి ఆలోచనో కేంద్రం కాకూడదు. ఆ ఆలోచన సహాయం చేయవచ్చు. కాని, ఆచరణను నియంత్రించకూడదు. అంగీకరించడమైనా, తిరస్కరించడమైనా గుడ్డి ఆరాధనకు భిన్న రూపాలు మాత్రమే. ఎవరైనా తనను తాను గాంధీవాదిగానో, మార్క్సువాదిగానో చెప్పుకుంటే నాకు హాస్యాస్పదం అనిపిస్తుంది. గాంధీ వ్యతిరేకి అన్నా, మార్క్సిస్టు వ్యతిరేకి అన్నా అంతే. గాంధీలోనూ, మార్క్సులోనూ కూడా నేర్చుకోదగిన విలువైన నిధులెన్నో ఉన్నాయి. కాని, ఏదైనా నేర్చుకోవడమనేది జరగాలంటే ఆలోచనా చట్రాన్ని ఒక కాలానికో, ఒక వ్యక్తికో కుదించుకుంటే కుదరదు.

**- రామమనోహర్ లోహియా (1943)**

*లోహియా భావాలతోనూ, లోహియా అనుచరుల స్నేహంతోనూ, స్వయంగా లోహియా ఉపన్యాసాలు విన్న అనుభవంతోనూ ఆయన గురించి తన అవగాహనను వివరిస్తున్నారు* **వరవరరావు**

# లోహియా జ్ఞాపకాలు

**1940**లలో రాజకీయ కుటుంబాల్లో పుట్టినవాళ్లు గాంధీ నెహ్రూలతో పాటు జయప్రకాశ్ నారాయణ్, రాంమనోహర్ లోహియాల పేర్లు వినడమైనా వాళ్ల గురించి ఎంతో కొంత విని ఉండడమైనా, తెలుసుకోవడమైనా సర్వ సాధారణమైన విషయం.

వరంగల్ ఆర్ట్స్ కాలేజీలో నేను బి.ఎ. కు వచ్చే వరకే మా సీనియర్లు సోషలిస్టు పార్టీ ప్రభావంలో పని చేసినవాళ్లూ, చేస్తున్న వాళ్లూ మమ్మల్ని చేరదీసి లోహియా భావజాలంతో ప్రభావితం చేయడానికి ప్రయత్నిస్తుండేవాళ్లు. అప్పటికే కాంగ్రెస్ నాయకుడుగా పేరు తెచ్చుకున్న పింగళి ఉమారెడ్డి విద్యార్థి దశలో క్విట్ ఇండియా ఉద్యమానికి స్పందించి వరంగల్‌లో నిరసన ప్రదర్శనలో పాల్గొంటే, ఆయనను, ఆ తర్వాత కాలంలో నాకు సన్నిహిత మిత్రుడయిన పెండెం శ్రీనివాసరావు (పత్రికా రచయిత) మొదలయిన వారిని పోలీసులు అరెస్ట్ చేసి ములుగు అడవుల్లో వదిలిపెట్టి వచ్చారని చెప్పుకునే వాళ్లు. విద్యార్థి దశలో పింగళి ఉమారెడ్డి సోషలిస్ట్. ఆయన తమ్ముడు పింగళి జనార్దనరెడ్డి, సహచరులు మన్మోహన్ సింగ్, కోటేశ్వరరావులు మాత్రం నా కాలేజీ రోజుల్లో కూడ సోషలిస్ట్ రాజకీయాలలో ఉన్నారు. వరంగల్ నగరపాలక సంస్థలో కాంగ్రెస్ నాయకుడు హయగ్రీవాచారి గారయితే, ఆయనను వ్యతిరేకించే వాళ్లంతా మన్మోహన్ సింగ్ నాయకత్వంలోని సోషలిస్ట్ కౌన్సిలర్లు అయి ఉండేవాళ్లు. వీరిలో ప్రత్యేకించి చెప్పుకోవాల్సింది కోటేశ్వరరావు గురించి. ఆయన మునిసిపల్ కౌన్సిలర్‌గా ఉండేవాడు. రిక్షావాళ్లను, కార్మికులను కూడగట్టి సంఘాలు పెట్టాడు. చాల ఆదర్శప్రాయమైన కార్మిక నాయకునిగా ఉండేవాడు. ఆయన ఒక మోటారు సైకిల్ యాక్సిడెంట్‌లో యువకుడుగా చనిపోయాడు. అప్పుడు అంటే నేను యాభై ఏళ్ల క్రితమే 'అపూర్వ శిక్షాస్మృతి' అని ఆయన కోసం ఒక స్మృతి గీతం రాసి ఇట్లా పరిచయం చేసాను. కీ.శే. కోటేశ్వరరావు వరంగల్‌లో శ్రమజీవుల కోసం పుట్టి వారి కొరకే చనిపోయాడా అనిపించే 'సోషలిస్ట్' మాటల్లో కాదు ఆచరణలో. దురదృష్టవశాత్తూ ఆయన డ్రైవ్ చేస్తున్న సైకిల్ మోటారు ఒక రిక్షాతో ఢీకొని, స్వల్ప వ్యవధిలో రిక్షావాడు, కొన్ని గంటల తర్వాత ఆయునా చనిపోయారు. ఆ సమయమంతా ఆయన స్మృతికి వచ్చినప్పుడల్లా ఆ రిక్షావాని యోగక్షేమాల గురించే వ్యగ్రతతో అడుగుతుండే వాడు.

అయితే ఈ అందరికన్నా మాకన్న ఒక సంవత్సరం సీనియర్ అయిన జె.వి. రాఘవేంద్రరావు గారి నుంచి మాత్రం క్రమం తప్పకుండా హనుమకొండ చౌరస్తాలో సాయంత్రాలు లోహియా లెక్చర్లు వింటుండే వాళ్లం. ఆ తర్వాతెప్పుడో రెండు మూడేళ్లకు సి. రాఘవాచారి లెక్చర్లతో, సాన్నిహిత్యంతో కమ్యూనిస్టు భావజాలం వైపు వచ్చిన నేను జె.వి. అనర్గళమైన సోషలిస్ట్ ప్రపంచాలతో అటువైపు ఎందుకు మొగ్గలేదో కొంత ఆశ్చర్యమే. బహుశా శ్రీశ్రీ కవిత్వ గురుత్వాకర్షణ శక్తి అనుకుంటాను ఆపింది.

లోహియాను స్వయంగా చూసింది మాత్రం అరవైల ఆరంభంలో. ఉస్మానియా క్యాంపస్ విద్యార్థిగా ఉన్నప్పుడు; అది కూడ ఒకటి రెండు సాహిత్య సమావేశాల్లోయ ఇపుడు స్పష్టంగా గుర్తు లేదు గానీ రెండుసార్లు ఆయనను నేను బద్రీవిశాల్ పిత్తీ ఇంట్లో కలిసాను. అంతా ఇరవై మంది ఉన్న చిన్న గోష్ఠి లోనే కావచ్చు కానీ, అందులో నేను కేవలం శ్రోతనో, ప్రేక్షకుణ్నో కనుక చూసాను అనడమే బాగుంటుందేమో. నిజాం సంస్థానంలో పెద్ద పారిశ్రామికవేత్త, మీర్ ఉస్మాన్ అలీ ఖాన్‌కే అప్పు పెట్టిన పన్నాలాల్ పిత్తీ కుమారుడు బద్రీవిశాల్ పిత్తీ ఆశ్చర్యంగా ప్రముఖ సోషలిస్ట్ పార్టీ నాయకుడయ్యాడు. ఆయన హైదరాబాద్ నుంచి ఒక మంచి హిందీ సాహిత్య, కళా పత్రికను తెస్తుండేవాడు. ఆ పత్రికా నిర్వహణ సమావేశాలకు కూడ లోహియా వచ్చేవారనుకుంటాను.

ఇంకొక వైచిత్రి ఏమంటే బహుశా జువ్వాడి గౌతమరావుగారి వల్ల అనుకుంటాను 'జయంతి' పత్రికతో సంబంధం ఉన్న విశ్వనాథ సత్యనారాయణ గారి శిష్యులందరు కూడ ఈ సోషలిస్ట్ శిబిరంలో కలుస్తుండే వాళ్లు. నా క్లాస్‌మేట్, ప్రాణస్నేహితుడు వె. నరసింహారెడ్డి విశ్వనాథ మీద అభిమానంవల్ల నన్ను ఈ సమావేశాలకు తీసుకుపోతుండే వాడు. అక్కడే నాకు జువ్వాడి గౌతమరావు గారితో పరిచయమై, అది ఇవ్వాటికీ ఒక గౌరవ భావంగా నిలిచిపోయింది. కనుక లోహియాను నేను తొలిసారి, మలిసారి చూసింది, హిందీ సాహిత్య, కళా ప్రపంచంలో, 'జయంతి' సాహిత్య పత్రికా ప్రపంచంలోనని గుర్తు చేసుకోవడం ఇవ్వాళ విరోధభావనగా కనిపించవచ్చు. గాంధీ గారిని బిర్లా మందిర్‌లో, ఆగాఖాన్ ఇంట్లో ఊహించుకోవడమైనా, వివేకానందుని విడిదిలన్నీ మార్వాడీల ఇండ్లు కావడమైనా చదువుతుంటే తెలిసీ తెలియని జ్ఞానంతో ఆ రోజుల్లోనే ఆశ్చర్యంగా అనిపించేది.

లోహియాకు రెబెల్ (తిరుగుబాటుదారుగా)గా స్టార్మ్‌పెట్రల్ (తుపాను)గా తక్కువ ప్రఖ్యాతి ఏమీ లేదు. కానీ సాహిత్య, సామాజిక రంగాల్లో రెబెల్ అయిన చలం అనుచరులు ఎంతోమంది విప్లవం వైపు

వచ్చినట్లుగా రాజకీయాల్లో లోహియా అనుచరులు విప్లవం వైపు రాలేదు ఎందుకు అని ప్రశ్నించుకుంటే ఆయన వర్గపోరాటానికి అనివార్యమైన సాయుధ మార్గాన్ని వ్యతిరేకించడం వల్లనా అనిపిస్తుంది.

చివరిదాకా లోహియా వాదిగా ముక్కుసూటితనానికి, నిజాయితీకీ పేరుతెచ్చుకున్న సురమౌళి లోహియా వలె అణగారిన కులాల పక్షపాతం చూపే క్రమంలో కమ్యూనిస్టుల మీద వ్యక్తిగత నిందా ప్రచారాలను నమ్మి, తానూ ప్రచారం చేసాడు. నక్సలైట్ల హింస పై ఒక పుస్తకమే రాసి, పోలీసుల హింస ప్రస్తావన లేకుండా, ముఖ్యమంత్రి విజయ భాస్కరరెడ్డితో ఆవిష్కరణ చేయించాడు.

ఇవ్వాటికీ లోహియా విచార్ మంచ్ నిర్వహిస్తున్న కేశవరావ్ జాదవ్ నేను వరంగల్ కాలేజీ విద్యార్థిగా ఉన్నప్పుడే అక్కడికి ఇంగ్లిష్ లెక్చరర్‌గా వచ్చాడు. నాకు ప్రత్యక్ష గురువు కాలేదు కానీ, అప్పటికే విద్యార్థులు ఆయన గురించి యువ సోషలిస్టు లోహియా వాదిగా గుసగుసగా, ఆశ్చర్యంగా, గౌరవంగా చెప్పుకునే వాళ్లు. ఎందుకంటే 1957–67 మధ్యకాలం మిలిటెంట్ రాజకీయాల కాలం కాదు. ఇవ్వాటికీ కమ్యూనిస్ట్ వ్యతిరేకత మినహాయిస్తే జాదవ్‌గారిలో వేలుపెట్టి చూసే వంక కనిపించదు.

సోషలిస్టులు, కమ్యూనిస్టు వ్యతిరేకులు కావడం గురించి మా శత్రుఘ్న అయితే చాల సైద్ధాంతిక వివరణ ఇచ్చేవాడు. అది అలా ఉంచుదాం.

లోహియాను మళ్లీ జవహర్లాల్ నెహ్రూ చనిపోయాక లాల్‌బహాదుర్ శాస్త్రి ప్రధానిగా ఉన్నప్పుడు ఢిల్లీలో చూసాను, విన్నాను. అద్భుతమైన ప్రసంగం.

ప్రధానంగా ఈనాటికీ లోహియా పట్ల నా గౌరవానికి ప్రాతిపదిక ఆ ప్రసంగంలో ఉంది. అవి పబ్లిక్ లా 480 పేరుతో అమెరికా ఉచిత గోధుమలతో పాటు అమెరికా సంస్కృతిని దిగుమతి చేస్తున్న రోజులు. లోహియా నిప్పులు చెరిగే సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రసంగం చేసాడు. ఆయన 'అంగ్రేజీ హఠావో' ఉద్యమం నాకు కేవలం భాషపై ఉన్న వ్యతిరేకతగా కనిపించలేదు. ఆధిపత్య భావజాల వాహికగా ఇంగ్లిష్ భాషపై ఉన్న వ్యతిరేకతగానే కనిపించింది. ఆ ప్రసంగంలోనే ఆయన ప్రతిపాదించిన రెండో అంశం – భారతీయ సామాజిక చిత్రాన్ని విశ్లేషిస్తూ ఇది నిచ్చెన మెట్ల కుల సమాజమనీ, కనుక ఇక్కడ అణగారిన కులాల చేతికి అధికారం రావాలంటే విద్యా, ఉద్యోగ, రాజకీయ రంగాల్లో షెడ్యూల్డ్ కాస్ట్, షెడ్యూల్డ్ ట్రైబ్స్‌కు రాజ్యాంగ పరిరక్షణ ఉన్నట్లే రాజకీయ పార్టీలన్నీ కుల ప్రాతిపదికగా దామాషాగా రిజర్వేషన్లు కల్పించాలన్నాడు. ప్రయత్న పూర్వకంగా అణగారిన కులాల నుంచి కార్యకర్తలను నాయకత్వ స్థానాలకు తేవాలనుకున్నాడు. ఆయన చాల సందర్భాల్లో నిర్వహించిన ఇంగ్లిష్ కోర్టులకు తారుపూసే కార్యక్రమ స్వభావంలో ప్రభుత్వ శిలా శాసనాలకు తారు పూసే కార్యక్రమమని నాకు చాల సందర్భాల్లో అనిపించేది.

1967 నాటికి లోహియా నెహ్రూ కుటుంబ పాలనను వ్యతిరేకించే, కాదు ద్వేషించే ప్రఖ్యాతి అనండి, కుఖ్యాతి అనండి గడించాడు. ఉస్మానియా క్యాంపస్‌లో 'ఎ' హాస్టల్‌లోను, బషీర్ క్యాంటిన్‌లో కృపలానీ, కృష్ణమీనన్ శిబిరాలుగా మేం విడిపోయి చేసే చర్చల్లో జయివిత్ రెడ్డి, జెపి, లోహియా, కృపలానీల పక్షమూ, నేను, అంపశయ్య నవీన్ నెహ్రూ కృష్ణమీన్ పక్షమూ తీసుకోవడం. ఇపుడైతే ఇంక 'అంపశయ్య' నవల ద్వారా తెలుగు సాహిత్య లోకానికి తెలుసు.

అయితే అప్పటికే సోషలిస్టులు, స్వతంత్ర పార్టీ పొత్తులో ఉన్నారు. ఫిరోజ్ గాంధీ అయినా, రాంమనోహర్ లోహియా అయినా నెహ్రూ కుటుంబ పాలనను ఎంత వ్యతిరేకించినా ఎన్నడూ వ్యక్తిగత దూషణలు చేయలేదు.

1964 మే 27న జవరహర్‌లాల్ నెహ్రూ చనిపోయిన రోజు లోహియా అమెరికాలో ఉన్నాడు. ఆయనను నెహ్రూ మరణం పట్ల వ్యాఖ్యానించమని కోరితే 'నెహ్రూ 1947లోనే చనిపోయాడు' అని చాల హుందాగా జవాబు చెప్పాడు. కాంగ్రెస్ పార్టీలో నిజానికి కాంగ్రెస్ సోషలిస్టులను నెహ్రూ ఒక కాల్పనికమైన ఉత్తేజాన్నిచ్చిన ఎర్రగులాబీగా ఉండేవాడు. కమలా నెహ్రూ అనారోగ్య సందర్భంగా స్విట్జర్లాండ్‌కు వెళ్లి వస్తూ నియంత ముసోలినీని కలవడానికి నిరాకరించిన నెహ్రూ, కరాచీ కాంగ్రెస్‌లో యువతరాన్ని ఉత్తేజపరిచిన నెహ్రూ నిజంగానే లోహియా వంటి వాళ్లకు 1947లోనే చనిపోయాడు.

కొండపల్లి సీతారామయ్య గారు చనిపోయినపుడు ఎపుడో ఇంటర్వ్యూలో గణపతి చెప్పినట్లు. 1987 వరకు మమ్మల్ని నడిపించినవాడు, మాకు దండకారణ్య పర్‌స్పెక్టివ్ ఇచ్చినవాడు కె.ఎస్. మా కె.ఎస్. 1987లోనే పోయాడని చెప్పి ఉండవచ్చు కదా అన్నాను చర్చల సందర్భంగా పీపుల్స్‌వార్ నాయకత్వంతో. మాకు స్ఫురించ లేదన్నారు వాళ్లు.

అట్లే పార్లమెంట్‌లో ఇందిరాగాంధీ గురించి వ్యాఖ్యానించమంటే ఆకాశంలో సగం చిరునవ్వయినా చూడగలుగుతున్నాం కదా అన్నాడు లోహియా.

1967 కాంగ్రెసేతర ప్రభుత్వాల ఏర్పాటు తొమ్మిది రాష్ట్రాల్లో కావడమైనా, కర్పూరి ఠాకూర్ వంటి ముఖ్యమంత్రి బీహార్ వంటి పెద్ద ఫ్యూడల్ రాష్ట్రానికి ముఖ్యమంత్రి కావడమైనా లోహియా విజయాలని చెప్పాలి.

నేను నక్సల్బరీ రాజకీయాలవైపు ఆకర్షితుణ్ణవడం అపుడే ప్రారంభమైంది కనుక ఇంక నా రాజకీయ ఎజెండాలో లోహియా చిత్రం మరుపున పడుతూ వచ్చింది.

నేను జడ్చర్ల కాలెజిలో పని చేస్తున్న రోజుల్లోనే 1967 అక్టోబర్‌లో లోహియా మరణించాడు. నేను కళాశాలలో ఆయన సంస్మరణ సభ పెట్టి ఆయన రాజకీయ వ్యక్తిత్వాన్ని విశ్లేషించాను.

లోహియా ప్రాసంగికతను మళ్లీ బలంగా ముందుకు తెచ్చింది ఇందిరాగాంధీ పరిపాలన. రాజ్‌నారాయణ్ వంటి మొండివాడు ఇందిరాగాంధీని కోర్టులో ఓడించడమైనా, ఎన్నికల్లో ఓడించడమైనా లోహియా నుంచి అలవడిన రాజీలేని, పట్టువదలని ధోరణుల వల్లనే.

ఎమెర్జెన్సీలో మళ్లీ ఒకసారి సోషలిస్టులు, ముఖ్యంగా లోహియా వాదులు, క్విట్ ఇండియా కాలపు మిలిటెన్సీని చూపారు. బరోడా డైనమైట్ కేసులో ముద్దాయిగా ఉన్న వాళ్లంతా జార్జ్ ఫెర్నాండెజ్ సహచరులు

కావడం కన్న లోహియావాదులు కావడమే ఎమర్జెన్సీ హీరోలు కావడానికి దోహదం చేసింది. లోహియావాదిగా స్నేహలతారెడ్డి అరెస్ట్, అనుభవించిన చిత్రహింసలు, జైల్లో మరణం ఇందిరాగాంధీ పాలనపై 'హల్లాబోల్'గా ఎల్లకాలం స్మరణలో ఉంటాయి.

ఎమెర్జెన్సీలో ఒక జైల్లో ఉంటూ మరో జైల్లో స్నేహలతా రెడ్డి మరణం గురించి వినడం, అజ్ఞాతం నుంచి జార్జ్ ఫెర్నాండేజ్ చేరవేసే 'నియంత ఐజి' (ఇందిరాగాంధీ)ని సంబోధించే నిప్పుల అక్షరాలు మళ్లీ మాకు లోహియాను సన్నిహితం చేసాయి.

ఈసారి జార్జ్‌ఫెర్నాండెజ్ మొదలయిన లోహియా వాదులందరినీ బరోడా డైనమైట్ కేసులో ఇందిరాగాంధీ ప్రభుత్వం ఇరికించింది గనుక ఇంక రాజ్యం ముందు హింసా హింసల చర్చ ఎంత నిరర్థకమో కూడ వాళ్లకు తెలిసి వచ్చిందనుకున్నాం. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత దేశవ్యాప్తంగా ఎన్‌కౌంటర్ల విషయంలో సోషలిస్టులు తీసుకున్న అనుకూల వైఖరికి ఈ ఎమర్జెన్సీ రాజ్యహింసయే కారణమైంది.

మళ్లీ ఒకసారి లోహియా నాకు సాహిత్యరంగం నుంచి సన్నిహితమయ్యాడు. యు.ఆర్. అనంతమూర్తి 'సంస్కార' నవల ఇలస్ట్రేటెడ్ వీక్లీలో ఎమర్జెన్సీలోనే సీరియల్‌గా చదివేవాణ్ని. ఆ తర్వాత పఠాభి సినిమాగా చూసాను. పఠాభి, యు.ఆర్. అనంతమూర్తి – వీళ్లంతా లోహియావాదులుగా, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్యవాదులుగా సన్నిహితులయ్యారు. ఫిడేల్ రాగాల ..... పఠాభి గురించి వినడమే గానీ ఎమర్జెన్సీ తర్వాతనే ఆయనతో పరిచయం పెరిగింది. యు.ఆర్.అనంతమూర్తి అయితే కాకతీయ యూనివర్సిటీ ఇంగ్లీష్ బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యుడుగా సన్నిహితమిత్రుడయ్యాడు. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత ఒక ప్రజాస్వామిక వాతావరణంలో హనుమకొండ టౌన్ హాల్‌లో విరసం ఏర్పాటు చేసిన సభలో యు.ఆర్. అనంతమూర్తి 'తెల్లబట్టల వాళ్లకు ఎమర్జెన్సీ తొలగిన మాట నిజమే కానీ, నెత్తిమీద మలం బకెట్ మోసే పాకీవానికి ఎమర్జెన్సీ తొలిగే రోజు కోసం రచయితలం కలలు కనాలి' అన్నాడు. విప్లవకారులకు, విప్లవాభిమానులకు నలభై ఏళ్లుగా ఎమర్జెన్సీయే కొనసాగుత్నుది.

ఇప్పుడు లోహియావాదంతో నా సంభాషణ మూడు దశలో ప్రసరించిందనుకుంటాను. 1991లో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ప్రారంభమైన దగ్గర నుంచీ ఆల్ ఇండియా రెసిస్టెన్స్ ఫోరమ్ అగేనెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్, ముంబై రెసిస్టెన్స్ 2004, పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా వంటి ఎన్నో సామ్రాజ్యవాద వ్యతిరేక విశాల ఐక్య సంఘటనా ప్రయోగాలు జరుగుతున్నాయి. వీటిల్లో దేశవ్యాప్తంగా నిజాయితీ గల గాంధేయ, సర్వోదయ, లోహియావాదుల విప్లవవాదులతో కలిసి వస్తున్నారు. ప్రత్యేక ఆర్థికమండలాల ఏర్పాటు, భూవిస్థాపన వంటి ప్రభుత్వ విధానాలు ప్రజల సార్వభౌమత్వానికే ప్రమాదంగా పరిణమించిన గడ్డుకాలంలో రాజ్యం, వ్యవస్థ, ఆధిపత్య భావజాలం, ఎస్టాబ్లిష్‌మెంట్‌లను రాజీ లేకుండా ప్రతిఘటించే మనుషులు కరువవుతున్నారు.

ఇంద్రవెల్లిలో 1981 ఏప్రిల్ 20న ఆదివాసులపై పోలీసులు కాల్పులు జరిపాక, కేస్లాపూర్ నాగోబా దేవాలయంపై గోండ్వానా చంద్రవంక జెండా ఎగుర వేసినపుడు ఆంధ్రప్రదేశ్ శాసనసభ, శాసనమండలిలో పాకిస్థాన్ జెండా ఎగురవేసారన్న చర్చ, దుష్ప్రచారం జరిగింది. అప్పుడు కేస్లాపూర్ నాగోబా జాతరకు సురేంద్ర మోహన్‌ను ఆహ్వానించాం. ఆయనను, కన్నబిరాన్‌ను, నన్నూ మా అందరినీ జాతర నుంచి ఆదిలాబాద్ వెళ్తుంటే అరెస్ట్ చేసి పోలీసు స్టేషన్‌లో పెట్టారు.

విడుదలయ్యాక హైదరాబాద్‌లో సురేంద్ర మోహన్‌ను కలిసినపుడు అక్కడికి జయపాల్‌రెడ్డి కూడ వచ్చాడు. 'ఇటువంటి వాళ్లతో కలిసి పని చేయడం మన ఉదారవాద ప్రజాస్వామ్య భావాలకు గీటురాయి అవుతుంద'ని జయపాల్ రెడ్డికి సూచించాడు సురేంద్రమోహన్.

లోహియా ప్రభావం గురించి గుర్తు చేసుకున్నపుడు జార్జ్ ఫెర్నాండెజ్‌లు కాకుండా సురేంద్రమోహన్‌లు గుర్తు రావడం లోహియాకు న్యాయం చేయడమవుతుందేమో. దేశవ్యాప్తంగా నలభై ఏళ్లుగా రాజకీయ ఖైదీల విడుదల కోసం కొనసాగుతూ, కొడిగడుతూ వస్తున్న ఉద్యమాలకు ఒక దేశస్థాయి నిర్మాణ రూపం ఇవ్వడంలో చొరవ చూపిన సురేంద్రమోహన్ పూనిక ఇచ్చాక జైళ్లలో మగ్గుతున్న ముస్లిం మైనారిటీలకు, దళితులకు, ఆదివాసులకు, నక్సలైట్లకు చీకటి గుహలో ఒక వెలుగు రేఖగా కనిపిస్తున్నది. ఎమర్జెన్సీ కాలంలో, ఆ తర్వాత జనతాపార్టీకి అధికార ప్రతినిధిగా స్పోక్స్‌మన్‌గా వ్యవహరించిన సురేంద్రమోహన్ ఇవ్వాళ ఏ పార్లమెంటరీ పార్టీకి పనికిరాని వాడుకావడం గాంధీ, జెపి, లోహియావాదులు కూడా – మాకు వాటితో ఎన్నితీర్ల సిద్ధాంత విభేదాలు ఉన్నప్పటికీ – బతికి బట్టకట్టగలిగే స్థితి పార్లమెంటరీ రాజకీయాల బయటనే మిగిలిందనడానికి దాఖలు.

పార్లమెంటరీ రాజకీయాలు అంటే సామ్రాజ్యవాద ప్రపంచీకరణను బలపరచడం – అన్నది ఇవ్వాళ పరీక్షకు తేలిపోయిన వాస్తవం. సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు, వ్యక్తులు ఇంక సంఘటితం కావల్సిన స్థలం – జయప్రకాశ్ 1974 బీహార్ ఉద్యమకాలంలో 'గాంధీ మైదాన్‌లో' మాత్రమే మిగిలిందని చెప్పినట్లుగా బయటనే మిగిలింది.

ముప్పై ఐదేళ్లలో వచ్చిన పరిణామాల్లో పట్టణాలలో మైదానాలు మిగలలేదు కనుక ఇంక గాంధీ మైదానాలు పెద్ద పెద్ద మాల్స్‌గా మారిపోయాయి.

సామ్రాజ్యవాద ఆక్టోపస్ ఇపుడు దట్టమైన అడవుల్లోకి కూడ విస్తరిస్తున్నది. ఇపుడింక ఆలోచించవలసింది చట్ట సభల్లోని చర్చల గురించి కాదు. నేల విడువని సాము గురించి, పోరాట రూపాల కన్న, పోరాట సారం గురించి. పోరాట లక్ష్యం గురించి.

ఇంగ్లీష్ సైన్ బోర్డులకు తారు పూసే కాలం నుంచి మనం ఇరాక్‌లో చొరబడిన జార్జ్ వాకర్ బుష్ మొహాన బూటు విసిరిన కాలంలోకి వచ్చాం. ఇటువంటి ఆగ్రహాన్ని ఆరోగ్యకరంగా నిలబెట్టుకోవడం మన ఐక్యతకు తొలి లిట్మస్ పరీక్ష.

మా జడ్చర్ల కళాశాల లోహియా సంస్మరణ సభ ముగిసాక మా సహోధ్యాపకుడొకాయన 'ఆయన ఆత్మశాంతికి మనం రెండు నిమిషాలు మౌనం పాటించి ఉండాల్సింది' అన్నాడు. శాంతించిన ఆత్మ, మౌనం లోహియా స్వభావానికి సరిపడదన్నాను. ఆత్మలు శాంతించిన వాళ్లు, మాట్లాడాల్సిన గడ్డుకాలంలో మౌనం పాటించేవాళ్లు అర్థవంతమైన శాంతిని సాధించలేరనుకుంటాను. వీ

**ఎన్నికలు రాబోతున్న సమయంలో ప్రత్యేక తెలంగాణ ఆకాంక్ష గురించి అన్ని రాజకీయ పక్షాలు తమ వైఖరులు ప్రకటించిన నేపథ్యంలో ఆ వైఖరులను విశ్లేషిస్తున్నారు డా. జి. లచ్చయ్య**

# ఎన్నికల చక్రబంధంలో తెలంగాణ

ఢిల్లీలో వైయస్ వాదం నెగ్గడంతో తెలంగాణ ఏర్పాటుకు కాంగ్రెస్ తిలోదకాలిచ్చిందని తేలిపోయింది. ఎన్నికల ముందునాటికి కాంగ్రెస్ అధినాయకత్వం ఏదో ఒకటి తేల్చకపోతుందా అని ఆశించిన వారికి తీరని ఆశాభంగం కలగవచ్చు! గత ఐదు సంవత్సరాలుగా ఢిల్లీ చుట్టూ తిరిగిన తెలంగాణ వాదానికి కాంగ్రెస్ తెరదించింది. చేవచావని తెలంగాణ కాంగ్రెస్ వాదులు అధిష్ఠాన వర్గం ఇంకా ఏదో చేస్తుందనే ధీమాను వెలిబుచ్చడం తమ మేకపోతు గాంభీర్యాన్ని చూపడానికే!

రాజకీయాలు తెలంగాణ చుట్టూ తిరిగితే, తెలంగాణ అంశం తెరాస చుట్టూ తిరగడం గత ఐదు సంవత్సరాల నుంచి జరుగుతున్నది. తెరాసకన్నా తెలంగాణ ముఖ్యమని సనుగుతున్న డి.యస్.లాగానే, మహాకూటమికి తెలంగాణ సాధనకన్నా కాంగ్రెస్‌ను గద్దెదింపడం ప్రధాన ఎజెండగా రూపుదిద్దుకున్నది. ఈ కూటమిలో తెరాస చక్రం తిప్పుతుందా, సమిధగా మారుతుందా అనేది రాజకీయ పరిశీలకులకు అంతుపట్టని అంశం. కెసిఆర్‌ను గత ఎనిమిది సంవత్సరాలుగా పరిశీలించిన వారికి ఆయన ఎత్తుగడలు అర్థం కావచ్చు! కాని ఆయన ఎత్తుగడలు ఎలా విఫలం చెందాయో గత అయిదు సంవత్సరాల చరిత్ర చెప్పకనే చెపుతున్నది. కెసిఆర్ ఊహించినట్లు, మహాకూటమి ఆంధ్రప్రదేశ్‌లో విజయం సాధిస్తే చంద్రబాబు ముఖ్యమంత్రి అవుతాడు. వైయస్ఆర్ ప్రతిపక్ష నాయకుడవుతాడు. ఒకవేళ తెలంగాణ అంశం అసెంబ్లీలో చర్చకు వస్తే వైయస్ఆర్ సమైక్య వాదాన్నే తన బాణిగా వినిపిస్తాడు. తిరిగి తనకు అధికారం ఇస్తే మిగిలిపోయిన యజ్ఞాలకు తానే నెయ్యిని పోస్తానంటాడు. సిపిఎం తన తటస్త వాదాన్నే వినిపిస్తుంది. ఇక ప్రజారాజ్యం పార్టీ కొన్ని సీట్లను గెలుచుకుంటే స్పందన ఎలావుంటుందో ఊహించుకోవచ్చు! కోస్తాలో అధికసీట్లు సాధించి, తెలంగాణలో రాకపోతే చిరంజీవి కూడా తటస్తవాదాన్ని ప్రదర్శించవచ్చు! ఇక మిగిలేవి టి.డి.పి, తెరాస, సిపిఐలు మాత్రమే! మహాకూటమితో లాభపడే చంద్రబాబు తెలంగాణ అంశాన్ని చర్చకు పెట్టినా, తూతు మంత్రంగానే వుంటుంది. తెరవెనుక తెలంగాణ వ్యతిరేక శక్తుల్ని ఆయన ప్రేరేపించవచ్చు! రెచ్చగొట్టవచ్చు! లేదా బిజెపికి తక్కువ సీట్లు వచ్చి కేంద్రంలో మూడోఫ్రంటు అధికారంలోకి వస్తే ఏకాభిప్రాయ సేకరణ, రెండో ఎస్సార్సీ అనే మంత్రాలను చంద్రబాబు పునరుద్ఘాటన చేయవచ్చు! లేదా కాంగ్రెస్ ఇటు రాష్ట్రంలో, అటు కేంద్రంలో అధికారంలోకి వస్తే, కెసిఆర్ తలక్రిందుల తపస్సు చేసినా తెలంగాణ ఏర్పాటు ఇక సాధ్యంకాదు. ఒకవేళ రాష్ట్రంలో మాహాకూటమి, కేంద్రంలో మూడోఫ్రంటు ఏర్పాటైతే గత ఐదు సంవత్సరాల స్థితే కొనసాగవచ్చు! ఎందుకంటే ఈ ఫ్రంటులోని భాగస్వామ్య పార్టీలన్నీ ఏక తాటిపైకి రాకపోవచ్చు! ఏ ఒక్క పార్టీ తెలంగాణను వ్యతిరేకించినా ఫ్రంటు అధికారాన్ని కోల్పోవచ్చు! లేదా మరికొంత కాలం ఢిల్లీ రాజకీయాల్లో తెలంగాణ వాదం కొనసాగవచ్చు! నిఖార్సుగా చెప్పాలంటే జాతీయస్థాయి పార్టీ అయిన బిజెపి మాత్రం నిర్ద్వంద్వంగా తెలంగాణను ఏర్పాటు చేస్తానని అంటున్నది. కాని బిజెపి కేంద్రంలో అధికారంలోకి వచ్చే స్థితి కనబడడం లేదు. ఒకవేళ బిజెపి అధిక సీట్లను సాధించి, చిన్న చితకా జాతీయ, ప్రాంతీయ పార్టీలతో కలిసి అధికారంలోకి వచ్చినా, తెలంగాణ ఏర్పాటుకు ఒకటి రెండు పార్టీలు అడ్డు చక్రం తిప్పవచ్చు! అప్పుడు కూడా బిజెపి మైనార్టీలో పడే ప్రమాదం ఎలాగో వుంటుంది. కాబట్టి బిజెపి ఎంత నిజాయితిని ప్రదర్శించినా స్వయంగా తెలంగాణను ఇవ్వలేని నిస్సాహాయ స్థితిలో వుంటుంది.

గత నవంబర్, డిసెంబర్ నెలల్లో జరిగిన ఆరు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలను చూస్తే, ఏ జాతీయ పార్టీ కూడా కేంద్రంలో అధికారంలోకి వచ్చేస్థితి కనపడడం లేదు. కాశ్మీర్‌లోని అమర్‌నాథ్ ఆలయ భూముల గొడవ నేపథ్యంలో బిజెపి పదకొండు అసెంబ్లీ స్థానాలను పొందగా, మిజోరంలో కాంగ్రెస్ అధికారంలోకి రాగలిగింది. మిగతా రాష్ట్రాలైన మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్, రాజస్థాన్, ఢిల్లీలలో గతస్థానాన్ని బిజెపి, కాంగ్రెస్‌లు కాపాడుకున్నాయి. ఒక్క రాజస్థాన్‌లోనే బిజెపి తిరుగుబాటు అభ్యర్థులు 27మంది బియస్‌పి ఇతర పార్టీల ద్వారా గెలుపొందడంతో బిజెపి అధికారాన్ని చేజార్చుకున్నది. అక్కడ కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినా అది ఎంతకాలం స్థిరంగా వుంటుందో తెలియదు. వచ్చే లోకసభ ఎన్నికల నాటికి రాజకీయాలు పెద్దగా మార్పు చెందక పోవచ్చు! కేంద్రంలో రాజకీయాలను శాసించే ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, తమిళనాడు, పశ్చిమబెంగాల్ తదితర రాష్ట్రాలలో అత్యధికంగా పార్లమెంట్ సభ్యులను అందించే ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ చేజారిపోయింది. కాంగ్రెస్ పాలనలో వున్నవి ఇక ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రాలే! ఇందులో మహారాష్ట్రలో కాంగి పరిస్థితి అంతంతగానే వుంది. ఇక మిగిలింది ఆంధ్రప్రదేశ్ ఒక్కటే! అత్యధికంగా పార్లమెంట్ సభ్యులను అందించి, పార్టీని అన్ని విధాల ఆదుకుంటున్న రాజశేఖర్‌రెడ్డి మాటను కాదనే స్థితిలో ప్రస్తుతం ఢిల్లీ అధిష్ఠానం లేదు.

ఇక ఏ పార్టీ, ఏ పార్టీతో పొత్తు పెట్టుకుంటుందో, ఎప్పుడు దూరమవుతాయో తెలియని స్థితి. పార్టీ విప్‌ను ధిక్కరించి, పదవులను,

ముడుపులను, పరమావధిగా భావించి అమ్ముడుపోయే పార్లమెంటేరియన్లు, శాసనసభ్యులు ఉన్న దేశం మనది. దీనికి ప్రత్యక్ష సాక్ష్యం తెరాస శాసనసభ్యులే! ఇలాంటి రాజకీయ ఊసరవెల్లులతో, ఏ ధీమాతో కెసిఆర్ ఎన్నికల ప్రక్రియ ద్వారా తెలంగాణను సాధిస్తానని అనుకుంటున్నాడో తెలియదు. కాకపోతే తెలంగాణ ఒక రాజకీయ ఎజెండాగా పనిచేస్తుంది. ఈలోపు ప్రజలకు విసుగు రావచ్చు! ఆ విసుగు ఎన్నికలపై కూడా ప్రభావం చూపవచ్చు! ఇప్పటికే ఈ ప్రభావాన్ని గత ఉప ఎన్నికల సందర్భంగా తెరాస చవిచూసింది. తెలంగాణ వాదాన్ని బలపర్చాలని పదేపదే ప్రజలకు పిలుపునివ్వడం ద్వారా బలంగా వున్న తెలంగాణ వాదం మరింత బలహీన పడే ప్రమాదం కూడా లేకపోలేదు. కరీంనగర్ లోక్‌సభ ఎన్నికల ద్వారా ఈ విషయం స్పష్టమైంది కూడా.

ప్రతిసారి జరిగే ఎన్నికలకు ముందు తెలంగాణలోని అన్ని రాజకీయ పార్టీలు తెలంగాణ నినాదాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎత్తుకోవడం ఒక ఫార్స్‌గా మారింది. ఇకపోతే తెలంగాణ కోసం పనిచేస్తున్న సంస్థలున్నాయి. సంఘాలున్నాయి. వివిధ వేదికల ద్వారా తెలంగాణ గొంతును అవి వినిపిస్తున్నాయి. మేధావులు, విద్యావంతులు, రచయితలు, కళాకారులు తెలంగాణ వాదాన్ని బలపర్చాలనే నినాదాన్ని ప్రజల్లోకి బలంగా తీసుకెళుతూనే వున్నారు. వీటికి జనం స్పందన వుంది. చిక్కంతా తెలంగాణ వాదాన్ని ప్రజలు ఏ విధంగా బలపర్చాలనే స్పష్టత వీరికి లేకపోగా, ఎన్నికల ద్వారా, ఓట్ల ద్వారా బలపర్చాలనే నినాదాన్ని చెప్పకనే చెప్పుతున్నారు. ఇందులో తెరాసను వ్యతిరేకించేవారు, తూర్పార పట్టేవారు వున్నారు. వీరి కార్యక్రమాలు కూడా పరోక్షంగా తెరాసకు ఓట్లను ఆపాదించి పెడుతున్నాయి. ఢిల్లీ లాబితో గాని, కాంగ్రెస్, టిడిపి లాంటి బూర్జువా రాజకీయ పార్టీలతో జతకడితే తెలంగాణ రాదని బలంగా నమ్మేవారు ప్రత్యామ్నాయ ఉద్యమాలను నడపడంలో వైఫల్యం చెందడం, స్పష్టమైన ఉద్యమ నిర్మాణాలు లేకపోవడంతో తెలంగాణలో తెరాస గుత్తాధిపత్య రాజకీయ పార్టీగా మారిపోయింది.

తెరాస ఏర్పడిననాడే తన విధివిధానాలను కెసిఆర్ స్పష్టం చేసాడు. హింసారహితంగా, ఎన్నికల ద్వారా, ఢిల్లీ లాబీ ద్వారా తెలంగాణ సాధిస్తానని, అదే సరైన మార్గమని ఆయన ప్రకటించుకున్నాడు. ఆ మార్గానికే మొగ్గు చూపుతున్నాడు. చిక్కంతా కెసిఆర్ ఎత్తుగడలను, విధానాలను వ్యతిరేకిస్తున్న వారి గూర్చే! ప్రత్యామ్నాయ ఉద్యమాలను నడిపితే కెసిఆర్ అడ్డుతగిలేది లేదు! మనం అద్దం ముందు నిల్చొని కెసిఆర్ ప్రతిబింబాన్ని అందులో చూడాలనుకోవడమే తప్పు! అలాగని కెసిఆర్ ఏ పంథా ఎత్తుకున్నా చూస్తూ ఊరుకోవాలనిగాని, సమర్థించాలనిగాని కాదు. గద్దర్ లాంటివారు కూడా తెలంగాణ ఉద్యమాన్ని లీడ్ చేసే స్థితిలో లేదు. చివరిదాకా, అంటే తెలంగాణ ఏర్పాటయ్యే దాకా పాటనై వుంటానని స్పష్టంగా చెబుతున్నాడు. 'ఎలాంటి పోరాటాలు ఎవరి నాయకత్వం కింద' అని అడిగితే బహుశా సమాధానాలు కష్టమే! పరోక్షంగా గద్దర్ చేపట్టిన పల్లె యాత్రలుకూడా తెరాసకే లాభం చేకూర్చి పెడుతున్నాయి. ఆయన కార్యక్రమాలన్నీ ఎన్నికల సందర్భంగా జరగడంతో ఓట్లకోసమే గద్దర్ వస్తున్నాడనే సంకేతం ప్రజల్లోకి వెళ్లుతున్నది.

మిలిటెంట్ ఉద్యమాలు, వాటిని నడిపే నాయకులు లేకపోవడంతో ఎన్నికల ప్రక్రియ ద్వారా తెలంగాణ సాధిస్తాననే కెసిఆర్ మాటలకు ఎదురులేకుండా పోతున్నది. ఉద్యమాలు, పోరాటాలు లేకుండా రాజకీయ పరిష్కారాలు జరిగినట్లు చరిత్రలో రికార్డులు లేవు. చరిత్రను వక్రీకరించడం ద్వారా, తప్పుగా రాయడం ద్వారా శాంతియుత ఉద్యమాల ప్రస్తావన వస్తూవుంటుంది. గత అయిదు సంవత్సరాలుగా కెసిఆర్ ఢిల్లీ చుట్టూ తిరగకుండా ఉద్యమబాట ఎంచుకుంటె ఢిల్లీ రాజకీయాలు హైదరాబాదుకు దిగివచ్చేవి. పోరాటాలు హింసాయుతంగా వుంటాయి కాబట్టి ప్రాణ నష్టం జరుగుతుందని, ఇప్పటికే 1969 నాటి ఉద్యమంలో 370 మంది ప్రాణాలు కోల్పోయారు కాబట్టి, ఆ మార్గం వద్దని కెసిఆర్ బలంగా నమ్ముతున్నారు. ఈ విషయాన్ని కూడా ఆయన చాలా సందర్భాల్లో చెప్పారు కూడా! ఎన్నికల ప్రక్రియతో సమాంతరంగా కెసిఆర్ ఉద్యమాలను నడిపితే తెలంగాణ ఏర్పడేది. లేదా తెలంగాణ వాదాన్ని భుజాన వేసుకున్న ఇతర సంస్థలు, వేదికలైనా ప్రత్యామ్నాయ ఉద్యమాలను నడిపినా కెసిఆర్ తెలంగాణ ఉద్యమంలో అప్రధానమైపోయేవాడు. తెలంగాణలో అన్నిరకాల పోరాటాలు, ఉద్యమాలు జరిగాయి. అన్నిరకాల ఉద్యమాలకు ప్రజలు తమ మద్దతును తెలిపారు.

ఇప్పటికైనా తెలంగాణ వాదులు, రాజకీయ పార్టీలు ఉద్యమబాట ఎంచుకోవాలి. గూర్ఖాలాండ్ ఉద్యమం లాగా సహాయ నిరాకరణ ఉద్యమం చేపట్టవచ్చు! తెలంగాణలోని అన్ని ప్రభుత్వ, ప్రైవేట్, విద్యాసంస్థల బోర్డులపై 'తెలంగాణ' పేరును రాయించే ఉద్యమాన్ని చేపట్టవచ్చు! తెలంగాణ వాదినని చెప్పుకునే ప్రతి వ్యక్తి తమతమ వాహనాలకు 'తెలంగాణ' అనే స్టిక్కర్లను పెట్టుకునే ఉద్యమాన్ని లేవదీయాలి. నవతెలంగాణ పార్టీ కొంతమేరకు ఈ ప్రయత్నం చేసింది. విష సంస్కృతిని, ప్రేరేపిస్తున్న సినిమాలను, ఛానళ్లలను నిషేధించవచ్చు! తెలంగాణ వ్యతిరేకతను ప్రదర్శిస్తున్న పత్రికల్ని, రాజకీయ పార్టీలను బహిష్కరించాలనే పిలుపునివ్వవచ్చు! తెలంగాణ వ్యవహారిక భాషలోనే అన్ని స్థాయిల్లో ఉత్తర, ప్రత్యుత్తరాలు నడపాలనే పిలుపు నివ్వవచ్చు! తెలంగాణ తల్లి విగ్రహాలతోపాటు, తెలంగాణ పోరాట యోధుల విగ్రహాలను, తెలంగాణ ఉద్యమంలో అసువులు బాసిన 370 మంది అమరులను గుర్తించి, సంబంధిత జిల్లాల్లో వారి వారి విగ్రహాలను ఏర్పాటు చేయవచ్చు!

అన్నింటికన్నా ముఖ్యంగా తెలంగాణ రాజకీయ నాయకులందరిని ప్రజాఉద్యమం ద్వారా కట్టడి చేయవచ్చు! ఇవేవీ సాధ్యం కాదని భావిస్తే తెలంగాణ ఏర్పడేదాకా ఎన్నికల్లో పాల్గొనమనే ఏకైక నినాదాన్ని ఇవ్వవచ్చు! వీటిని తెరాస చేస్తుందా, ఎవరు చేస్తారనేది కాదు, ఉద్యమాలు లేకుండా తెలంగాణ సాధన సాధ్యంకాదని గుర్తించాలి. వీ

కార్మికులకు తెలియని పథకాలకు కోటాను కోట్లు కేటాయిస్తూ, చేనేతకు ఎంతో చేశామని ప్రగల్భాలు పలుకుతున్న ప్రభుత్వానికి కార్పొరేట్‌రంగంపై ఉన్న శ్రద్ధ చేనేతరంగంపై లేదని విమర్శిస్తున్నారు **బండారు జ్వాలా నరసింహం**

# హామీలు చేనేతకు - నిధులు టెక్స్‌టైల్‌కు

'ఇంటి పేరు కస్తూరి వారు ఇంట్లో చూస్తే గబ్బిలాల వాసన' గా ఉంది రాష్ట్ర ప్రభుత్వ నిర్వాకం. చేనేతకు ఎంతో చేశామనీ, ఇంక చెయ్యాల్సిందేమీ లేదనీ డాంభికాలు పలుకుతున్న ప్రభుత్వం ఈ ఆర్థిక సంవత్సరంలో చేనేతకు, జౌళి రంగానికి కేటాయించింది రు. 164.48 కోట్లు. ఇప్పటి వరకు విడుదల చేసిన మొత్తం రు. 53.22 కోట్లు మాత్రమే. దీనిలో చేనేతలకు ఖర్చు చేసింది కేవలం పది కోట్ల రూపాయలని ప్రభుత్వం లెక్కలు చెప్తోంది. చేనేతకు ఏమాత్రం సంబంధం లేని విశాఖ జిల్లాలో నెలకొల్పుతున్న లంకా బ్రాండెక్స్ కంపెనీకి పన్నెండు కోట్ల రుపాయలు కేటాయించారు.

రాష్ట్రం మొత్తం బడ్జెట్‌లో చేనేతలకు నిజంగా రావాల్సిన వాటా 0.16 శాతం. కాని కేటాయించింది 0.06 శాతం మాత్రమే. రాష్ట్రంలో 2.51 లక్షల మగ్గాలు మాత్రమే ఉన్నాయని ప్రభుత్వం తప్పుడు లెక్కలు చెబుతోంది. ఒక్క అనంతపురం జిల్లాలోనే రెండు లక్షల పన్నెండు వేల మగ్గాలు ఉన్నాయనీ, రాష్ట్ర వ్యాప్తంగా నాలుగు లక్షల మగ్గాలు, నలభై ఐదు వేల మంది చేనేత, ఉప వృత్తుల్లో జీవనం చేస్తున్నారనీ స్వతంత్ర సర్వేలో వెల్లడయిన నిజాలు.

చేనేత గ్రూపు పథకం ద్వారా పావలా వడ్డీకే రుణాలను ఇచ్చి మహిళలను లక్షాధికారులను చేస్తున్నామని ఊదర గొడుతున్న ప్రభుత్వం ఈ ఆర్థిక సంవత్సరంలో 25 గ్రూపులకు రు. 25.86 లక్షలు మాత్రమే రుణాలుగా ఇచ్చింది. ఆర్టిజన్ క్రెడిట్ కార్డుల ద్వారా ముప్పై వేలమందికి డెబ్బై ఐదు కోట్ల రూపాయలతో రుణ సౌకర్యం కల్పిస్తామని చెబుతూ, 387 మందికి రు. 96 లక్షలు మాత్రమే ఇచ్చింది. చిలపలనూలు సబ్సిడీ పది శాతం ఇస్తున్నామని చెప్తూ ఇప్పటి వరకు రు. 72.22 లక్షలు మాత్రమే సబ్సిడీగా ఇచ్చింది. ఎన్.ఎచ్.డి.సి. ద్వారా ఇచ్చే నూలు రేట్ల కంటే ప్రైవేట్ వ్యాపారుల దగ్గరే ఒక్కొక్క డబ్బీకి ఇరవై నుండి ముప్పై రూపాయల వరకు తక్కువకి నూలు దొరుకుతుంది.

సహకార సంఘాలకు పది శాతం రిబేట్ స్కీం ద్వారా రెండు సంవత్సరాల క్రితం ఇవ్వాల్సిన బకాయిలు రు. 131.03 లక్షలు ఇప్పటి వరకు చెల్లించలేదు. రాష్ట్ర వ్యాప్తంగా ప్రభుత్వం గుర్తించిన చేనేత ఆకలి చావులు, ఆత్మహత్యలు 829 మాత్రమే. కాని ఇప్పటి వరకు ఎక్స్‌గ్రేషియా 269 మందికి మాత్రమే ఇచ్చారు.

చేనేతలకు యాభై వేలమందికి హౌస్-కమ్-వర్క్ షెడ్డులు నిర్మిస్తామని వాగ్దానం చేసిన ప్రభుత్వం 283 కుటుంబాలకు మాత్రమే గృహ నిర్మాణం చేసింది. ఆర్థికంగా చితికిపోయిన చేనేత కార్మిక కుటుంబానికి ఉచితంగా 25 కిలోల బియ్యం ఇస్తున్నామంటూ, రాష్ట్ర వ్యాప్తంగా నాలుగు వందల మందికి మాత్రమే ఈ పథకాన్ని అమలు చేసింది. చేనేత రంగంలో ఉన్న 414 కోట్ల రుణమాఫీ గురించి స్పష్టమైన వాగ్దానం ఈ రోజు వరకు ఇవ్వలేదు. సహకార రంగంతో పాటు సహకారేతర రంగంలో ఉన్న కార్మికులకు కూడా ఈ రుణమాఫీ చేయాల్సిన అవసరం ఉంది. చేనేత కార్మికుల రుణవిముక్తి కోసం, రుణాల రద్దు ప్యాకేజి గురించి రాష్ట్రప్రభుత్వం ఇంతవరకు కేంద్ర ప్రభుత్వ దృష్టికి తేలేదని కేంద్ర జౌళిశాఖ సహాయ మంత్రి ఇ.వి.కె.ఎస్.ఇలంగోవన్ లోకసభలో ప్రశ్నోత్తరాల సమయంలో వెల్లడించారంటే ఈ రాష్ట్ర ప్రభుత్వానికి చేనేతపై ఎంత ప్రేమ ఉందో అర్థమవుతోంది.

చేనేత ఉద్ధరణ కోసం ఏర్పాటు చేసిన రోశయ్య కమిటీ సిఫార్సులో పవర్‌లూంకు రు. 88.40 కోట్లు, అపెరల్ అండ్ టెక్స్‌టైల్ పార్కులకు వందకోట్లు, పవర్‌లూం ఉత్పత్తుల మార్కెట్ సదుపాయం కోసం ఇరవై కోట్ల రూపాయలు కేటాయించాలని ప్రతిపాదించడం మార్కెట్‌లో చేనేత వస్త్రాల ఉత్పత్తికి ఉరివేయడమే. అపెరల్ అండ్ టెక్స్‌టైల్ పార్కుల్లో లక్షలాది మందికి ఉపాధి కల్పిస్తామని చెబుతున్న ప్రభుత్వం సిరిసిల్ల, పులివెందులలోని టెక్స్‌టైల్ పార్కుల్లో ఎంత మందికి ఉపాధి చూపించారో చెప్పాల్సిన అవసరం ఉంది.

సమీకృత చేనేత అభివృద్ధి పథకం, సమీకృత చేనేత క్లస్టర్ అభివృద్ధి పథకం, మగ్గాల ఆధునీకరణ, నూతన మగ్గాల మంజూరు, రాష్ట్రీయ స్వయం వికాస్ యోజనా పథకం, దీన్‌దయాళ్ హత్కార్ యోజనా పథకం, సమీకృత చేనేత శిక్షణా పథకం ఇలా చెప్పుకుంటూ పోతే చేనేత అభివృద్ధి కోసం లేని పథకం అంటూ ఏమీలేదు.

రెండు వందల కోట్ల రూపాయలు చేనేతలకు హౌస్ కమ్ వర్క్ షెడ్డుకు కేటాయిస్తే ఒక్కొక్క కుటుంబానికి రెండు లక్షల రూపాయల వ్యయంతో పది వేల చేనేత కుటుంబాలకు నిలువ నీడ కల్పించవచ్చు. కానీ ఆ పని మాత్రం ప్రభుత్వం చెయ్యదు. పసలేని పథకాలకు, కార్మికులకు కూడా తెలియని పథకాలకు కోటాను కోట్ల రూపాయలు కేటాయిస్తూ ఇవన్నీ కూడా చేనేత కార్మికుల జీవనోపాధిని మెరుగుపరిచేందుకు అని ప్రచారం చేసుకోవడం సిగ్గుచేటయిన విషయం.

నిత్యావసర వస్తువుల ధరలకు అనుగుణంగా కనీస వేతన చట్టాన్ని సవరించాలి. ప్రతి చేనేత కుటుంబానికి రెండు ఎకరాల సాగు భూమి ఇవ్వాలి. సహకార రంగాన్ని ప్రక్షాళన చెయ్యాలి. స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన కమిషన్ ఏర్పాటు చెయ్యాలి. జనాభా ప్రాతిపదికన బడ్జెట్ కేటాయింపులు జరగాలి. చేనేతపై సమగ్ర విధి విధానాల్ని రూపొందించాలి. చేనేత కార్మికులందరికీ విద్య, వైద్య సదుపాయాలు అందించాలి. వీ

*వ్యక్తిగత ఆస్తి మూలాల్ని, వ్యక్తిగత ఆస్తిని బలపరుస్తున్న సాంఘిక వ్యవస్థను మార్చినపుడే గ్రామీణ దళిత స్త్రీకి విముక్తి లభిస్తుందంటున్నారు* **కె. పుణ్యవతి యాదవ్**

# గ్రామీణ దళిత మహిళ - జీవన స్థితిగతులు

ప్రపంచంలోనే మహోజ్వలమైన చరిత్ర పవిత్ర గ్రామీణ భారత దేశంలో సంస్కృతి పరంగా స్త్రీని దేవతామూర్తిగా పిలుస్తారు. దేశ జనాభాలో దాదాపు సగం మంది మహిళలే ఉన్నారు. ప్రస్తుతం పితృస్వామిక కుటుంబాలుగా చలామణీ అవుతున్న గ్రామీణ వ్యవస్థలో గతంలో మాతృస్వామిక కుటుంబాలు ఉండేవి. అనగా కుటుంబ యజమానురాలిగా పూర్తి బాధ్యతలు స్త్రీలే వహించేవారు. స్త్రీకి ఈ దేశంలో ఎంత ప్రాధాన్యత ఉందంటే భారతదేశాన్ని భారతమాత అని పిలిచేంత గొప్పతనం, గౌరవం స్త్రీలకు ఉంది. కాని దేశంలో దళిత కుటుంబాలకు సంబంధించిన స్త్రీలు పలురకాల అణచివేతలకు, అవమానాలకు గురవుతున్నారు.

దళిత స్త్రీ ఒక సాంఘిక శక్తి. ఒక సంస్కృతికి ప్రతీక. ఒక చారిత్రక నేపథ్యం. కానీ దేశం ఈనాడు ఒక అస్పృశ్యురాలిగా సంక్షుభితమైన జీవనయాత్రలో ప్రయాణం సాగిస్తోంది. సామాజిక శ్రమలో ఎనభై శాతం మోస్తూ జాతీయ ఆర్థిక రంగాన్ని పరిపుష్టం చేస్తోంది. వ్యవసాయ రంగంలో ప్రముఖపాత్ర వహిస్తూ ఆనకట్టలు, భవనాలు, రోడ్ల నిర్మాణాల్లో కూడా తమ శ్రమను ధారపోస్తోంది. బట్టల మిల్లులు, బీడీ పరిశ్రమ, సిమెంట్ ఫ్యాక్టరీలు, ఆస్పత్రులు, క్వారీ పనులు ఇలా ఎన్నో రంగాల్లో పనిచేస్తోంది. ఒకవైపు ఇలా శ్రమిస్తూ మరోవైపు గృహజీవనానికి సంబంధించిన పనులన్నీ చేయడం వల్లే మొత్తం భారతీయ 'శ్రామిక శక్తి'లో ప్రధాన పాత్ర పోషిస్తున్నదనేది చారిత్రక సత్యం. పోషకాహార లోపం వల్ల బలహీనులై కనీసం వృద్ధాప్యంలో తమను పోషించడానికి ఒక్క బిడ్డైనా మిగలాలనే ఆశతో అనేకమంది బిడ్డలకు జన్మనిచ్చి రక్తహీనతతో మరింత బలహీనులవుతున్నారు. పగలంతా చెమటోడ్చి పొలాల్లో పనిచేస్తే పరిమితమైన కూలి లభిస్తోంది.

మండుటెండకు నెర్రెలు విచ్చిన భూమివి పగుళ్లలా ఆమె కాళ్లు పగిలి ఉంటాయి. తిండి చాలక కరుణార్ద్రతతో ఆమె కళ్లు గుంటలు పడి ఉంటాయి. నూనెలేక అట్టలు కట్టిన ఆమె జుట్టు, శ్రమించి కాయలు కాసిన ఆమె చేతులు, మానవతా రహితమైన ఈ దేశ గ్రామీణ అగ్రకులాల కర్కశత్వాన్ని గుర్తుచేస్తాయి. దళిత స్త్రీ ఒక సృజనాత్మక శక్తి. గ్రామాల్లో నులకను మంచానికి అల్లుటలోనూ, బట్టలు నేయడం లోనూ, తాటాకులతోనూ, ఈతాకులతో చాపలు అల్లడంలోనూ, కళా స్రవంతిగా, సంస్కృతీ భాండాగారంగా ఆమె నిరూపించుకుంది.

వేటకత్తిగా, జాలరిగా, యుద్ధ సైనికురాలిగా మానవ జీవన చరిత్రలో అనేక పాత్రలు పోషించింది కనుకనే ప్రాచీన భారతీయ పారిశ్రామికవేత్త ఈ మహిళ. తోళ్లపని, కుట్లు, నేత కుండల తయారీల వంటి పనులు చేపట్టింది. గృహ, సమాజ నిర్వహణకర్తగా ఒక ముఖ్యపాత్ర వహించింది. ఆమె రోజువారి శ్రమను పరిశీలిస్తే శ్రామిక సంస్కృతిపై ఒక పెద్ద విజ్ఞాన గ్రంథాన్ని తయారు చేయవచ్చు. రోజుకు పద్దెనిమిది గంటలు రక్తాన్ని, చెమటను ధారపోసి పనిచేసే దళిత స్త్రీ శ్రమ సోమరి భారతీయుల నిర్దయపూరిత శరీరాలను పెంచిపోషిస్తోంది. వారి శ్రమ భారతీయ ఆర్థిక సాంఘిక రంగాలకు పునాది. కాని మన మేధావులు స్త్రీల జీవితాన్ని పరిశీలించడం లేదు. జీవన విధానాన్ని పరిశోధించనంతకాలం వీరికి భారతదేశ వాస్తవికత అర్థం కాదు. తమ మానవీయ ఔన్నత్యాన్ని కించపరిచే సాంఘిక అణచివేతలోనూ ఆర్థిక సంక్షోభంలోనూ ఈనాటి దళిత స్త్రీలు ఎంతో సంఘర్షణతో జీవిస్తున్నారు.

ప్రాచీన కాలంలో భారతదేశంలో వ్యవసాయ సంస్కృతికి సంబంధించిన అంశాలన్నీ స్త్రీల జీవన విధానంలోనే మనకు ద్యోతక మవుతున్నాయి. విత్తనాలు నాటేసేటప్పుడు, కోతలు కోసేటప్పుడు వీరు పాడే పాటల్లో, మాట్లాడే భాషలో సంస్కృతి ఉంది. భారతదేశానికి మూలమైన సంస్కృతి ఉంది. భారతదేశానికి మూలమైన భౌతిక వాద తత్వశాస్త్రానికి మూలం వీళ్లే. సాంఖ్య తత్వశాస్త్రాన్ని, తాత్విక విధానాన్ని ఆచరణలో పెట్టింది దళిత స్త్రీలే. కులం పునాదుల్ని పెకిలించి కులాతీతంగా మాతృత్వాన్ని అందించిన గాథలు పురాణాల నిండా ఎన్నో ఉన్నాయి. వీరిని అణచివేసిన తరువాతనే భారతదేశంలో తత్వశాస్త్రానికి దారిద్ర్యం వచ్చింది.

భారతీయ గ్రామాలకు మూలమైన భాషా సంస్కృతి, కళలు అన్నీ దళిత స్త్రీలోనే నిక్షిప్తమై ఉన్నాయి. మానవత్వం, దాతృత్వం, సౌజన్యం, సౌహార్దం ఆమె సహజ లక్షణాలు. అందుకే ఆమె ఈ దేశానికి పునాది. సంస్కృతిని తన ఔదార్యంతో రక్షిస్తూ వచ్చింది. ఉమ్మడి జీవనాన్ని శిథిలం కాకుండా చూసింది. మాతృత్వంలో దాగి ఉన్న అన్ని దశలను యుద్ధం చేసి రక్షించింది.

భారతీయ శిల్పుల చిత్రకారుల చేతుల్లో అభివృద్ధి చెందిన కళలన్నీ ప్రాథమికంగా దళిత స్త్రీ రూపొందించినవే. సముద్రపు ఒడ్డులో ఇసుక తిన్నెల్లో చిత్రాలు గీసింది. రాతిని శిల్పంగా మలచింది. ప్రకృతి రమణీయత్వానికి అనుగుణంగా శృతిని, గతిని కలిపి పాడింది. సాహిత్యానికి మూలమైన లిపిని కూడా దళిత స్త్రీయే కనుగొన్నది. లిపికి మూలమైన అంశాల్లో ఒకటైన 'పచ్చబొట్టు'ని ఈమె మొదట ప్రారంభించినట్లు చరిత్ర తెలుపుతుంది. ఇంతటి మహోదాత్తమైన ఆ

*మానవ నాగరికతలలో గుర్రం ప్రవేశం ఎంత లోతైన మార్పులను తెచ్చిందో, ఆ తరువాత వ్యవసాయానికీ, లోహాలకూ, ఆస్తికీ ఆ మార్పులు ఎలా దారితీశాయో వివరిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# అశ్వ సంప్రదాయం - సంకర్షణలూ, సంఘర్షణలూ

మనుషులు మచ్చిక చేసిన జంతువుల్లో కుక్కలు అన్నిటికన్నా మొదట వచ్చినవి. వాటితో పోలిస్తే గుర్రాలు చాలా ఆలస్యంగా వచ్చాయి. పాత రాతియుగం నాటికి గుహల్లో గీసిన చిత్రాలను బట్టి చూస్తే వన్యప్రాణులుగా తిరిగిన గుర్రాలు మనుషులకు ఆహారంగా పనికొచ్చాయని తెలుస్తోంది. తూర్పు యూక్రేన్, కజఖ్‌స్తాన్, మధ్యరష్యా మొదలైన ప్రాంతాల్లో తిరిగే గుర్రాల మందలను వేటాడడం, పట్టుకుని మచ్చిక చెయ్యడం కష్టసాధ్యంగా ఉండేవి. గుర్రాలమీద స్వారీ చేయ్యడం ముందు జరిగిందో, గుర్రాలను బళ్ళకు పూన్చడం ముందు జరిగిందో సరిగ్గా తెలియదు కాని అప్పటికే ఎడ్లచేత బళ్ళు లాగించేవారు కనక రౌతులకన్నా గుర్రబండీలే ముందు వచ్చి ఉండవచ్చునని భావిస్తున్నారు. గుర్రాల వాడకం మొదలయాక మనుషుల జీవితాలు మారిపోయాయి. పొలం దున్నడానికీ, బరువులు లాగడానికీ, దూరప్రయాణాలకూ, యుద్ధాలకూ పనికొచ్చిన గుర్రాల పెంపకం సమాజాలనీ, నాగరికతలనీ పూర్తిగా మార్చేసింది. తరవాతి కాలంలో రౌతులుగా, యోధులుగా పేరు పొందిన మంగోల్ ఆశ్విక దళాలు వేల మైళ్ళు ప్రయాణించి దూరప్రాంతాలన్నిటినీ లోబరచుకోగలిగారు.

గుర్రాల ప్రవేశంతో మనదేశపు తొలి నాగరికతలుకూడా తీవ్రమైన పరిణామాలకు లోనయాయి. ఇవన్నీ చర్చిస్తున్నప్పుడు గుర్రాలు మన దేశానికి ఎప్పుడు, ఎలా వచ్చాయనేది ముఖ్యమైన విషయం అవుతుంది. ఆర్యులు సింధూనాగరికత కాలంనుంచీ ఉన్నారని వాదించేవారిలో కొందరు సింధు ముద్రికల మీద గుర్రాల బొమ్మలుకూడా ఉన్నాయని నిరూపించేందుకు శతవిధాల ప్రయత్నిస్తున్నారు. వీటికి అర్థంలేదు. గుర్రాలను మచ్చిక చేయ్యడమనేది మనదేశంలో జరగలేదు. మచ్చికగుర్రాలు మనదేశానికి దిగుమతి అయాయి. అంతేకాదు; గుర్రాలతో పరిచయం లేకపోవడంతో స్థానికుల సంస్కృతి క్రమంగా అంతరించిపోయింది. సింధుప్రజలకు గుర్రాలను గురించి తెలియదు. అలాగే ఇనుమును గురించికూడా సిధుప్రజలు ఎరగరు. వారిది ప్రధానంగా కాంస్యనాగరికత. తరవాత వచ్చిన ఆర్య నాగరికతలో మటుకు గుర్రాలకి విశిష్టమైన స్థానం ఉండేది. ఇది ఈ రెండు నాగరికతలకూ ఉండిన తేడాల్లో ముఖ్యమైనది.

---

దళిత తల్లి ఈనాడు గర్భవతి అయితే ఆమె కడుపులో ఉన్న బిడ్డకు జీవాన్నిచ్చే ఆహారం పెట్టుకోలేక తన బిడ్డ కడుపులోనే మరణించే పరిస్థితులకు అనేక సందర్భాల్లో నెట్టబడుతుంటే తరతరాలుగా ఈ సమాజం ఏ పరిస్థితికి నెట్టివేసిందో తెలుస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లోని అనేక ప్రాంతాల్లో జోగినీ వ్యవస్థ దళిత స్త్రీలను బాధిస్తూ ఉంది. ఆదిమ జాతులైన దళితులను ఈ సమాజం అస్పృశ్యులుగా చేసిన తర్వాత వీరిపై అనేక దురాచారాలను, మూఢవిశ్వాసాలను రుద్దింది. అందులో ఈ అమానుషమైన జోగిని ఆచారం ఒకటి. చిన్న వయస్సులోనే దేవాలయాలకు అంకితమివ్వడమనే పేరుతో వారిని 'ఊరు ఉమ్మడి' బతుకులుగా చేసి హింసించి, అనుభవించే ఈ దుర్మార్గపు ఆచారం ఇప్పటికీ మన గ్రామాల్లో ఆచరించబడుతుంది.

ఈ దేశంలో జీవితానికి సంబంధించిన ఆర్థిక, రాజకీయ, సాంఘిక కోణాలన్నింటిలోనూ దళిత స్త్రీలు దోపిడీకీ, బానిసత్వానికీ గురవుతున్నారు. వీరి కనీస వేతనం ప్రభుత్వం నిర్ణయించినప్పటికీ వాళ్ల రక్తాన్ని, స్వేదాన్ని జుర్రుకుంటున్న భూస్వాములు వారి శ్రమకు తగిన కూలి ఇవ్వడంలేదు. ఈ విధంగా దళిత స్త్రీల జీవన ప్రమాణాన్ని దిగజారుస్తున్నారు. కనుక ఈ వ్యక్తిగత ఆస్తి మూలాల్ని, వ్యక్తిగత ఆస్తిని బలపరుస్తున్న సాంఘిక వ్యవస్థను రూపుమాపే ఉద్యమంగా మారినపుడే దళిత స్త్రీల ఉద్యమం దళితులను విముక్తి చేయగలదు. భారతదేశంలోనే సంస్కరణ ఉద్యమం మధ్యతరగతి స్త్రీలను దాటి శ్రామిక స్త్రీల వరకు చేరలేకపోయింది. దళితులపై జరుగుతున్న అత్యాచారాలను, దోపిడీని ఎదిరించడానికి దళిత మహిళలు ముందు నిలిచి సింహగర్జన చేసిన ఆ స్త్రీల నుండి ఈనాడు దళిత విముక్తికై మహోన్నతమైన ఉద్యమం జనించింది. కారంచేడు సంఘటన దీనికి నాంది అయ్యింది. తరతరాలుగా అక్కడి దళితుల శ్రమశక్తిని దోచుకొని భూస్వాములు కత్తులు, గొడ్డళ్లు, బరిసెలతో దాడిచేసి తల్లులను, బిడ్డలను, భార్యాభర్తలను క్రూరంగా చంపారు. స్త్రీలపై అత్యాచారం చేశారు. కులాధిపత్య దాడికి ఎదురు తిరిగిన స్త్రీల నుండే దళిత ఉద్యమం ప్రారంభమైంది. భర్తల శవాలను ఒడిలో పెట్టుకొని ప్రభుత్వం చేయబోయిన ఆర్థిక సహాయాన్ని తిరస్కరించిన ఆ దళిత మహిళల త్యాగపూరిత ఆత్మగౌరవమే దళిత ఉద్యమానికి పునాది అయ్యింది. ఇటువంటి సంఘటనలు ఎన్నో దళిత స్త్రీల చైతన్యాన్ని సంఘటిత శక్తిని రుజువుచేశాయి. దేశంలోని దళిత స్త్రీలందరు ఉద్యమిస్తే వారి పిల్లలు, దళితపురుషులు వారికి సంఘీభావంతో నిలిస్తే దళిత విముక్తి పోరాటం తన లక్ష్యాన్ని తప్పక సాధిస్తుంది. భారత సమాజంలో అత్యధిక పీడనకు, అణచివేతకు గురైన దళిత మహిళలే ఈ విముక్తి పోరాటాన్ని ముందుకు తీసుకెళ్లగలరు. వీ

వేదసాహిత్యంలో గుర్రాలకు ప్రత్యేకత ఉంది. క్రీ. పూ. 1500 తరవాత గుర్రాలని బలి ఇచ్చే సాదా పద్ధతులూ (వాటిని తరవాత పెంచి, పెద్దచేసి అశ్వమేధయాగాలన్నారు), రౌతుల దాడులూ, గుర్రాలను పూన్చిన రథాలూ, అన్నిటి ప్రస్తావనా అందులో కనబడుతుంది. మన వేదాల్లాగే పార్శీ మతగ్రంథం జెండ్ అవెస్తాలోకూడా గుర్రాల ప్రస్తావన (అశ్వ) ఉంది. గుర్రాలు సింధునాగరికతకు చెందినవికావు. ఎందుకంటే దొరికిన అవశేషాలనుబట్టి చూస్తే క్రీ. పూ. 1700కు మునుపు సింధుప్రాంతంలో గుర్రాలున్నట్టుగా సాక్ష్యాలేవీ కనబడవు. మధ్యఆసియా పచ్చికబయళ్ళలో తిరిగే గుర్రాలు మొదటగా పశ్చిమాసియాలో క్రీ. పూ. 3000 తరవాత మచ్చిక అయినట్టుగా తెలుస్తోంది. అప్పటిదాకా కొండల్లో తిరిగే గాడిదలవంటివే వాడకంలో ఉండేవి. పశ్చిమాసియా, ఈజిప్ట్ ప్రాంతాల్లో క్రీ. పూ. 2600 ప్రాంతాల గుర్రాలను తేలికైన రథాలు లాగడానికి వాడారు.

క్రీ. పూ. 3000 నుంచీ అప్పటిదాకా బరువైన ఎద్దుబళ్ళే వాడకంలో ఉండేవి. యుద్ధాలకూ, దాడులకూ పనికొచ్చేట్టుగా బరువులేని చెక్కతో తయారై, ఆకులు కలిగిన చక్రాలతో వేగంగా కదిలే రథాలకు మచ్చికల బొమ్మల్లో గుర్రాలు కనబడవు. భాషాపరంగా చూస్తే గుర్రాలకూ, రథాలకూ వాడిన మాటలన్నీ ఇండో యూరపియన్‌పదాల్లాగే కనిపిస్తాయి. మొత్తంమీద ఈ అశ్వసంప్రదాయం పశ్చిమ, ఉత్తర దిశలనుంచి మనదేశానికి వచ్చినటువంటిది.

వేదకాలానికి పశువులూ, గుర్రాలూ సంపదకు ముఖ్యసూచకాలు. ఆర్యభాషీయుల "దానస్తుతి"లో పదివేల గుర్రాలనూ, 60 వేల గోవులనూ కోరుకున్న సందర్భం ఉందట. పదివేల గుర్రాలు ఎవరికీ ఉండేవికావు కనక దీన్ని అత్యాశకు పరాకాష్ఠగానూ, అతిశయోక్తిగానూ భావించి ఉంటారు. గుర్రాలుంటే రౌతుకూ, రథానికీ అపూర్వమైన వేగం కలుగుతుంది. గుర్రాలపై దాడిచేసి స్థానికులను దోచుకు పారిపోవడం చాలా సులువు. ఈ లూటీని వెనక్కి తెచ్చుకుని లాంఛనాలతో పంచుకునేవారు. గుర్రాలున్న ఇటువంటి 'వీరులు' అప్పట్లో ఒక విప్లవం సాధించి ఉంటారు.

అల్పసంఖ్యాకులే అయినప్పటికీ రథాలమీద వచ్చినవారికి ఎక్కువ బలం ఉండేదనీ, స్థానికులను బెదిరించి, వారిమీద పెత్తనంచేసి, కప్పాలూ, పన్నులూ వసూలుచేసి ఉంటారనీ అనుకుంటున్నారు. ఎందుకంటే పీడకులూ, బాధితులూ అందరూ ఒక ప్రాంతంలోనే ఉండేవారుకనక ముందుగా హెచ్చరికలూ, జబర్దస్తీలూ చెయ్యటం వీలయేది. ఇటువంటి దాడుల భయంవల్ల స్థానికులు క్రమంగా తమ హక్కులను కోల్పోయి ఉంటారనుకోవచ్చు. ఈ షరతులు విధించటానికీ, సంప్రదింపులు జరపటానికి కొందరు రెండు భాషలూ నేర్చినవారై ఉండేవారేమో. ఈ క్రమంలో స్థానిక భాషలతోబాటు తమ భాషను కూడా అమలులోకి తేవడం వగైరా చర్యలద్వారా క్రమేణా స్థానికసంప్రదాయాలని అంతరింపజేసి ఉంటారని కొందరు పరిశోధకుల అభిప్రాయం. తరవాతి కాలంలో అశ్వికదళాలున్నవారు క్షత్రియులుగా రూపొంది ఇతరులను అదుపుచెయ్యటానికీ, కాపాడటానికీకూడా తమ గుర్రాలనూ, రథాలనూ ఉపయోగించి ఉంటారు.

మనుషులు మొదట వాడసాగిన లోహం రాగి. క్రీ. పూ. 6500 నాటికే తూర్పుటర్కీలో మనుషులకు రాగిని గురించి తెలుసు. క్రీ. పూ. 4000లో ఈజిప్ట్‌లో రాగి పరికరాలుండేవి. రాగినీ, తగరాన్నీ కలిపితే కంచు తయారవుతుంది. వేడెక్కినకొద్దీ రాగి మెత్తబడుతుంది. కంచు వస్తువులను వేడెక్కనప్పుడు బాది గట్టిపడేట్టు చేస్తారు. ఇనుము వేడెక్కినప్పుడు గట్టిపడుతుంది. క్రీ. పూ. 2500 నుంచీ యూరప్ అంతటా కంచు వాడకంలో ఉండేది. క్రీ. పూ. 1193లో జరిగిన ట్రోయ్ ముట్టడిలో గ్రీక్ వీరులు కంచుఖడ్గాలను వాడారు. అప్పట్లో ఇనప ఆయుధాలు ప్రాచుర్యంలోకి రాలేదు. మనదేశంలో ఇనుము వాడకం క్రీ. పూ. పదకొండో శతాబ్దం తరవాతగాని మొదలవలేదని తెలుస్తోంది.

ఇనుముతో చేసిన ఇరుసులు రథాలకు పనికొచ్చాయి. ఇనుముతో తయారైన ఈటెలూ, బాణాలూ, కత్తులూ మొదలైనవన్నీ బలంగా, కంచువంటి లోహాలకంటే చవకలో తయారయేవి. సింధు నాగరికతలో ఇనుము గురించి తెలియదు కనక అక్కడికి ఉత్తర, పశ్చిమ దిక్కులనుంచి వచ్చిన ఆర్యభాషీయులకు ఇనుము వాడకం తెలియడం లాభించి ఉంటుంది. గుర్రాలూ, అశ్వారూడులూ, రథాలూ, ఇనప ఆయుధాలూ అన్నీ కలిసి మొత్తంమీద అవన్నీ ఉన్న వారికి అంతులేని శక్తిని కలిగించి ఉంటాయి. "ఒక జాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మం" అమలులోకి వచ్చి ఉంటుంది. పదహారో శతాబ్దంలో ఇదే పద్ధతిలో స్పెయిన్ తదితర దేశాలవారు దక్షిణఅమెరికా తెగలను సులువుగా ఓడించగలిగారు.

సింధుప్రజలు ఎంతో ఉన్నత నాగరికతను సాధించినప్పటికీ ఈ ధాటికి నిలవలేకపోయి ఉంటారు. ఇదేమీ యుద్ధంలాగా జరగకపోయినప్పటికీ అశ్వికబలం కలిగిన మూఠాలది క్రమంగా పైచెయ్యి అయిఉంటుంది. కత్తులూ, గుర్రాల సహాయంతో ఆర్యభాషీయుల ప్రాబల్యం పెరగడం, అతి ప్రాచీనమైన సింధునాగరికత కాలక్రమాన నామరూపాలు లేకుండా అంతరించిపోవడం జరిగాయి. సింధునాగరికత విలసిల్లుతున్న కాలంలో ఆ ప్రాంతాలకు ఉత్తర, పశ్చిమ దిశలనుంచి వచ్చిన ఆర్యభాషీయులు ప్రధానంగా పశుపాలకులైన ద్రిమ్మరులవంటివారు. వారి జీవితాలను వర్ణించిన తొలి వేదసాహిత్యంలో పెద్ద నగరాలూ, వాటి నిర్మాణాసూత్రాలూ, విస్తృత వ్యవసాయవ్యవస్థా, ధాన్యాగారాలూ, విదేశాలతో జరిపిన వాణిజ్యమూ వగైరాల ప్రస్తావన ఏమీ ఉండదు. పశువులూ, ఆలమందల గురించి ఉన్నంతగా పంటసాగుకు సంబంధించిన విషయాలేమీ కనబడవు. ఇవన్నీ పట్టించుకోకుండా వేదాలను కేవలం కళ్ళకద్దుకుంటూ ఉండేవారికి సమాజ పరిణామం గురించిన ఆసక్తి ఉండకపోవచ్చు.

ఒకటి పశుపాలనమీదా, మరొకటి వ్యవసాయంమీదా ప్రధానంగా ఆధారపడిన ఈ రెండు విభిన్న సంస్కృతులు పరస్పరం ఎలా సంఘర్షించాయో మనకీనాడు పరోక్షంగా మాత్రమే తెలిసే అవకాశాలున్నాయి. మన పురాణాల్లోనూ, తత్వధోరణిలోనూ తరవాతి కాలంలో కనబడే ఇటువంటి విషయాలన్నిటికీ మూలాలు క్రీ. పూ. 1500 లోనే ఏర్పడినటువంటివి. ఉదాహరణకు దేవతలూ, రాక్షసులూ ఎవరు? అసురులంటే ప్రాచీన ఇండోఇరానియన్ భాషలో దైవికశక్తి ఉన్నవారని అర్థం. జొరాష్ట్రియన్ మతగ్రంథమైన జెండ్‌అవెస్తాలో అహురమజ్ద అనే సృష్టికర్త ప్రస్తావనద్వారా ఈ సంగతి మనకు తెలుస్తోంది. అలాగే వారికి దైవ శబ్దం పాపిష్టిది. (తెలుగులో కూడా దైవం అనే మాటకు దయ్యం వికృతి). తమకు నచ్చని స్థానికులను

అసురులూ, రాక్షసులుగా భావిస్తూ, అగ్నిహోత్రమూ, యజ్ఞవిధులూ ఎరగనివారి సంస్కారాన్ని ఈసడించుకునే ధోరణి మన వేదవాఙ్మయంతో మొదలై ఉంటుంది.

రాక్షసుల నగరవైభవాన్ని మాత్రం మనవాళ్ళు కాస్త అయిష్టంగానే అంగీకరిస్తారు. దేవతల శిల్పి విశ్వకర్మకన్నా రాక్షసశిల్పి మయుడు కాస్త గొప్పవాడు. మయసభ అద్భుతమైన కట్టడం. సింధునాగరికత వ్యవసాయంమీద ఆధారపడినట్టిది. ఎందుకంటే క్రీ. పూ. 6000 ప్రాంతాల సింధునదికి పశ్చిమంగా కొండ కనుమల్లో చిన్న చిన్న పల్లెల్లో స్థిరపడ్డ ప్రజలు రాతిపనిముట్లతో ప్రాథమిక స్థాయిలో ధాన్యాలు పండించడం మొదలుపెట్టారు. దానితోపాటుగా మేకలూ, గొర్రెలూ, బర్రెలవంటి జంతువుల పెంపకం, రాతిపూసలూ, ఆభరణాల తయారీ, ఎగుమతితో చిన్నపాటి వర్తకమూ కూడా మొదలయాయి. మూడువేల ఏళ్ళకుపైగా అవిచ్ఛిన్నంగా కొనసాగిన ఈ పరిణామాలే మొహెంజోదడో, హరప్పావంటి పెద్ద నగరాల నిర్మాణానికీ, గొప్ప నాగరికతకూ కారణమయాయి.

భూమినీ, దాని ఉత్పాదకతనూ నమ్ముకున్న ఈ ప్రజల మతభావనలన్నీ మాతృస్వామ్య దిశగా రూపొందడంలో ఆశ్చర్యంలేదు. "బీజం" నాటాక పిల్లలకి జన్మనిచ్చే తల్లికీ, ప్రాణాధారమైన ధాన్యాన్ని ఉత్పత్తి చేసే భూమికీ కనిపించిన పోలికలు ఆ యుగంలో సమాజాలను గాఢంగా ప్రభావితం చేశాయి. ఒకదానితో ఒకటిసంబంధం లేనటువంటి అనేక ప్రాంతాలలో ఇది కనిపిస్తుంది. వారిలెక్కన సారవంతమైన నేల సంతానవతి కాగలిగిన స్త్రీలాంటిది. ఈనాటికీ మన గొబ్బెమ్మల చుట్టూ నాట్యాలు చేసేది ఈడేరిన కన్నెపిల్లలే. ఆధునిక అవగాహన ఏమాత్రమూ లేని పాతకాలంలో కన్నెపిల్లలనూ, ఋతుస్రావ సమయంలో వారి రక్తాన్నీ అప్పటివారు ఉత్పాదకతకు చిహ్నాలుగా భావించేవారు. ప్రకృతి ప్రధానమైన ఈ సంప్రదాయం భౌతికవాదవైఖరి కలిగిన లోకాయత (చార్వాక) తత్వధోరణికి దారితీసింది. అమ్మతల్లిని ఆరాదించే ఈ సంస్కృతితో పోలిస్తే గొడ్లను తోలుకుంటూ, సంచారం జీవితం గడిపే ఆర్యభాషీయుల తెగల వైఖరి చాలా భిన్నంగా ఉంటుంది.

పచ్చగడ్డి మైదానాలు వెతుక్కుంటూ, కొంతవరకూ వేటపై ఆధారపడి తిరిగిన ఆర్యభాషీయుల పితృస్వామ్య బృందాలలో పురుషులదే పైచెయ్యి. వీరికి వేగంగా పోయే రథాలూ, గుర్రాలూ, విల్లమ్ములూ, పోరాటవైఖరీ అన్నీ ఉండేవి. ఉదాహరణకు ఇంద్రుడు కోటలనూ, నగరాలను నాశనం చెయ్యడంలో దిట్ట; తాగుబోతుకూడా. నగరాలన్నీ సింధునాగరికతవే కనక జరిగిందేమిటో చూచాయగా ఉహించుకోవచ్చు. ద్రిమ్మరులుగా జీవించేవారు కనక పొలాలవంటి స్థిరాస్తులూ, గాదెల్లో ధాన్యం దాచుకోవడం వగైరాలేవీ ఆర్యభాషీయులెరగరు. వీరిలో స్త్రీలు పిల్లలతో అవస్థలుపడుతూ, నిత్యమూ కదులుతూ ఉండే తండాల పాలిటికి "గుదిబండల" స్థాయిలో ఉండేవారు. అందుకే ఎన్ని శతాబ్దాలు గడిచానా, పితృస్వామ్య ధోరణి ఉండే ఆర్యమతంలో స్త్రీలది నీచమైన స్థానం.

ఇటువంటి తెగలన్నిటికీ వ్యవసాయసంస్కృతికి భిన్నమైన ఒకరకమైన తాత్వికదృక్పథం ఉండేది. మొదటినుంచీ వీరి దేవతలందరూ పురుషులే. వరుణుడూ, అగ్నీ, ఇంద్రుడూ మొదట్లో వీరికి ఆరాధ్యులు. ప్రకృతిని ప్రతిబింబించే ఈ దేవతలందరిలోనూ ప్రధానంగా కనబడేది వినాశాన్ని కలిగించగలిగిన శక్తి. ఈ సంప్రదాయంలో బలహీనులకు స్థానం లేదు. వీరికి అగ్ని చాలా ముఖ్యమైనది కనక అది ఆరిపోకుండా వెలుగుతూ ఉండాలి. నెగళ్ళచుట్టూ చేరి పాటలు పాడుతూ, నాట్యాలు చేస్తూ వీరగాధలు వినిపించే ఇలాంటివారంతా నిరక్షరాస్యులే. వీరి సాహిత్యమంతా మౌఖికమే. పట్నవాసమూ, వాణిజ్యమూ, సరుకుల లెక్కలూ, కొలమాన పద్ధతులూ, ఎగుమతి చేసే బంగాలమీద గుర్తులూ, ముద్రలూ ఇవేవి వీరికి తెలియవు, అక్కర్లేదుకూడా. మనుషుల శక్తిసామర్థ్యాలపై ఆధారపడిన ఈ జీవితం తరవాతికాలంలో ప్రకృతి మాయ అనీ, పురుషుడే ప్రధానమనీ భావించే వేదాంతధోరణికి దారితీసింది.

ఇటువంటి సంస్కృతి వ్యవసాయం చేసుకుంటూ నగరాల్లో స్థిరజీవితాలు గడుపుతున్న ప్రజలతో తలపడినప్పుడు ఏమవుతుంది? పశుపాలకుల ప్రపంచమంతా పశువులకు సంబంధించిన విషయాలే. వారికి ఆస్తి అంటే గోవులే. (ఉత్తరాంధ్రలో నేటికీ పశువులను సొమ్ములు అంటారు). కుటుంబసముదాయానికి మారుపేరు గోత్రం. గోష్ఠి అంటే సంఘం, సభ అనే అర్థాలున్నాయి. వేద సాహిత్యంలో ఇతరులపై దాడిచేసి గోవులను దోచుకుపోవడం గొప్పదిగా వర్ణించబడింది. అందుకే గవిష్టి అంటే కయ్యానికి కాలుదువ్వడమనే అర్థం ఉంది. మొదట్లో ఇటువంటి గోగ్రహణాలకే పరిమితమైన ఈ రెండు సంస్కృతుల సంకర్షణ కాలక్రమేణా మారసాగింది.

శతపథబ్రాహ్మణంలో అసురులు స్థిరాస్తి కలిగి వ్యవసాయం చేసేవారని చెప్పబడింది. పశుపాలకులూ, వ్యవసాయదారులూ పరస్పరం సహకరించుకుని లాభాలు పొందసాగారు. పశువులకు పొలాలవల్ల మేత దొరకడం, వాటివల్ల రైతులకు ఎరువూ, పాడీ వగైరాలన్నీ లభించడం మొదలైంది. పాత హడప్పా నాగరికతవల్ల లభించని భద్రతకై వ్యవసాయవర్గంవారు పశుపాలకుల శరణు కోరిఉండవచ్చు. స్థానికులను కాపాడడంలో విఫలమైన పాత సంప్రదాయం క్రమంగా కనుమరుగైపోయి ఉంటుంది. ఇరువర్గాల మధ్యవివాహ సంబంధాలూ, ఆచార వ్యవహారాల సమ్మేళనం వగైరాలు ఏర్పడ్డాయి. క్రమంగా రెండు భాషలమధ్యా సంపర్కం పెరిగింది. వ్యవసాయానికి సంబంధించిన పదాలన్నీ స్థానికభాషనుంచి సంస్కృతిలోకి వచ్చిచేరాయి. అంతులేకుండా జరిగిపోతున్న సాంకర్యం కారణంగా తరవాతి కాలంలో పాణినివంటివారు భాషకు నిర్దుష్టమైన నిబంధనలనూ, సూత్రాలనూ ఏర్పరచవలసివచ్చింది.

చరిత్రలో ఇటువంటి ఇతర సంఘటనలుకూడా కనబడతాయి. పాలస్తీనాలోని జోర్డాన్ నదికి పశ్చిమాన క్రీ. పూ. 2000 ప్రాంతాల కనాన్ ప్రజలు వ్యవసాయం చేసుకుంటూ ఉండేవారు. వీరిపై దండెత్తివచ్చిన ఇజ్రాయిల్ ప్రజలతో వీరికి ఏర్పడిన సంపర్కంవల్ల హీబ్రూభాష రూపొందినట్టుగా తెలుస్తోంది. తొలి నాగరికతలు తలెత్తుతున్న దశల్లో కొందరు ప్రజలు ముందుగా వ్యవసాయాన్నీ, స్థిరజీవితాలనీ మొదలుపెట్టడం, సంచారజీవితాలు గడుపుతున్న ఇతరులు వారితో సంఘర్షించగా కొత్త సంప్రదాయాలు ఏర్పడటం జరుగుతూ ఉండేది. క్రీస్తుశకంలో కూడా బర్బరుల చేతిలో గొప్ప నాగరికతలు కుప్పకూలాయి. మధ్యయుగంలో మంగోల్ దళాలు పశ్చిమాసియాదాకా దండెత్తి వచ్చి అక్కడి వ్యవస్థలని తారుమారు చేసి, చరిత్ర గతిని మార్చెయ్యడం మనకు తెలుసు. అలాగే దాడులూ, దండయాత్రలూ జరగకపోయినా ఆర్య, ద్రావిడ సంప్రదాయాలమధ్య జరిగిన ప్రక్రియలు మనదేశాన్ని ఎంతో ప్రభావితం చేశాయి.

*తొలి తరం జపనీస్ మార్క్సిస్ట్ అర్థశాస్త్రవేత్త* ***హాజిమె కవాకామి*** *(1879 – 1946) క్యోటో ఇంపీరియల్ యూనివర్సిటీలో అర్థశాస్త్ర అధ్యాపకుడుగా పనిచేశారు. దేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపకులలో ఒకరుగా ఉన్నారు. స్టడీస్ ఆఫ్ సోషల్ ప్రాబ్లెమ్స్ అనే రాజకీయార్థిక పత్రికను నడిపారు. నాలుగు సంవత్సరాల పాటు జైలు శిక్ష అనుభవించారు. జర్మన్ భాష నేర్చుకొని, 'దాస్ కాపిటల్'ను జపనీస్‌లోకి అనువదించారు. వ్యాసాలు, నవలలు, కవిత్వం, ఆత్మకథ వంటి అనేక సాహిత్య ప్రక్రియలలో కృషి చేసి అసాధారణమైన పాఠకాదరణ ఉన్న రచయితగా పేరుపొందారు. ఆయన 1928లో జపనీస్‌లో రాసిన 'మార్క్సిస్ట్ రాజకీయార్థిక శాస్త్రం' మొదటి అధ్యాయానికి మైఖెల్ షావుర్త్ చేసిన ఇంగ్లిష్ అనువాదపు తెలుగు సేత.*

# రాజకీయార్థిక దృక్పథం - శాస్త్ర ప్రతిపత్తి

### శాస్త్ర కర్తవ్యం – వస్తువుల రూపసారాలు

జపాన్‌లో ఇటీవలనే సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. పోలీసు శాఖ చేసిన సర్వే ప్రకారం మొత్త చెల్లుబాటు అయ్యే 95.8 లక్షల ఓట్లలో కార్మికవర్గ రాజకీయ బృందాలకు వచ్చిన ఓట్ల సంఖ్య నాలుగు లక్షల డెబ్బై వేలు మాత్రమే. దీని అర్థం ఏమంటే దేశ పౌరుల్లో 95 శాతం మంది బూర్జువా పార్టీలకే తమ మద్దతు తెలిపారు. కేవలం 5 శాతం మంది మాత్రమే కార్మిక వర్గ పార్టీలను సమర్థించారు.

వాస్తవ సమాజ స్థితికి పూర్తిగా తారుమారు అయిన ప్రతిబింబం మనకు ఇక్కడ కనబడుతుంది. దేశంలోని సంపన్నులకు, బడా భూస్వాములకు అంటే ఒక అత్యల్ప సంఖ్యాకవర్గానికి, దేశ జనాభాలో దాదాపు ఐదు శాతానికి ప్రాతినిధ్యం వహించే రాజకీయ పక్షాలు మొత్తం ఓట్లలో అత్యధికంగా 95 శాతాన్ని గెలుచుకోగలిగాయి. కాగా దేశ జనాభాలో 95 శాతంగా ఉన్న పేదవారికి ప్రాతినిధ్యం వహించే రాజకీయ పార్టీలేమో కేవలం ఐదు శాతం ఓట్లు మాత్రమే సంపాదించగలిగాయి. వాస్తవికత సారాంశం గురించి అత్యధిక జన బాహుళ్యానికి తలకిందుల అవగాహన ఉన్నందువల్లనే ఇటువంటి ఫలితం వస్తుంది.

చుట్టూరా వ్యాపించి ఉండే సాధారణ జ్ఞానానికి ప్రతికూలంగా పని చేయడమే ప్రతి శాస్త్రానికి బాధ్యతగా ఉంటుంది. ఏ సామాన్య మానవుడైనా మామూలు ఆలోచనతో ఒక వస్తువును ఉన్నది ఉన్నట్లుగా గ్రహించగలిగితే ఆ అవగాహన శాస్త్రీయ పరిశోధన మీద ఆధారపడినది కాకపోతే, అసలు శాస్త్రం అనేదానికి అవసరమే ఉండదు. కానీ సర్వ సాధారణంగా మామూలు మనిషి ఆలోచించేది వాస్తవికతా సారాంశానికి తలకిందులుగా ఉంటుంది. అందువల్లనే ఏ విషయాన్నైనా శాస్త్రీయంగా పరిగణించేటప్పుడు మన మామూలు ఆలోచనను తలకిందులు చేయవలసిన అవసరం వస్తుంది. అందువల్లనే శాస్త్రం ఎల్లప్పుడూ సాధారణ జ్ఞానానికి వ్యతిరేకంగా పోరాడవలసి వస్తుంది. అందుకే సాహసికులు మాత్రమే నిజమైన శాస్త్రవేత్తలు కాగలుగుతారు.

నేనిక్కడ ఒక మామూలు, సులభంగా అర్థమయ్యే ఉదాహరణ ఇస్తాను. భూగోళం తన అక్షం మీద తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. అదే వాస్తవం. అందుకు భిన్నమైనది వాస్తవం కాదు. కానీ మన కళ్లకు కనబడేది ఏమంటే భూగోళం నిశ్చలంగా ఉన్నట్లు సూర్యుడే భూమిచుట్టూ తిరుగుతున్నట్టు. మన దృష్టి క్షేత్రంలో ప్రతిఫలించే ప్రకారం సూర్యుడు ప్రతి ఉదయం తూర్పున ఉదయిస్తాడు. ప్రతి సాయంత్రం పడమట అస్తమిస్తాడు. ఇలా కనబడుతుంది. కనుకనే మనం నివసిస్తున్న ఈ భూగోళం కూడా చలనంలో ఉన్నదని ఏ ఒక్కరూ అనుకోలేదు. ఈ దృగ్గోచర రూపాలన్నీ గమనించిన వారి చైతన్యం, అంటే, కంటికి కనబడే రూపాన్ని మాత్రమే గుర్తించిన వారి చైతన్యం. నిజానికి ఆ విషయపు సారాంశానికి లేదా సత్యానికి పూర్తిగా తలకిందులు. ఆ చైతన్యమే వారి పొరపాటుకు మూలం. ఆ పొరపాటు వల్లనే సాంస్కృతిక అభివృద్ధి మహా ప్రతిబంధకాలను ఎదుర్కొంది.

ఇంకో ఉదాహరణ చూద్దాం. మద్యం సేవించిన మనిషి ముఖం ఎర్రబడుతుంది. మంచి చలిలో కూడా వెచ్చదనాన్ని, ఉక్కపోతను అనుభవిస్తాడు. ఒంటిమీద దుస్తులు తీసెయ్యాలనో, కిటికీలు తెరవాలనో అనుకుంటాడు. అతన్ని చూసే మరొకరు అతని శరీరం వెచ్చబడిందేమోనని అనుకోవచ్చు. వాస్తవంగా మద్యం సేవించిన మనిషి శరీర ఉష్ణోగ్రత తగ్గిపోతుంది. ఆ విషయం ఎంతోమంది నిపుణులు చేసిన ఎన్నో ప్రయోగాలలో రుజువైంది. ఒక థర్మామీటర్ ఉపయోగించి మనంతట మనం కూడా ఆ విషయం తెలుసుకోవచ్చు. మద్యం తాగిన వ్యక్తి ఎందుకు వెచ్చదనాన్ని అనుభవిస్తాడంటే మద్యం ప్రభావం వలన అతని నరాలకు చలిని అనుభవించే శక్తిపోతుంది. మన చర్మంలో చలికి ప్రతిస్పందించే నరాలుంటాయి. అవి వార్తాహరులుగా పనిచేసి చుట్టూ చలిగాలి ఉందని మెదడుకు సమాచారాన్ని అందజేస్తాయి. కానీ ఆ మనిషి మద్యం సేవించినపుడు ఆ వార్తాహరులకు మత్తెక్కుతుంది. నిద్రకు పడతారు. శరీర ఉష్ణోగ్రత తగ్గిపోతున్నప్పటికీ దాని విషయమై ఏదైనా చేయవలసి ఉందనే సమాచారం మెదడుకు అందించవలసిన వారుండరు. చలిని గ్రహించే శక్తి బలహీనపడింది కనుక నిజంగా శరీర ఉష్ణోగ్రత తగ్గినప్పటికీ ఆ వ్యక్తి వెచ్చదనాన్నే అనుభవిస్తుంటాడు.

ఒక దృగ్గోచర రూపానికి తలకిందులుగా దాని సారాంశం ఉంటుందని చెప్పడంతోనే శాస్త్రం పని అయిపోదు. రూపానికి, సారానికి పరస్పర వ్యతిరేకత ఎందుకు ఉన్నదో వివరించే బాధ్యత కూడా శాస్త్రానిదే. సూర్యగోళం కాక భూగోళమే చలనంలో ఉన్నదని బోధించడంతోపాటే శాస్త్రం మన కళ్లు ఎందుకు పొరపాటుగా సూర్యుడే చలనంలో ఉన్నట్లు, భూమి స్థిరంగా ఉన్నట్లు చూపుతాయో కూడా వివరిస్తుంది. సారానికి, దృగ్గోచర రూపానికీ మధ్య గతితార్కిక ఐక్యత ఉంటుంది. అంటే ఇదే.

వ్యవస్థను కాపాడే రాజకీయ పార్టీలను నడుపుతున్న వ్యక్తులు వారు దేశ ప్రయోజనాల కోసమో, ప్రజా సంక్షేమం కోసమో పనిచేస్తున్నామని అనుకోవచ్చు. కానీ వారు తమ గురించి తాము ఏమనుకుంటున్నారో దాన్ని బట్టే వారిని అంచనా కట్టలేం. తనను తాను మంచివాడుగా భావించుకునే వ్యక్తి అన్ని సందర్భాల్లోనూ మంచివాడు కాకపోవచ్చును. తనను తాను వెచ్చగా ఉన్నాననుకునే తాగుబోతులో

వాస్తవంగా శరీర ఉష్ణోగ్రత పడిపోతూ ఉంటుంది. పాలకవర్గ పార్టీలు తమ ప్రయోజనాల కొరకే పనిచేస్తున్నాయని నమ్మే ప్రజలు కూడా చాలామందే ఉండవచ్చు. తాగుబోతు వెచ్చగా ఉన్నాడని చుట్టూ ఉన్నవాళ్లు అనుకోవడానికి, సూర్యుడు తూర్పున ఉదయించినట్లు, పడమట అస్తమించినట్లు కనబడడానికి తేడా లేదు.

ఎవరైనా మీతో సూర్యుడే చలనంలో ఉన్నాడని చెప్తే మీ కళ్లకు కూడా అది నిజమేననిపిస్తుంది. ఎక్కువ మంది ప్రజలు ఈ వివరణ ఆమోదయోగ్యమని భావించడం అందువల్లనే. తాగితే వొళ్లు వేడెక్కుతుందని చాలామంది అనుకోవడం అందువల్లనే.

ఈ కారణం వల్లనే ప్రజలను మోసగించడం చాలా సులభం. ఒక అబద్ధం చెప్పడం సులభం. ఒక వాస్తవికమైన వివరణ సంక్లిష్టంగా ఉంటుంది. తమ పక్షాన అధికారం, రాజ్యాంగ యంత్రం, ధన బలం ఉన్న వాళ్లు విరివిగా అబద్ధాలు ప్రచారం చేస్తారు. ఆ అధికారాలు ఏమీ లేనివాళ్లు ఇతరులకు సత్యాన్ని చెప్పి ఒప్పించడం అంత సులభమైన పనేమీ కాదు. ఇక వ్యక్తిగత భావ ప్రకటనా స్వేచ్ఛ మీద తీవ్రమైన ఆంక్షలు ఉన్న సందర్భంలో అది ఇంకా కష్టం.

పాలకవర్గ పార్టీలు, వ్యవస్థను కాపాడే పార్టీలు, ధనికులకు, భూస్వాములకు ప్రాతినిధ్యం వహించే పార్టీలు, ఆ అయిదు శాతం జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తూ కూడా 95 శాతం ఓట్లు గెలుచుకునే పరిస్థితి, ఆస్తి లేని 95 శాతం మంది ప్రజలకు ప్రాతినిధ్యం వహించే పార్టీలు 5 శాతం ఓట్లు మాత్రమే గెలుచుకునే పరిస్థితి ఉండడానికి కారణాలు ఇవే. పాలకవర్గ పార్టీలు ప్రజా బాహుళ్యాన్ని చైతన్యరహితంగా ఉంచడానికే ప్రయత్నిస్తాయి. ఆ ప్రజలు తమ చుట్టూ ఉన్న వాస్తవికతను సత్యానికి విరుద్ధమైన రూపంలోనే గ్రహించే భ్రమలలో ఉంటారు.

ప్రకృతి అంశాలలోనైనా, సామాజిక అంశాలలోనైనా చాలా తరచుగా ఇటువంటి భ్రమలు ఆయా వస్తువుల సారాంశాన్ని తలకిందులుగా చూపే భ్రమలు కొనసాగుతుంటాయి. అటువంటి భ్రమలను కూలదోసే అర్థంలోనే శాస్త్రం విప్లవకరమైనదిగా ఉంటుంది. సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నాడనే అభిప్రాయాన్ని కూలదోసి భూగోళమే చలనంలో ఉన్నదనే వాస్తవాన్ని ప్రకటించడం నిజంగా ఒక విప్లవకర కర్తవ్యం. అదే విధంగా రాజకీయార్థ శాస్త్ర రంగంలో మార్క్స్ సాధించినది కూడా అటువంటి విప్లవ కర్తవ్యమే.

కానీ, వ్యవస్థీకృత రాజకీయ అధికారానికి ఎప్పుడూ ప్రజలలో ఉన్న భ్రమలను అవకాశంగా వాడుకోవడంలోనే ప్రయోజనం ఉంటుంది. ఆ అధికారం అటువంటి భ్రమలను, భ్రమాజనిత ఆలోచనలను పెంచి పోషించడంలోనే శ్రద్ధాసక్తులు కనబరుస్తుంది.

ఆ లక్ష్యాన్ని సాధించడానికే ప్రతి ప్రచార సాధనాన్ని, పాఠశాలల్ని, యువజన బృందాలను, మత సంస్థలను, వార్తా పత్రికలను, పత్రికలను, పుస్తకాలను వగైరా అన్నింటిని వాడుకుంటుంది. ఇటీవలి సాధారణ ఎన్నికలలో కూడా పాలకవర్గ పార్టీలకు చెందిన అనేకమంది సభ్యులు లెక్కలేనన్ని వేదికల మీది నుంచి చేసిన ఉపన్యాసాల పరంపర అంతా సాధించదలచినది ఆ లక్ష్యాన్నే. 'కార్మికవర్గ రాజకీయాల ప్రాథమికాంశాలు' అనే పుస్తకంలో చెప్పినట్లు 'మన కష్టాల కారణాలు ఏమిటో దాచిపెట్ట బడినపుడు, ఆ కారణాలను ఎదుర్కొనే శక్తి ప్రజలకు లేనపుడు, ఆ కష్టాలతో ఇబ్బందులు పడుతున్న ప్రజల ముందు ఉన్నది ఒకటే మార్గం. తమ శక్తినంతా ఉపయోగించి ఆ పరిస్థితినే మార్చివేయడం'. ఆ పరిస్థితి పాలకవర్గాలకు చాలా బాగా సరిపోతుంది. అందువల్లనే వ్యవస్థీకృత అధికారం ఎల్లవేళలా కొత్త శాస్త్రానికి వ్యతిరేకంగా ఉంటుంది. ఇటీవలి ఎన్నికల్లో మన భావప్రకటనా స్వేచ్ఛమీద అతి తీవ్రమైన ఆంక్షలు విధించబడ్డాయి. ఎన్నో సందర్భాలలో నేను కూడా ప్రత్యక్షంగా ఆ ఆంక్షలను ఎదుర్కొన్నాను.

శక్తిమంతమైన వ్యవస్థీకృత అధికార వర్గాలకు వ్యతిరేకంగా పోరాడటం ద్వారా మాత్రమే కొత్త శాస్త్రం అభివృద్ధి చెందుతుంది. సూర్యుడు భూమిచుట్టూ తిరగడం లేదని, భూమే తిరుగుతుందని గతంలో ప్రకటించిన మేధావులను చెరసాలల్లో నిర్బంధించారు. మనం నివసిస్తున్న ఈ భూగోళం స్థిరంగా ఉందన్న ఆలోచన వదులుకోమని, భూగోళం పరిభ్రమించగలదని, నిజంగా చలనంలో ఉన్నదని సాహసికంగా ప్రకటించిన మేధావులను చూసి ఆనాడు పాలకవర్గాలు భయపడి వణికిపోయాయి. అటువంటి పనినే ఇవాళ సాంఘిక అంశాల గురించి ఎవరైనా చేయవచ్చు. సాంఘిక అంశాలంటే ప్రజల నిత్య జీవిత ప్రయోజనాలతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉన్న రంగం. అందువల్ల అక్కడ ఎవరైనా కొత్త శాస్త్రీయ అవగాహనను ప్రకటిస్తే వాళ్లమీద విమర్శలు, నిందలు, అపార్థాలు, ఒత్తిడి వగైరా వెల్లువెత్తుతాయి. ఆ అవగాహన పట్టించుకోదలచిన వారు అందుకు సిద్ధంగా ఉండాలి.

'రాజకీయార్థిక శాస్త్ర రంగంలో స్వేచ్ఛాయుతమైన, శాస్త్రీయమైన పరిశోధన కేవలం ఇతర రంగాల లాంటి శత్రువులను మాత్రమే తయారు చెయ్యదు. ఇక్కడ పరిశీలిస్తున్న అంశం ప్రత్యేక స్వభావం వలన వైరి వర్గంలోకి, మానవ హృదయంలో ఉండే అత్యంత హింసాపూరితమైన, దారుణమైన, విషపూరితమైన ఉద్వేగాలన్నీ ఒక్కమాటలో వ్యక్తిగత స్వార్థపు విద్వేషాలన్నీ పోగుపడతాయి' అన్నాడు మార్క్స్. కాపిటల్ మొట్టమొదటి జర్మన్ కూర్పుకు రాసిన ముందు మాటలో తన పుస్తకపు 'అంతిమ లక్ష్యం' 'ఆధునిక సమాజపు అర్థికచలన నియమాన్ని బహిరంగ పరచడమే' అన్నాడు. ఇక్కడ ప్రస్తావించిన ఆర్థిక చలన నియమం భూ పరిభ్రమణాన్ని నిర్దేశించే భౌతిక నియమం వంటిదే. తాము నివసిస్తున్న భూగోళం ఎంత మాత్రమూ కదలదని ఒకప్పుడు ప్రజలు ఎట్లా నమ్మారో సరిగ్గా అట్లాగే ఇవాళ కూడా ప్రజలు తాము నివసిస్తున్న ఆలోచనకు లోబడిపోయారు. కానీ ఎప్పటికీ మారనిదిగా కనబడేది చలనానికి వీలైనదని, వాస్తవంగా చలిస్తున్నదని కాపిటల్ మనకు బోధిస్తుంది. 'ఒక నిర్దిష్ట సామాజిక నిర్మాణం పుట్టుక, మనుగడ, పెరుగుదల, అంతర్ధానాలను, దాని స్థానంలో మరొక ఉన్నతమైన సామాజిక నిర్మాణాన్ని పునఃస్థాపితం చేసే, నిర్దేశించే ప్రత్యేక నియమాలను కాపిటల్ వెల్లడిస్తుంది. భ్రమల మీద ఆధారపడి నిరుత్సాహంలో కూరుకుపోయిన పీడితులను మేల్కొల్పే పుస్తకం కాపిటల్. అది వారికి వారి సమస్యల కారణాలను విశదీకరిస్తుంది. అదే సమయంలో ఆ పుస్తకం వారికి ఆ సమస్యలను తుడిచిపెట్టే అవకాశాన్ని, మార్గాన్ని సూచిస్తుంది. తద్వారా అది వారిలో ఆశను రేకెత్తిస్తుంది. అలా అది వారి స్వీయ విముక్తికి మార్గ నిర్దేశనం చేస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే కాపిటల్ అత్యంత కీలకమైన, ముఖ్యమైన విప్లవ పాఠ్య పుస్తకం.

శాస్త్రీయ పరిజ్ఞానం మార్గదర్శకత్వంలో మానవ ఆచరణ సాగితే ఫలితాలు ఎలా ఉంటాయో ఇక్కడ ఇంకా వివరంగా చెప్పనక్కర్లేదు.

ఉరుములు, మెరుపులు దేవతల కోపానికి సూచనలు అని మన పూర్వీకులు భావించారు. కానీ ఈవేళ విద్యుచ్ఛక్తి మీద సాగిన శాస్త్రీయ పరిశోధనల ఫలితంగా ఆకాశంలో విద్యుచ్ఛక్తి వెలువడిన శబ్దం తప్ప ఉరుములంటే మరేమీ కాదని మనకు తెలుసు. అంతేకాదు ఒకప్పుడు భయానకంగా కనబడిన ఈ భూతాన్ని ఈవాళ మనం మచ్చిక చేసుకున్నాం. దానితో మన పనులు చేయించుకో గలుగుతున్నాం. టెలిగ్రాంలు, టెలిఫోన్‌లు, లైట్లు, రైళ్లు ఆ ఆకాశ విద్యుచ్ఛక్తి సాయంతో నడుస్తున్నాయి. వేసవిలో ఫంఖాలు తిప్పడానికి, గాలిని ఉత్పత్తి చేయడానికి, వంట పొయ్యిలు మండించడానికి, చలికాలంలో గదులను వెచ్చ చేయడానికి మనం ఆ శక్తిని వాడుకుంటున్నాము. ఒక్కమాటలో చెప్పాలంటే ఒకప్పుడు అతి భయానకంగా కనబడినదాన్ని దానికి వ్యతిరేకంగా, అత్యంత ఉపయోగకరమైనదిగా శాస్త్ర ప్రగతి మార్చ గలిగింది. అదే విధంగా రాజకీయార్థిక శాస్త్రాన్ని 'శాస్త్రం' అని పిలువదగినదిగా మార్చాలంటే అది ఇవాళ శక్తిహీనులుగా ఉన్న జన బాహుళ్యాన్ని, తమ సమస్యలలో కూరుకుపోయిన ఉన్నవారిని, అందుకు వ్యతిరేకంగా శక్తిమంతులుగా, సుఖ జీవనపరులుగా పరివర్తన చెందించగలిగిన మార్గదర్శక సూత్రాలను అందించగలగాలి. మార్క్స్ పుస్తకానికి నిజంగా ఆ విలువ ఉంది.

## పెట్టుబడిదారీ సమాజ ప్రత్యేక చలన నియమాల విశదీకరణ

'చిల్లర అర్థశాస్త్రవేత్తలు' కొందరున్నారు. వారిని అసలు మేధావులుగా పరిగణించడానికే వీలు లేదు. వారిని అలా పిలవడం ఎందుకంటే మామూలు చిల్లర స్థాయి వారి స్థాయి ఒకటే. వారు కేవలం కనబడే రూపాలకే సంపూర్ణంగా అంటిపెట్టుకొని ఉంటారు. చూస్తున్న విషయపు సారాంశాన్ని గ్రహించడానికి ప్రయత్నించరు. ఉదాహరణకు – సూర్యుడు తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తున్నట్లు కనబడినపుడు అది మన కళ్లలో ప్రతిఫలించే ఉపరితల, దృగ్గోచర రూపం మాత్రమే. ఒక చిల్లర మేధావి చేసేదల్లా ఆ దృగ్గోచర రూపాన్ని వర్ణించడం మాత్రమే. కాకపోతే పండిత పదజాలం వాడి తానేదో గొప్ప విషయం చెపుతున్నట్లు ధ్వనించగలడు. దాన్ని దాటి ఒక్క అడుగైనా ముందుకు వేయడానికి సిద్ధపడడు. వాళ్ల 'పాండిత్యం' అంతా కూడా మామూలు లోకజ్ఞానానికి అందే విషయాల జాబితాలు తయారు చేయడమే. అందువల్ల వాళ్ల భావాలను అర్థం చేసుకోవడం చాలా సులభమే అయినప్పటికి అది పనికిమాలినది. ఇటువంటి మేధావులు అన్ని దేశాలలోనూ కుప్పలుగా ఉంటారని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. జర్మనిలో చారిత్రక రాజకీయార్థిక ఆలోచనా సరళి అని, ఆస్ట్రియాలో మనో వైజ్ఞానిక ఆలోచనా సరళి అని పేరు పెట్టుకున్నట్లుగా ఆకర్షణీయమైన పేర్లు పెట్టుకుంటారు. కానీ ఈ రెండు ఆలోచనా సరళులు సారాశంలో ఒక్కటే. పై పైన చూడడానికి ఒకదానితో మరొకటి విభేదిస్తున్నట్లు కనబడతాయి. జపాన్‌లో రెండు ప్రధాన రాజకీయ పార్టీలు, బూర్జువా రాజకీయ పార్టీలే అయినప్పటికి ఒకదానితో మరొకటి పోరాడుతున్నట్లుగా కనబడడం లాంటిదే ఇది. అయితే ఈ రెండు ఆలోచనా ధోరణుల పద్ధతులు వేర్వేరుగా ఉంటాయి. ఒక ధోరణి ఊరికే వాస్తవాలను జాబితా వేస్తూ పోతుంది. ఆ వాస్తవాల వెనుక ఉన్న నియమాలను విస్మరిస్తుంది. అంటే చెట్లను చూడడంలో పడి అడవిని మర్చిపోతుందన్నమాట. మరొక ఆలోచనా ధోరణేమో పెట్టుబడిదారీ సమాజపు ప్రత్యేక నియమాలను చూపే బదులు కొన్ని అమూర్త నియమాలను ప్రతిపాదిస్తుంది. అందువల్లనే చారిత్రక ఆలోచనా ధోరణికి ప్రారంభకులైన విల్‌హెల్‌రైషర్ ఉట్టి చేతులతో చేపలు పట్టిన ఆదిమ ప్రజానీకం కూడా తొలి సంచయనం చేసిన పెట్టుబడిదారులుగా గుర్తిస్తారు. మరొక పక్క మనో వైజ్ఞానిక ధోరణి నాయకుడు బోమేబారక్ పెట్టుబడిదారీ ఉత్పత్తి లక్షణాలను వివరించడానికి వెదురుబొంగులో నుండి నీరు ప్రవహించే ఉదాహరణ చెపుతాడు. ఈ రెండు ఆలోచనా ధోరణులు కూడా పెట్టుబడి భావనను ఏదో సాధారణమైనదిగా, అమూర్తమైనదిగా, బాహిరమైనదిగా గుర్తించడంలో ఏకమవుతాయి. ఇందుకు భిన్నంగా ఆధునిక పెట్టుబడిదారీ సమాజపు ప్రత్యేక, చారిత్రక నియమాలను విశదీకరించడానికి కాపిటల్‌లో మార్క్స్ ప్రయత్నించాడు. ఆ పుస్తకం రెండో కూర్పు వెనుక మాటలో ఇందుకు సంబంధించి ఒక వివరణ కనబడుతుంది :

'వర్తమానానికి అన్వయించినా, గతానికి అన్వయించినా ఆ అన్వయంతో సంబంధం లేకుండా ఆర్థిక జీవనపు సాధారణ సూత్రాలు ఎల్లవేళలా ఒక్కటే అని కొందరంటారు. మార్క్స్ నిరాకరించింది కచ్చితంగా దీన్నే. అటువంటి సార్వకాలిక అమూర్త నియమాలేవి ఉండవని ఆయన వాదించాడు. అందుకు భిన్నంగా ఆయన అభిప్రాయం ప్రకారం ప్రతిచారిత్రక దశకు దానివైన ప్రత్యేక నియమాలు ఉంటాయి. జీవితం ఒకానొక నిర్దిష్ట అభివృద్ధి దశ దాటగానే అంటే ఒక నిర్దిష్ట స్థాయినుండి మరొక్క స్థాయికి మారగానే అది ఇతర నియమాలకు లోబడడం జరుగుతుంది. గతకాలపు అర్థశాస్త్రవేత్తలు ఆర్థిక నియమాల స్వభావాన్ని పొరపాటుగా అర్థం చేసుకున్నారు. ఆ నియమాలు భౌతిక, రసాయన శాస్త్ర నియమాల లాగా ఉంటాయనుకున్నారు. మరింత లోతైన విశ్లేషణ సాగించగా అర్థమయ్యేదేమంటే సామాజిక వ్యవస్థ మొక్కలకన్నా జంతువుల కన్నా మౌలికంగా విభిన్నమైనది.'

ఉదాహరణకు బానిస సమాజం, భూస్వామ్య సమాజం, పెట్టుబడిదారీ సమాజం అనే విభిన్న సామాజిక వ్యవస్థలు, ఒకే సజీవ వ్యవస్థకు సంబంధించిన శైశదశ, కౌమార దశ, యవ్వన దశలకు సమానమైనవి కావు. ఆ మూడు పూర్తిగా భిన్నమైన మూడు సజీవ వ్యవస్థలు అనుకోవాలి. ఒక పాముకు, ఒక కుక్కకు, ఒక మనిషికి ఎన్ని తేడాలుంటాయో ఈ మూడు వ్యవస్థల మధ్య అన్ని తేడాలుంటాయి. ఒక పాము ఏమి చేసినా కుక్కగా ఎదగజాలదు. ఒక కుక్క ఏమి చేసినా మనిషిగా ఎదగజాలదు. వీటిలో ప్రతి ఒక్కటి మౌలికంగా విశిష్టమైన సజీవ వ్యవస్థ. అందువల్ల 'ఒక్కలాగానే కనబడే దృగ్గోచరాంశాలు' కూడా 'ఆ వ్యవస్థల సాధారణ నిర్మాణంలోని వైవిధ్యం ఫలితంగా, పూర్తిగా భిన్న నియమాల కిందికి రావచ్చు. ఆయా వ్యవస్థలలోని, ప్రత్యేక అవయవాలలోని వైవిధ్యం వల్ల, ఆ అవయవాలు పని చేసే విభిన్న పరిస్థితుల వల్ల కూడా అలా జరగవచ్చు'.

అలాగే గ్రండ్రిస్సే పేరుతో సుప్రసిద్ధమైన ఫౌండేషన్స్ ఆఫ్ ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ ఉపోద్ఘాతంలో మార్క్స్ ఏమన్నాడంటే:

'అందువల్ల బూర్జువా అర్థశాస్త్రపు ప్రతిపాదనలలో ఇతర రూపాల సమాజాలకు కూడా వర్తించే సత్యం ఉన్నదనే మాట నిజమే అయినప్పటికీ ఆ సత్యాన్ని ఒకింత అనుమానంతో గ్రహించాలి. ఆ ప్రతిపాదనలలో

ఒక అభివృద్ధి చెందిన రూపమో, వక్రరూపమో లేక తప్పుడు రూపమో ఉండవచ్చు గానీ, అది ఒక మౌలికమైన తేడాతో ఉంటుంది. అభివృద్ధి గురించి చారిత్రక వివరణ అని చెప్పబడేదాని పునాది తప్పనిసరిగా ఒక వాస్తవం మీద ఆధారపడుతుంది. ప్రతి కొత్త రూపం, తనకు ముందరి రూపాలన్నీ ఒక క్రమ పరిణామంలో సాగివచ్చాయని అనుకుంటుంది. ప్రతి కొత్త రూపం అతి అరుదుగా మాత్రమే ఏవో కొన్ని నిర్దిష్ట పరిస్థితులలో మాత్రమే తనను తాను విమర్శించుకుంటుంది. ఆ క్రమంలో క్షీణదశలుగా కనబడే చారిత్రక దశలను విస్మరిస్తుంది. వాటిని ఏకపక్షంగా పరిగణనలోకి తీసుకుంటుంది.'

ఒక మనిషి గనక తాను జీవిస్తున్న సమాజమే అత్యున్నత రూపమైన సమాజమని నమ్ముతున్నట్లయితే, గత కాలపు సామాజిక రూపాలన్నీ ఈ గమ్యానికి చేరే మార్గాలుగా మాత్రమే కనబడతాయి. అంటే వాటికి వాటి సొంత, స్వతంత్ర అస్తిత్వం లేకుండాపోతుంది. గత రూపాలకు వేటికీ ప్రస్తుత రూపంతో వైరం ఉన్నట్లు కనబడదు. పాత రూపాలన్నీ కొత్త రూపానికి లొంగి ఉన్నట్లు కనబడతాయి. తత్ఫలితంగా ఈ అవగాహన గత సామాజిక రూపాల గురించి సమగ్ర అవగాహనను రద్దు చేస్తుంది. అందువల్లనే మార్క్స్ కొత్త రూపం తనకంటే ముందరి రూపాలనన్నింటినీ తన దగ్గరికి సాగివచ్చేవిగా భావించి వాటన్నింటిని ఏకపక్షంగా గుర్తిస్తుంది.

ఆ విధంగా మార్క్స్ కాపిటల్‌లో వివరించినట్టుగా మనం పెట్టుబడిదారీ సమాజపు ప్రత్యేక నియమాలను విస్మరించజాలం.

ఆ క్రమంలోనే 'ఈ పుస్తకంలో నేను పరీక్షించదలచుకొన్నది పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని, దానితో సంబంధంలో ఉండే ఉత్పత్తి సంబంధాలను సామాజిక సంపర్క రూపాలను' అని మార్క్స్ అన్నాడు. పెట్టుబడిదారీ ఉత్పత్తి పనిచేసే తీరు ఒక నిర్దిష్టమైన ఉత్పత్తి సరళి అక్కడ పెట్టుబడిదారులు అనేకమంది వేతన కార్మికులను వినియోగించి, వారికి వేతనమిచ్చి, అందుకు బదులుగా ఆ కార్మికుల శ్రమతో తయారైన ఉత్పత్తులన్నింటినీ తామే సొంతం చేసుకుంటారు. ఏ సమాజంలోనైతే ఇటువంటి ఉత్పత్తి సరళి అతి ప్రధాన శక్తి అవుతుందో ఆ సమాజాన్ని 'పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ప్రాబల్యంలో ఉన్నదిగా' లేదా ఇంకా సులభంగా పెట్టుబడిదారీ సమాజంగా అభివర్ణిస్తాం.

అటువంటి పెట్టుబడిదారీ సమాజపు నిర్దిష్ట నియమాలను కాపిటల్ విశదీకరిస్తుంది. అయితే మనం గుర్తించవలసిన విషయం ఏమిటంటే శుద్ధమైన పెట్టుబడిదారీ సమాజం అనేది ఏదీ ఇంకా రూపొందలేదు. రూపొందదు కూడా. ఏ వాస్తవ సమాజంలోనైనా పెట్టుబడిదారీ అభివృద్ధి ఏ స్థాయికి ఎదిగినప్పటికీ గతకాలపు సామాజిక రూపాలు ఏదో ఒక భాగంలో కొనసాగుతూనే ఉంటాయి. అది అధిగమించలేకపోయిన అవశేషంలా మిగిలి పోతుంది. మార్క్స్ కాపిటల్‌లోని సిద్ధాంతాన్ని, ఈ గతకాలపు అవశేషాలకు నేరుగా అన్వయించడం కుదరదని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

జపాన్‌లో గ్రామీణ వ్యవసాయ జనాభా 1921 గణాంకాల ప్రకారం మొత్తం దేశ జనాభాలో 48.2 శాతంగా ఉంది. ఈ గ్రామంలో వ్యవసాయాన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తుల కింద సాగించడం లేదు. అందువల్ల అది పెట్టుబడిదారీ వ్యవసాయం కాదు. అంటే కాపిటల్‌లో మార్క్స్ వివరించిన పెట్టుబడిదారీ భూమి కౌలు సిద్ధాంతం, జపాన్‌లో కౌలు రైతులు చెల్లించే పంట కౌలుకు అన్వయించడం కుదరదు. మార్క్సిజం అండ్ ప్రాబ్లమ్స్ ఆఫ్ అగ్రికల్చర్ పుస్తకంలో మురయమా తోషిర్ సమర్థంగా వివరించారు. ఆయన రాసిన ప్రకారం :

'జపాన్‌లో కౌలుదార్లు ధాన్య రూపంలో చెల్లించే కౌలే భూమి కౌలుకి ప్రధాన రూపం. ఈ వాస్తవాన్ని లోతుగా గుర్తించని తప్పుడు వాదనలు చాలా వచ్చాయి. ఆ వాదన చేసినవారు భూమి కౌలు గురించి మార్క్స్ సిద్ధాంత సరళిని జపాన్ కౌలుదార్ల కౌలుకు వర్తింపజేయడానికి ప్రయత్నించారు. మొంటోయొకి టకబటకే, సెంటర్ కిటౌరా తదితర రచనలలో ఈ వాదనలు చూడవచ్చు.'

## భౌతికవాద ప్రారంభం

కష్టాలలో కూరుకుపోయి ఉన్నవారు తమ కష్టాలకు మూలం ఏమిటో గుర్తించకుండా ఉండటానికి అన్నివైపుల నుంచి అన్ని ప్రయత్నాలూ జరుగుతుంటాయి. మనం ఒకసారి ఆ గందరగోళాన్ని ప్రతిఘటించి సత్యాన్ని గుర్తించడం మొదలుపెడితే మన సమస్యకు మూలం ఎక్కడుందో కనిపెట్టగలుగుతాం. భూమి సరిపోయినంత లేదు అనేది సమస్య కాదు. జనాభా పెరిగిపోతోంది అనేది సమస్యకాదు. విదేశీయుల ఆధిపత్యం పెరిగిపోతోంది అనేది సమస్య కాదు. మనవాళ్లు ఉత్త అజ్ఞానులు అనేది సమస్య కాదు. మన సమస్యల అసలు మూలాన్ని మన సమాజ నిర్మాణంలోనే గుర్తించవలసి ఉంటుంది. మనం ఈ సమస్యలను పారదోల దలచుకున్నట్లయితే ఈ సమాజ నిర్మాణాన్ని మౌలికంగా విప్లవీకరించడం తప్ప మరొక్క దారి లేదని కూడా మనం కనిపెట్ట గులుగుతాం.

మొట్టమొదట అన్నింటికన్నా ముందు మనం నివసిస్తూ ఉన్న ఈ ప్రపంచం ఎట్లా నిర్మాణమైందో, ఎటువైపు ప్రయాణం చేస్తుందో వీలైనంత ఎక్కువ కచ్చితంగా మనం గుర్తించవలసి ఉంటుంది.

మనం అతి కచ్చితంగా గుర్తించాలంటే మన గ్రహణ పద్ధతి సరైనదై ఉండాలి. భౌతికవాద గతితర్కం అనేదే ఆ సరైన పరిశీలనా పద్ధతి. ఇక్కడ నేను మొదట భౌతికవాద దృక్పథం గురించి ఒక మాట చెప్పి ఆ తర్వాత గతితార్కిక అవగాహన స్వభావాన్ని వివరిస్తాను.

మనం నివసిస్తున్న ప్రపంచం ఏ ఆర్థిక యంత్రాంగం ప్రకారం నడుస్తుంది? ఈ సమస్యను పరిశీలించేటప్పుడు మనం భావవాదులమైతే కళ్లు మూసుకుని, చేతులు కట్టుకుని ఆలోచనలో పడరాదు. కానీ మనం భౌతికవాదులం. భౌతికవాద గ్రహణ పద్ధతి ద్వారా మాత్రమే సరైన అవగాహన పొందగలుగుతామని భావిస్తాం. సరైన అవగాహన అంటే వస్తుగతమైన, శాస్త్రీయమైన అవగాహన. అందుకే మనం కళ్లు తెరిచి మన చుట్టూ ఉన్న దృగ్గోచరాంశాలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంది. మన కళ్ల ఎదురుగా కనబడే దృగ్గోచర రూపాలను గ్రహించకుండా తప్పించుకోలేం. కానీ వాటిని కనబడినది కనబడినట్టుగా గ్రహించడం తోనే మన పరిశోధన ప్రారంభం కావాలి. మన ప్రారంభ బిందువు ప్రతి ఒక్కరి కళ్లలోనూ ప్రతిఫలించేదే. తమ కళ్లకు అది కనబడుతోందని ప్రతి ఒక్కరు అంగీకరించేదే. అవి ఎవరినైనా సంతృప్తి పరిచే స్పష్టమైన నిస్సందేహమైన వాస్తవాలే. మన పరిశోధన ఇక్కడ ప్రారంభమవుతుంది కనుక అది విశ్వసనీయంగా ఉంటుంది. అలాకాక మనం ఒకవేళ మన మనసుల లోపల ఆలోచనల దగ్గర ప్రారంభిస్తే ఆ ఆలోచనే సరైనదని

అనిపించినప్పటికీ అది వాస్తవం అవునో కాదో సందేహాస్పదమే. ఆ విషయంలో ఇతరులను ఒప్పించాలంటే కొంత రుజువు అవసరమవుతుంది. అంటే వాదన అటు ఇటు సాగవలసి వస్తుంది. మొత్తం పరిశోధనే పొరపాట్లతో ముగిసిపోతుంది.

కనుక మనం ప్రతి ఒక్కరినీ సంతృప్తి పరచగలిగే స్పష్టమైన వాస్తవాలతో ప్రారంభించాలి. కాపిటల్ రెండవ జర్మన్ కూర్పు వెనుక మాటల్లో, మార్క్స్ తన పుస్తకం మీద వచ్చిన ఒక సమీక్ష నుంచి కొంతభాగం ఉటంకించాడు :

'సామాజిక చలనాన్ని మార్క్స్ ఒక సహజ చరిత్ర క్రమంగా భావిస్తాడు. ఆ క్రమం కొన్ని నియమాల చేత నిర్దిష్టమవుతుంది. ఆ నియమాలు మానవ సంకల్పాన్ని, చైతన్యాన్ని, ప్రతిభను నిర్ణయిస్తాయి... ఒకవేళ నాగరికత చరిత్రలో మానవ చైతన్యం అనేది అంత తక్కువ స్థాయి పాత్ర నిర్వహించినట్లయితే అప్పుడు నాగరికతనే ప్రధాన అంశంగా అధ్యయనం చేస్తున్న విమర్శనాత్మక పరిశీలన, చైతన్యాన్ని గానీ, చైతన్య ఫలితాలను గానీ తనకు పునాదిగా ఉంచుకోజాలదు. మరో మాటలో చెప్పాలంటే అటువంటి పరిశీలనకు ప్రారంభ బిందువు చైతన్యం కాదని భౌతిక జగత్తు అని అర్థమవుతుంది.'

మనం ఆర్థిక జీవనాలు ప్రజలందరి కళ్లలో ఒక స్పష్టమైన వాస్తవంగా ఉంటాయి. బతకాలంటే మనకు బాహ్యంగా ఉన్న ప్రకృతిని గమ్యంగా చేసుకుని, శ్రమించి, ఆహారాన్ని, దుస్తులను, ఆశ్రయాన్ని ఇతర వస్తువులను తయారు చేసుకోవాలని మనకు తెలుసు. లుడ్విగ్ కుగెల్మన్ కు 1868 జూలై 11న రాసిన ఉత్తరంలో మార్క్స్ ఏమన్నాడంటే :

'ఒకజాతి ఒక సంవత్సరంపాటు గాదు, కనీసం కొన్ని వారాలపాటు పనిచేయడం మానేసినా నశించిపోతుందని ప్రతి శిశువుకు తెలుసు. అలాగే సమాజంలోని విభిన్న అవసరాల పరిమాణాన్ని తీర్చే ఉత్పత్తుల రాసులు తయారు కావాలంటే ఆ సమాజంలోని మొత్తం శ్రమ విభిన్నమైనదిగాను, నిర్ణీత పరిమాణంలోనూ లభించాలని కూడా ప్రతి శిశువుకు తెలుసు. ఎప్పుడైనా లభించే సామాజిక శ్రమ మొత్తాన్ని ఈ రకంగా నిర్దిష్ట నిష్పత్తులలో పంపిణీ చేయవలసిన అవసరం, ఏ నిర్దిష్ట రూపపు సామాజిక ఉత్పత్తి పద్ధతిలోనైనా రద్దు కాదనేది సుస్పష్టం. ఆ వ్యక్తీకరణ రూపం మారుతూ ఉంటుంది. అంతే ప్రకృతి నియమాలను మొత్తంగా రద్దు చేయడం సాధ్యం కాదు. చారిత్రకంగా భిన్నమైన పరిస్థితులలో మారగలిగినదల్లా ఏమంటే ఆ నియమాలు తమను తాము వ్యక్తపరుచుకునే రూపం మాత్రమే.'

దీనర్థం ఏమంటే బతకాలంటే మానవులకు తమ శ్రమ ద్వారా వస్తువులు ఉత్పత్తి చేయడం కన్నా గత్యంతరం లేదు. కనుక ఒక సంవత్సరం కన్నా తక్కువ కాలమైన ఆ శ్రమ చేయడం మానివేస్తే ప్రతి ఒక్క మనిషి మనుగడ కోల్పోవలసి వస్తుంది. అంతేకాదు, మనుషులకు అనేక అవసరాలు ఉన్నాయి, కనుక సామాజిక శ్రమను మొత్తంగా వేర్వేరు ఉత్పత్తి రంగాలకు నిర్దిష్ట నిష్పత్తితో పంపిణీ చేయవలసి ఉంటుంది. అలా చేయడం ద్వారానే వేర్వేరు అవసరాలను తీర్చగలిగే వేర్వేరు వస్తువులు తయారవుతాయి. ఈ భూగోళం మీద ప్రజలు జీవిస్తున్నంత కాలం సమాజం ఎలా నిర్మాణం అయి ఉన్నప్పటికీ ఈ సహజ సూత్రం వర్తిస్తుంది. భిన్నమైన సామాజిక వ్యవస్థల మధ్య జరిగే మార్పు ఏమంటే ఈ సహజ సూత్రం వ్యక్తీకరణ పొందే రూపం మారుతుంది. ఇదంతా శిశువుకు కూడా సుస్పష్టమైన విషయమని మార్క్స్ భావించాడు. అదే విధంగా ఇవాళ్టి సమావేశంలో మన జీవితాలు నిరంతరం సాగడానికి అవసరమైన వస్తువులను తయారు చేయాలంటే నిరంతరం శ్రమ వెచ్చించవలసినదే అని స్పష్టమే. ఈ సామాజిక సమస్త శ్రమను ఇనుము తయారీ, ఓడల నిర్మాణం. నూలు వడకడం, దుస్తుల తయారీ, వ్యవసాయం, గనుల తవ్వకం, వగైరా అనేక ఉత్పత్తి రంగాలలో పంపిణీ చేయవలసి ఉంటుంది. అయితే ఈ యావత్తు ఉత్పత్తులు సరుకులు గానే తయారవుతాయి. సామాజిక ఉత్పత్తి యావత్తు సరుకుల ఉత్పత్తి పద్ధతి ద్వారానే జరుగుతుంది. అంటే పైన ఉదహరించిన సహజ సూత్రం ఈవాళ్టి సమాజంలో నిర్దిష్టంగా సరుకుల ఉత్పత్తి రూపంలోనే వ్యక్తీకరణ పొందుతుందన్నమాట.

అందుకే కాపిటల్ ప్రారంభంలోనే 'పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి సాగే సమాజాలలో సంపద అంటే 'అపారమైన సరుకుల రాశి' గా కనబడుతుంది. ఆ రాశికి ప్రాథమిక రూపంగా ఏ సరుకైనా ఉంటుంది' అని రాశాడు.

ఇవాళ జీవిస్తున్న ఏ వ్యక్తి కళ్లకైనా కనబడే బాహ్యమైన దృగ్గోచర అంశం ఇదే. ఈ సంగతి శిశువులకు కూడా తెలుసు. ఒకరి కుటుంబానికి అవసరమైనవి ఏమిటో వారు ఉత్పత్తి చేసుకునే బదులు సమాజంలోని ఇతర ప్రజలు ఉత్పత్తి చేసిన వస్తువులను కొనుగోలు చేసి ఎవరైనా సంపద పొందవచ్చు. అలా ఇతరులు తయారు చేసిన వస్తువులు వేర్వేరు రకాలుగానూ అపారమైన పరిమాణంలోనూ దొరుకుతాయి. కానీ ప్రతి ఒక్కటి సరుకు రూపంలోనే ఉంటుంది. 'పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి సాగే సమాజాల సంపద అపారమైన సరుకుల రాశిగా కనబడుతుంది' అనడానికి కారణం ఇదే. దాన్ని అపారమైన సరుకుల రాశి అనడం ఎందుకంటే అక్కడ ప్రతి వస్తువు, ఏ వస్తువైనా సరుకుగానే ఉంటుంది. అంటే ఏ వస్తువైనా డబ్బు ఇచ్చి కొనదగినది గానే ఉంటుంది. ఎటువంటి మినహాయింపులు లేకుండా ప్రతి ఉత్పత్తి సరుకుగానే లభిస్తుంది. కానీ మానవ జాతి చరిత్రలో ఎప్పుడూ ఇలాగే జరగలేదు. సరుకుల ఉత్పత్తి ఇంకా సంపూర్ణంగా అభివృద్ధి చెందని దశలో ఎవరైనా ఒక వ్యక్తి ఏదైనా కొనదలచుకొన్నప్పుడు కూడా ఎవరి దగ్గర నుంచి కొనాలో తెలియదు. అందువల్ల ప్రతి ఒక్కరు గత్యంతరం లేక, తమ వినియోగానికి తామే ఉత్పత్తి చేసుకోవలసి వచ్చేది. కానీ పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి విస్తరించిన కొద్దీ ఎన్నో రకాల వస్తువులు సరుకు రూపం పొందడం మొదలుపెట్టాయి. జపాన్‌లో మనం గ్రామీణ ప్రాంతాల నుండి పట్టణాలకు ప్రయాణించే కొద్ది ఈ విషయం సులభంగా అర్థం చేసుకోవచ్చు. పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి ఇంకా పూర్తిగా ప్రవేశించని గ్రామీణ ప్రాంతాలలో ఎవరైనా చేతిలో డబ్బు లేకుండానే చాలా వరకు నెట్టుకు రావచ్చు. కానీ నగరంలో పెట్టుబడిదారీ ఉత్పత్తే ప్రబల శక్తిగా స్థిరపడింది కనుక దాదాపు ప్రతి దానికీ డబ్బు చెల్లించవలసి వస్తుంది. డబ్బు ఇవ్వగలిగితే దేన్నయినా కొనుక్కోవచ్చు. దగ్గరలో ఉన్న దుకాణంలోకి వెళ్లి చూడండి. సరుకుల రాశి కళ్లముందర ప్రత్యక్షమవుతుంది.

ఈ రకంగా పెట్టుబడిదారీ సమాజంలో సంపద అపారమైన సరుకుల రాశిగాను, ఒక్కొక్క సరుకు మొత్తం సామాజిక సంపదకు

అణువుగాను కనబడుతాయి. మానవ శరీరం అసంఖ్యాకమైన విడివిడి అణువులతో నిర్మాణం అయినట్లుగానే పెట్టుబడిదారీ సమాజం కూడా అసంఖ్యాకమైన విడి విడి సరుకులతో నిర్మాణమవుతుంది. ఏ ఒక్కరైనా స్పష్టంగా చూడగల విషయమే ఇది. ఎవరైనా తనకు కావలసింది ఏదైనా పొందడానికి నగరానికి వస్తే, ఆ వస్తువు మీద ఖరీదు చీటి తగిలించి ఉంటుంది. లేదా దాని ఖరీదెంతో దుకాణంలో గుమాస్తా చెప్తాడు. అందుకే పెట్టుబడిదారీ సమాజంలో సంపదకు 'మౌలికరూపం' గా విడి సరుకు కనబడుతుందని మార్క్స్ అన్నాడు. ఇక్కడ 'కనబడుతుంది' అనే మాటకు కూడా అర్థముంది. అదేమంటే మనకు బాహ్యమైన ఒక దృగ్గోచరాంశం గురించి, ఒక రూపం గురించి మన కళ్లలో ప్రతిఫలించే దృశ్యమన్నమాట. కాపిటల్‌కు ప్రారంభ బిందువు ఈ దృగ్గోచర రూపమే.

పైన వివరించిన అంశాలను మరొక రకంగా కూడా వివరించవచ్చు. మనమిక్కడ పరిశీలిస్తున్న సమస్య మనం నివసిస్తున్న ప్రపంచపు ఆర్థిక యంత్రాంగం స్వభావమేమిటనేది. మనం ఒక్కసారి లోకం వైపు చూస్తే వర్తమాన సమాజంలో ప్రజల మధ్య ఎటువంటి ఆర్థిక సంబంధాలు ఉన్నాయో గుర్తించవచ్చు. ఒక సరుకుకు మరొక సరుకుకు మధ్య ఎటువంటి మారకపు సంబంధం ఉందో గుర్తించగలవు. ఇతరులు తయారుచేసే వస్తువులను మన సొంతం చేసుకోకుండా మన మనుగడ సాధించడమే అసాధ్యం. మనుషులు బతకడానికి ముఖ్యంగా పట్టణాలలో ఉండేవారు బతకడానికి అవసరమయ్యేవన్నీ – వాళ్లకు అవసరమైన బియ్యం, పప్పులు, ఉప్పులు, పచ్చళ్లు, చేపలు, మాంసం, కూరగాయలు, ఇతర తినుబండారాలు, బట్టలు, పాత్రలు, పత్రికలు, పెన్నులు సిరా వగైరా వగైరా ఏదైనా ఇతరులు తయారు చేయవలసినదే. దొంగిలించిన వస్తువులు, ఉచితంగా వచ్చే వస్తువులు మినహాయింపు గానీ అవి చాలా అరుదు. సర్వ సాధారణంగా వస్తువులన్నింటినీ ఒక నిర్ణీతమైన ధర ఇచ్చి కొనవలసినదే. ఈ కారణం వల్లనే మనుషులందరి మధ్య అసంఖ్యాకమైన మారకపు సంబంధాలు ఏర్పడతాయి. ఈ మారకపు సంబంధాల మొత్తం మీదనే ఈనాటి సమాజపు ఆర్థిక నిర్మాణం తయారవుతుంది.

ఈ దృక్కోణం నుండి చూసినపుడు పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక నిర్మాణం మారకపు సంబంధాల 'అపారరాశి'గా కనబడుతుంది. ఒక విడి మారకపు సంబంధం ఈ మొత్తం రాశి 'ప్రాథమిక రూపం' అని చెప్పవచ్చు. అందుకే లెనిన్ సరుకు సంబంధమే 'బూర్జువా (సరుకు) సమాజపు సాధారణమైన, అతి సులభమైన, మౌలికమైన సార్వత్రికంగా కనబడే దైనందిన సంబంధం' అని ఆ సంబంధాన్ని మనం కోట్లాది సార్లు ఎదుర్కోవలసి వస్తుందని అన్నాడు. అంటే పెట్టుబడిదారీ సమాజానికి అణువు మారకపు సంబంధం అన్నమాట.

క్లుప్తంగా చెప్పాలంటే మన పరిశీలన మొట్టమొదటనే సంక్లిష్టమైన విషయాల దగ్గరే ప్రారంభం కాకూడదు. అత్యంత సులభమైన విషయాల దగ్గర ప్రారంభించి క్రమక్రమంగా అతి సంక్లిష్టమైన వాటి దగ్గరికి ఆరోహణ క్రమంలో కదలాలి. 'అందువల్ల మన పరిశోధన సరుకు విశ్లేషణ దగ్గర ప్రారంభం కావాలి' అని మార్క్స్ అన్నది అందుకే.

### గతితార్కిక అవగాహన

తర్వాత నేను గతి తార్కిక అవగాహన పద్ధతి గురించి కొంత చెప్పదలిచాను. ఆధునిక సమాజంలో వేర్వేరు కోణాల నుండి ఎన్నో వైరుధ్యాలు కనబడుతాయని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. ఒక ఉదాహరణగా ఇవాళ్టి దినపత్రిక ఒసాకామైనిచే (మార్చ్ 2, 1928)లో వచ్చిన ఒక వ్యాసాన్ని ప్రస్తావించదలచుకొన్నాను.

'విద్యుత్ ఉత్పత్తి సంస్థలు, మిగులు విద్యుచ్ఛక్తి' సమస్యతో బాధ పడుతున్నట్టున్నాయి. తమ ఉత్పత్తి మీద పరిమితి విధించినట్లయితే ఉత్పత్తి కొనసాగించడం సాధ్యం కాదని అంటున్నాయి. కానీ ఇది దారుణం. ఈ మిగులు విద్యుచ్ఛక్తి అనబడేది సరిగ్గా ఏమిటి మిగులు ఉన్నదని చెప్పబడే విద్యుచ్ఛక్తిని తీగల ద్వారా సరఫరా చేస్తున్నారు. కానీ అది అందవలసిన వినియోగదారులకు అందడం లేదట. ఉన్న అన్ని రకాల ఇంధనాలలోనూ విద్యుచ్ఛక్తి ద్వారా ఇళ్లు వెచ్చ చేసుకోవడం చాలా సౌకర్యం. కానీ అది చాలా మంది ఇళ్లలో విద్యుత్ దీపాలు మసకగానే వెలుగుతున్నాయి. దేశంలోని కొండ ప్రాంతాలలో సొరంగ మార్గాలలో నడిచే రైళ్లు ఇంకా బొగ్గుతోనే నడిచి విపరీతంగా బూడిదను తయారు చేస్తున్నాయి. దేశంలో రైలు మార్గాలను రాజకీయ మార్గాల కోసం వేశారు. కనుక ప్రయాణికులు లేకపోయినా రవాణా సరుకులు లేకపోయినా రైళ్లు నడుస్తూనే ఉన్నాయి. మిగిలిపోతున్నదని చెప్పబడుతున్న విద్యుచ్ఛక్తిని ఈ రైళ్లు నడపడానికి వాడ వచ్చునని ఎవరూ అనడం లేదు. ఇళ్లను పూర్తిగా విద్యుదీకరించమని, ఆధునిక జీవనశైలి అలవర్చుకోమ్మని, వ్యాపార ప్రకటనలు వినబడుతుంటాయి. కానీ అది సౌకర్యమంతమని చాలా మందికి తెలుసు గానీ దాని ఖరీదు అందుబాటులో లేదు. మరి మిగులు విద్యుచ్ఛక్తి సమస్య, ఉత్పత్తిని తగ్గించాలనే పిలుపుల కన్నా అర్థరహితమైన విషయం మరొకటి ఉంటుందా. దానర్థం ఏమంటే తయారు చేసిన యంత్రాలు పనిచేయవు. జల ప్రాంతాల నుండి నీరు ప్రవహిస్తూ ఉంటుంది కానీ యంత్రాలు విద్యుదుత్పత్తి చేయకుండా నిశ్శబ్దంగా కూర్చుని ఆ నీటిని సముద్రంలోకి వెళ్లనిస్తాయి. ఎంత వృథా! ఇంత వృథా జరుగుతున్నప్పటికీ విద్యుత్ కంపెనీలు మాత్రం విద్యుచ్ఛక్తికి ఎక్కువ ఖరీదు పెడతాయి. ప్రజలు ఆధునిక జీవనశైలిని అలవర్చుకోకుండా ఆటంకపరుస్తాయి. మరొక పక్క విద్యుచ్ఛక్తి మిగిలిపోతున్నదని గగ్గోలు పెడుతాయి'.

సంపద మధ్యనే అనేకమంది దారిద్ర్యంలో ఎందుకు ఉంటారో చూపే ఉదాహరణ ఇది. విద్యుచ్ఛక్తి సాధారణ వినియోగదారును చేరడం లేదు. మరొక్క పక్క విద్యుత్ కంపెనీలు మిగులు ఉత్పత్తితో ఇబ్బందులు పడుతున్నాయి. ఇది వైరుధ్యం కాకపోతే ఇక వైరుధ్యం అంటే ఏమిటి? అంతకన్నా ఘోరం, ఈ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి విద్యుత్ కంపెనీలు ఉత్పత్తి మీద పరిమితి విధించమంటున్నాయి. అంటే మనం కష్టపడి నిర్మించుకున్న వ్యవస్థను వినియోగించబోమన్న మాట. అటువంటి ఆంక్షలు పెట్టకపోతే కంపెనీలు తమ ఉత్పత్తిని కొనసాగించజాలవట. ప్రస్తుత సమాజంలో ఇటువంటి వైరుధ్యాన్ని పరిష్కరించడానికి ఉత్పత్తిని తగ్గించడమే మార్గం. అంటే ఉత్పాదక శక్తి మీద పరిమితులు పెట్టడం. సంపద ఉత్పత్తి పెరుగుదలను ఉద్దేశ్యపూర్వకంగా అడ్డుకోవడం ఉత్పాదక శక్తికి, ఉత్పత్తి సంబంధాలకు మధ్య గల ఘర్షణను ఇది స్పష్టంగా తెలియ జేస్తుంది. ప్రస్తుత ఉత్పత్తి సంబంధాలు (సాంఘిక, సంబంధాలు లేదా సమాజం నడిచే తీరు) ఉత్పాదక శక్తి ఇంకా అభివృద్ధి చెందడానికి ఆటంకంగా మారిందని ఇది సూచిస్తుంది.

ఈ వైరుధ్యం ఎలా తలెత్తింది?

'ఒకే ఒక మొత్తాన్ని విభజించి చూడడం దానిలోని విరుద్ధాంశాలను అవగాహన చేసుకోవడం గతితర్క సారాంశం (మానవ మేధ సమాజంతో సహా). ప్రకృతిలోని అన్ని దృగ్గోచర అంశాలలో అన్ని క్రమాలలో ఉన్న వైరుధ్య పూరిత పరస్పర వ్యతిరేక వైరి ధోరణులను గుర్తించడం (కనిపెట్టడం) అంటే విరుద్ధాంశాల సామాన్యత్వాన్ని (ఐక్యతా అనడం సరైనదేమో). ప్రపంచంలోని అన్ని క్రమాలను వాటి స్వీయచలనంలో వాటి యాదృచ్ఛిక అభివృద్ధిలో వాటిని జీవితంలో గుర్తించడానికి షరతు ఏమంటే వాటిని విరుద్ధాంశాల ఐక్యతగా గుర్తించడమే' అని లెనిన్ అన్నాడు.

'మార్క్స్ కాపిటల్‌లో బూర్జువా (సరుకు) సమాజపు సాధారణమైన అతి సులభమైన, మౌలికమైన, సార్వత్రికమైన దైనందిన సంబంధాన్ని మొట్టమొదట విశ్లేషించాడు. ఆ సంబంధం కోట్లసార్లు ఎదురుపడేది. అది సరుకుల మారకపు సంబంధం. ఈ అత్యంత సాధారణ దృగ్గోచరాంశం, బూర్జువా సమాజపు అణువు విశ్లేషణ ఆధునిక సమాజపు వైరుధ్యాలన్నింటిని వెల్లడి చేస్తుంది. లేదా, అన్ని వైరుధ్యాల బీజాలను వెల్లడి చేస్తుంది. ఆ తర్వాతి వివరణలో ఈ వైరుధ్యాలు, ఈ సమాజం ఎలా అభివృద్ధి చెందుతున్నాయో అంటే వాటి వృద్ధి, వాటి చలనం చూపడానికి విడి విడి భాగాలన్నింటిని మొదటి నుండి చివరి దాకా కలపడం జరుగుతుంది' అని కూడా లెనిన్ అన్నాడు.

లెనిన్ ఇచ్చిన ఈ సులభ వివరణ రాజకీయార్థిక శాస్త్రంలో గతి తార్కిక అవగాహన స్వభావాన్ని సంపూర్ణంగా వ్యక్తం చేస్తుంది.

ఇంతకు ముందే చెప్పినట్లు పెట్టుబడిదారీ సమాజంలోని ప్రాథమిక రూపంగా అణువుగా సరుకును మొట్టమొదట విశ్లేషించవలసి ఉంటుంది. కానీ ఈ విశ్లేషణ సరుకు అనే ఏకీకృత విశ్లేషణను, దానిలోని విరుద్ధ అంశాల కింద విభజించవలసి వస్తుంది.

సరుకు లోపల ఒక వైరుధ్యం ఉన్నదని గుర్తించిన తరువాత సరుకు చలనం స్వయం చలనమని అర్థం చేసుకోవచ్చు. ఎందుకంటే చలనానికి మూలం వైరుధ్యమే. ఇక్కడ స్వయం చలనం అంటే అర్థం మరొక బయటి అంశం మీద ఆధారపడిన చలనం అని. ఈ చలనానికి చోధక శక్తి ఆ వస్తువు లోపలనే ఉందని. ఒక వస్తువు చలనం గురించి ఈ రకంగా అర్థం చేసుకొన్నప్పుడు మాత్రమే ఆ వస్తువు గురించి మౌలిక అవగాహన ఏర్పరచుకోగలం. ఒకవేళ చలనానికి చోధక శక్తి వస్తువు లోపల లేదని, మరొకచోట ఉన్నదని తెలిస్తే మన అధ్యయనం ఆ మరొక వస్తువుదీ కూడా తేల్చి చెప్పగలగాలి.

సరుకు లోపల మౌలికమైన వ్యతిరేకాంశాలు ఉపయోగపు విలువ, విలువ. ఒక సరుకు అది తయారు చేసిన వారికే కాక, ఇతరులకు కూడా ఉపయోగకర వస్తువే కావాలి. అంటే, అది ఒక ఉపయోగపు విలువగా ఉండాలి. లేదా భౌతిక సంపదగా ఉండాలి. అదే సమయంలో ప్రతి సరుకుకు ఒక నిర్ణిత ధర ఉంది. ఇన్ని డబ్బులు లేదా ఇంత బంగారానికి సమానమైన డబ్బులు అని, సరుకులో నిక్షిప్తమై ఉన్న విలువను డబ్బులలోనే వ్యక్తం చేస్తారు. అంటే సరుకుకు ద్వంద్వ స్వభావం ఉంది. ఒకవంక అది ఉపయోగపు విలువగా ఉంటుంది. మరొకవంక విలువగా కూడా ఉంటుంది.

ఉపయోగ విలువ అనేది ఉత్పాదక శక్తి ఫలితంగా వెలువడేది. కానీ విలువ అనేది ఉత్పత్తి సంబంధాల వ్యక్తీకరణగా రూపొందేది. సరుకు ఉపయోగ విలువ. విలువ అనే విరుద్ధాంశాల ఐక్యత. సరుకు లోపల ఈ మౌలిక వైరుధ్యం నిబిడీకృతమై ఉంటుంది. సమాజం సరుకుల ఉత్పత్తి సమాజంగా ఉన్నపుడు దానిలోని ప్రతి వైరుధ్యం, ప్రతి వైరుధ్య బీజం సరుకులోనే ఉంటుంది. పెట్టుబడిదారీ సమాజం సరుకుల ఉత్పత్తిలో అత్యున్నత అభివృద్ధి దశ కనుక దానిలోని వైరుధ్యాలు అన్నీ సరుకు లోపల కనబడతాయి.

విద్యుచ్ఛక్తి అవసరమైన వారందరికీ సరఫరా కాని స్థితి ఉన్నప్పటికీ తమ ఉత్పత్తిని తగ్గించాలని విద్యుత్ కంపెనీలు అనుకోవడం విద్యుచ్ఛక్తిని ఒక సరుకుగా తయారు చేసిన ఫలితమే. విద్యుచ్ఛక్తి సరఫరా ఒక నిర్దిష్ట దశను దాచినట్లయితే ఉపయోగ విలువకు, విలువకు మధ్య ఉన్న ఐక్యత ధ్వంసమైపోతుంది. పెట్టుబడిదారీ సమాజంలో ఉత్పాదక శక్తికి దానిలోని ఉత్పత్తి సంబంధాలకు మధ్యనున్న ఘర్షణే ఈ స్థితికి మూల కారణం.

ఎ కాంట్రిబ్యూషన్ ఆఫ్ క్రిటిక్ పొలిటికల్ ఎకనమీకి రాసిన ముందు మాటలో మార్క్స్ తన పరిశోధనల సాధారణ నిర్ధారణను ఇలా తెలియజేశాడు :

'తమ మనుగడకు సంబంధించిన సామాజిక ఉత్పత్తిలో మనుషులు అనివార్యంగా నిర్దిష్ట సంబంధాలలో ప్రవేశిస్తారు. అవి వారి ఇష్టాయిష్టాలకు అతీతమైనవి. వాటిని ఉత్పత్తి సంబంధాలు అంటారు. భౌతిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి చెందిన నిర్దిష్ట దశకు అవి తగ్గినట్లుగా ఉంటాయి. ఈ ఉత్పత్తి సంబంధాల సమాహారం సమాజపు ఆర్థిక నిర్మాణాన్ని రూపొందిస్తుంది. అది వాస్తవమైన పునాది. దానిపైన చట్టపరమైన రాజకీయ ఉపరి నిర్మాణం లేచి నిలుస్తుంది. నిర్దిష్ట సామాజిక చైతన్య రూపాలు, ఆ పునాదికి తగినట్లుగా ఉంటాయి. భౌతిక జీవనపు ఉత్పత్తి పద్ధతి సామాజిక రాజకీయ మేధో జీవనపు సాధారణ క్రమాన్ని నిర్దేశిస్తుంది. అంటే మనుషుల చైతన్యం వారి మనుగడను నిర్ణయించదు. వారి సాంఘిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్దేశిస్తుంది. ఒక ప్రత్యేకమైన అభివృద్ధి దశలో సమాజపు భౌతిక ఉత్పత్తి శక్తులకు, అప్పటికి కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాలకు ఘర్షణ తలెత్తుతుంది. కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాలు చట్టపరమైన వ్యక్తీకరణ పొందినపుడు, ఆస్తి సంబంధాలుగా ప్రకటితమవుతాయి. కనుక ఈ ఘర్షణ ఆస్తి సంబంధాలలో వ్యక్తమవుతుంది. తొలుత ఉత్పత్తి శక్తుల అభివృద్ధి రూపాలుగా ఉండిన సంబంధాలు వాటి మీద సంకెళ్లుగా మారుతాయి. అప్పుడు సామాజిక విప్లవ శకం ప్రారంభమవుతుంది. ఆర్థిక పునాదిలో వచ్చే మార్పులు, ముందు వెనుకలుగా యావత్ మహా ఉపరి నిర్మాణాన్ని పరివర్తన చెందించడానికి దారి తీస్తాయి.'

పెట్టుబడిదారీ ఉత్పత్తి ఒక నిర్దిష్ట అభివృద్ధి దశను చేరినపుడు సమాజంలోని భౌతిక ఉత్పాదక శక్తి అనివార్యంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలతో ఢీకొంటుంది. ఒకప్పుడు ఉత్పాదక శక్తి అభివృద్ధి రూపంగా ఉన్న ఉత్పత్తి సంబంధాలు ఆవశ్యకంగా అందుకు వ్యతిరేకంగా ఎలా మారాయి, ఉత్పాదక శక్తిమీద సంకెళ్లుగా ఎలా మారాయి అన్న ప్రశ్నలకు మార్క్స్ తన 'కాపిటల్' లో సమాధానం చెప్పడానికి చేసిన ప్రయత్నమే. మార్క్స్ రాసిన కాపిటల్‌లో వివరించడానికి ప్రయత్నించినది ఈ ప్రశ్నలకు సమాధానమే. వీ

***దైనందిన జీవితంలో ప్రజలు ఎదుర్కొనే సమస్యలను, వాటి పరిష్కారం కోసం ఆయా సమూహాలు చేస్తున్న పోరాటాల్ని ప్రతిబింబించాలని 'వీక్షణం' భావిస్తోంది. వివిధ వర్గాల, కులాల, అస్తిత్వ సమూహాల ఆశలను ఆకాంక్షలను వ్యక్తీకరణలను సామాజిక చరిత్రలో భాగంగా రికార్డ్ చేసే ఉద్దేశంతో వీక్షణం 'ధర్నాచౌక్' శీర్షికను ప్రారంభిస్తున్నది***

## కాంట్రాక్ట్ పారా మెడికల్ ఉద్యోగులను రెగ్యులరైజ్ చేయాలి

ఫిబ్రవరి 5, 2009

**రా**ష్ట్ర వ్యాప్తంగా పనిచేస్తున్న 3374 మంది పారా మెడికల్ ఉద్యోగాల (పురుషులు)ను 376 మంది ఫార్మసిస్టులను రెగ్యులరైజ్ చేయాలని డిమాండ్ చేస్తూ కాంట్రాక్ట్ పారా మెడికల్ ఉద్యోగులు 'చలో హైదరాబాద్' కార్యక్రమాన్ని నిర్వహించారు. రెగ్యులరైజేషన్, 2005 వేతన ఒప్పందం ప్రకారం పెరిగిన వేతన బకాయిలు చెల్లించాలని వారు డిమాండ్ చేశారు. అయిదేళ్లుగా ప్రభుత్వం హామీలు ఇస్తూ మోసం చేస్తున్నదని వారు విమర్శించారు.

**ప్రభుత్వం దృష్టికి తెచ్చిన సమస్యలు:**

- ఎం.సి.ఎచ్.ఎ (మేల్) లు 2002లోని నోటిఫికేషన్ ద్వారా సెలెక్ట్ అయిన వారందరు అపాయింట్ అయ్యారు. సమస్యలెకున్నా ప్రభుత్వం ఆటంకం చెబుతున్నది. ఎం.పి.ఎచ్.ఎ. (మేల్) సుప్రీంకోర్టులో కేసు విత్‌డ్రా చేసుకోవాలి.
- ల్యాబ్ టెక్నీషియన్స్, ఫార్మాసిస్టుల రెగ్యులరైజేషన్ ప్రతిపాదనలు ఆర్థిక శాఖ ఆమోదించే విధంగా చేయాలి.
- 2005 పి.ఆర్.సి. ప్రకారం పెరిగిన వేతనాల బకాయిలు చెల్లించలేదు.
- క్యాజువల్ లీవులు మాత్రమే ఇస్తున్నారు. ఇతర సెలవులు లేవు.
- మహిళా ఉద్యోగులకు కనీసం మెటర్నిటీ లీవులు కూడా ఇవ్వడం లేదు.
- ప్రతి సంవత్సరం కొనసాగింపు ఉత్తర్వులు సరైన టైంలో ఇవ్వడంలేదు.

## రామోజి ఫిలిం సిటీ కార్మికులకి బోనస్ ఇవ్వాలి

ఫిబ్రవరి 3, 2009

**రా**మోజీ ఫిల్మ్‌సిటీ కార్మికులకు 1995 నుంచి చెల్లించాల్సిన బోనస్ బకాయిలు 24 కోట్ల రూపాయలను వెంటనే చెల్లించాలని రామోజీ ఫిల్మ్‌సిటీ ఉషాకిరణ్ స్టాఫ్ వర్కర్స్ యూనియన్ డిమాండ్ చేసింది. చట్టం ప్రకారం కంపెనీ లాభాల్లో ఉంటే 20 శాతం, నష్టాల్లో ఉంటే 8.33 శాతం బోనస్ కార్మికులకు ఇవ్వాల్సి ఉండగా 2004 వరకు తొమ్మిదేళ్లు ఏ రకమైన బోనస్ ఇవ్వలేదని పేర్కొంది. ఈనాడు ఉద్యోగులు, కార్మికులు, బోనస్ హక్కులకై పదహారున్నర ఏళ్లు పోరాటం చేశారని, చివరకు సుప్రీంకోర్టు తీర్పు వచ్చిన తర్వాతనే కోటి 30 లక్షల రూపాయలు చెల్లించారని తెలిపింది. రామోజీ ఫిల్మ్‌సిటీలో పదివేల మందికి పైగా కార్మికులు పనిచేస్తుండగా, 15 కంపెనీలలో సుమారు 6741 మంది మాత్రమే ఉన్నారని కార్మిక శాఖ అధికారులకు రామోజీరావు దొంగలెక్కలు చూపాడని విమర్శించారు. తమ సమస్యలు పరిష్కరించాలి. డిమాండ్ చేస్తూ రామోజి ఫిలిం సిటీ కార్మికులు ఆమరణ నిరాహార దీక్షకు పూనుకున్నారు.

## భీంరావ్ బాడా ఇళ్ల పునర్నిర్మించాలి

ఫిబ్రవరి 3, 2009

**కాం**గ్రెస్ కార్యాలయం నిర్మాణం కోసం కూల్చేసిన భీంరావ్ బాడా ఇళ్లను తిరిగి అదే స్థానంలో నిర్మించాలని డిమాండ్ చేస్తూ మిత్రపక్షాలు ధర్నా నిర్వహించారు. కూల్చేసిన చోటనే ఇళ్లు నిర్మించే వరకు ఆందోళనను కొనసాగిస్తామని వారు హెచ్చరించారు.

## ఆంధ్రప్రదేశ్ మున్సిపల్ వర్కర్స్ యూనియన్ సమస్యలు పరిష్కరించాలి

ఫిబ్రవరి 3, 2009

**రా**ష్ట్ర వ్యాప్తంగా ఉన్న మున్సిపల్ కార్మికుల సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ సి.ఐ.టి.యు. ఆధ్వర్యంలో ర్యాలీ ధర్నా నిర్వహించారు. జీతభత్యాలు పెంచాలని, కాంట్రాక్టు పద్ధతిలో పనిచేస్తున్న కార్మికులను పర్మినెంట్ చేయాలని, ఇ.ఎస్.ఐ, పి.ఎఫ్.లను అన్ని మున్సిపాలిటీలకు వర్తింప చేయాలని వారు డిమాండ్ చేశారు. తమ సమస్యలు పరిష్కరించకుంటే ఆందోళనను తీవ్రతరం చేస్తామని హెచ్చరించారు.

## తెలంగాణ రిటైర్డ్ ఉద్యోగులకు ఆరోగ్య భద్రత కల్పించాలి

5 నుండి 7 ఫిబ్రవరి, 2009

**తె**లంగాణ రిటైర్డ్ ఉద్యోగుల ఆరోగ్య భద్రత, కనీస పెన్షన్ పెందులను డిమాండ్ చేస్తూ ఫిబ్రవరి 5 నుండి 7 వరకు రిలే నిరాహార దీక్ష నిర్వహించారు. రాష్ట్రంలో దాదాపు మూడు లక్షల డెబ్బై వేల మంది పెన్షనర్లు తీవ్రమైన ఇబ్బందులు ఎదుర్కొంటున్నారని, అందులో పది వేల మంది ఆరోగ్య భద్రత కొరవడి ప్రమాదకరమైన పరిస్థితుల్లో ఉన్నారని తెలిపారు. ఈ విషయమై 25.11.2008న ప్రభుత్వానికి మహజర్లు

సమర్పించినా పట్టించుకోలేదని వాపోయారు. అంతే కాకుండా రాష్ట్రంలో రెండు లక్షల ఇరవై వేల మంది పెన్షనర్లు ఐదు వేల లోపు పెన్షన్లను పొందుతున్న వాళ్లేనని, పెరిగిన మార్కెట్ ధరలకు ఈ పెన్షన్ ఏ మాత్రం సరిపోవడం లేదని, దీన్ని దృష్టిలో ఉంచుకుని ఐదువేల పెన్షన్‌ను ఆరు వేలు చేయాలని వారు డిమాండ్ చేశారు.

## ఆర్టీసిలో కాంట్రాక్ట్ డ్రైవర్లు, కండక్టర్లను పర్మనెంట్ చేయాలి

ఫిబ్రవరి 5, 2009

ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థలో 2005 నుంచి కాంట్రాక్ట్ పద్ధతిలో పనిచేస్తున్న డ్రైవర్లు, కండక్టర్లను పర్మినెంట్ చేయాలని డిమాండ్ చేస్తూ ఫిబ్రవరి 5 న 'చలో అసెంబ్లీ' కార్యక్రమాన్ని నిర్వహించారు. 'సమాన పనికి సమాన వేతనం' అన్న డిమాండ్‌తో 'గత రెండు సంవత్సరాలుగా ఆందోళనలు నిర్వహించినా ప్రభుత్వం నిమ్మ నీరెత్తినట్లుగా వ్యవహరిస్తున్నదని వారు విమర్శించారు. 2008 జూలై 18 నుంచి 21 వరకు నిర్వహించిన సమ్మె సందర్భంలో కాంట్రాక్టు పద్ధతిలో పనిచేస్తున్న డ్రైవర్లు కండక్టర్లను పర్మినెంట్ చేస్తామని ప్రభుత్వం హామీ ఇచ్చి మోసం చేసిందని, అనేకసార్లు ముఖ్యమంత్రికి, రవాణా శాఖ యాజమాన్యానికి, రవాణాశాఖ మంత్రికి మాహజర్లు సమర్పించినా స్పందించడం లేదన్నారు.

## సర్పంచులకు నిధులు, హక్కులు పెంచాలి

ఫిబ్రవరి 9, 2009

ఆంధ్రప్రదేశ్ సర్పంచుల సంఘం ఆధ్వర్యంలో సర్పంచులు నిరవధిక నిరాహార దీక్ష ప్రారంభించారు. తమకు రాజ్యాంగ బద్ధంగా రావాల్సిన నిధులు, విధులను ప్రభుత్వం అడ్డుకుంటుందని, స్థానిక సంస్థలను బలహీనపరుస్తున్నదని, తక్షణమే తమ సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేశారు.

## వృద్ధి రేటు 7.1 శాతమే!

**అం**తర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో చోటు చేసుకున్న ఆర్థిక మాంద్యం కారణంగా ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో భారత ఆర్థిక వృద్ధిరేటు 7.1 శాతానికి దిగజారే అవకాశం ఉందని ప్రధాని ఆర్థిక సలహా మండలి పేర్కొంది. మాంద్యం కంటే ముందు వృద్ధి రేటును 7.7 శాతంగా అంచనా వేశారు. రాబోయే ఆర్థిక సంవత్సరంలోనూ 7 – 7.5 శాతానికి మించక పోవచ్చని, ఫిబ్రవరి నాటికి ద్రవ్యోల్బణం మరింత పెరిగి దిగజారి నాలుగు శాతానికి చేరవచ్చని ప్రధాని ఆర్థిక సలహా మండలి ఛైర్మన్ సురేష్ టెండూల్కర్ వెల్లడించారు.

## రహ్మాన్‌కు ఆస్కార్

**భా**రత సంగీత ప్రపంచంలో ఎ.ఆర్. రెహ్మాన్‌గా ప్రసిద్ధుడైన అల్లా రఖా రెహ్మాన్ (43) ఏకంగా మూడు ఆస్కార్ నామినేషన్లు దక్కించుకుని చరిత్ర సృష్టించారు. 'స్లమ్‌డాగ్ మిలియనీర్' చిత్రానికి అందించిన సంగీతానికి గానూ ఉత్తమ సంగీత విభాగంలో ఒకటి, ఉత్తమ గీత విభాగంలో రెండు సంయుక్త నామినేషన్లు దక్కాయి. ఆస్కార్ చరిత్రలో ఓ భారతీయుడికి ఇన్ని నామినేషన్లు రావడం ఇదే ప్రథమం. ఉత్తమ గీత విభాగం రెహ్మాన్‌తో పాటు గుల్జార్, అరుల్ గాసంలు చెరో నామినేషన్ పొందారు.

## ఎఫ్.డి.ఐ. నిబంధనల్లో మార్పులు

**వి**దేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలను సవరిస్తూ కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఈ సవరణల ప్రకారం విదేశీ కంపెనీ ప్రత్యక్షంగా పెట్టుబడులు పెడితే అది ఎఫ్.డి.ఐ పరిధిలోకి వస్తుంది. ఏదైనా భారతీయ కంపెనీ ద్వారా పెట్టుబడులు పెడితే అది ఎఫ్.డి.ఐ పరిధిలోకి రాదు అన్నది కొత్త మార్గదర్శకాల సారాంశం.

## రైల్వే బడ్జెట్

**2009**-10 సంవత్సరానికి గాను తాత్కాలిక రైల్వే బడ్జెట్‌ను రైల్వే శాఖ మంత్రి లాలూ ప్రసాద్ యాదవ్ ఫిబ్రవరి 17న ప్రవేశపెట్టారు. వచ్చే ఆర్థిక సంవత్సరంలో మొదటి నాలుగు నెలల్లో ఖర్చులకు గాను ప్రవేశ పెట్టిన ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్ ఇది. కొత్త ఆర్థిక సంవత్సరంలో 43 కొత్త రైళ్లను ప్రవేశపెడుతున్నట్లు ప్రకటించారు. 14 రైళ్ల గమ్యస్థానాల్ని పొడిగిస్తారు. మరో 14 రైళ్ల రాకపోకల సంఖ్యన పెంచుతామని, 14 కొత్త లైన్ల సర్వేను చేపడతామని ప్రకటించారు. ప్రణాళికా పెట్టుబడి రు. 37,905 కోట్లు. స్థూల రవాణా ఆదాయం అంచనా రు. 94,159 కోట్లు. గత ఏడాది కంటే రు. 10,766 కోట్లు అధికం. 2009-10లో ప్రయాణికుల సంఖ్య 7.1 శాతం పెరుగుతుందని అంచనా.

## కేంద్ర బడ్జెట్

**కేం**ద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ వచ్చే ఆర్థిక సంవత్సరానికి 2009-10 తాత్కాలిక బడ్జెట్ ఫిబ్రవరి 16న ప్రవేశపెట్టారు. ఈ బడ్జెట్ అంచనాల్లో ప్రణాళిక వ్యయం రు. 2.85 లక్షల కోట్లు. ప్రణాళికేతర వ్యయం రు. 6.68 లక్షల కోట్లు. మొత్తం బడ్జెట్ రు. 9.53 లక్షల కోట్లు. యు.పి.ఎ. ప్రభుత్వం ఆవిష్కరించిన సామాజిక పథకాలకు రు. 1.31 లక్షల కోట్లు కేటాయించారు. రాబోయే ఐదేళ్లలో వ్యవసాయ రంగానికి ప్రణాళిక కేటాయింపులు మూడింతలు పెంచారు. నాలుగు శాతం వృద్ధిరేటు కోసం 25,000 కోట్లతో రాష్ట్రీయ కృషి వికాస్ యోజన పథకం. రాబోయే నాలుగేళ్లలో వ్యవసాయ రుణ వితరణ పెంపు. 13,500 కోట్లతో సహకార బ్యాంకుల ప్యాకేజి. రు. 3 లక్షల వరకు వ్యవసాయ రుణాలకు ఏడు శాతం వడ్డీ. 3.6 కోట్ల మంది రైతులకు 65 వేల కోట్ల రుణ మాఫీ ప్రకటించారు.

## జైళ్లలో హింసపై సుప్రీం కోర్టు మండిపాటు

**లా**కప్ డెత్‌ల విషయంలో దేశంలోని న్యాయస్థానాలన్నీ కఠినంగా వ్యవహరించాలని సుప్రీంకోర్టు ఫిబ్రవరి 4న స్పష్టం చేసింది. దల్బీర్‌సింగ్ అనే వ్యక్తి నోయిడా పోలీసులు తన పదిహేడేళ్ల కుమారున్ని లాకప్ లో హత్య చేశారంటూ వారిపై హత్యా నేరం (సెక్షన్ 302) కింద దాఖలు చేసిన పిటిషన్‌పై జస్టిస్ అరిజిత్ పసాయత్, జస్టిస్ ఎ.కె. గంగూలిలతో కూడిన ధర్మాసనం విచారణ సందర్భంగా వ్యాఖ్యానించింది. లాకప్ డెత్‌ల నిరోధానికి గట్టి చర్యలు తీసుకోని పక్షంలో అరాచకం ప్రబలే ప్రమాదముందని ఆందోళన వ్యక్తం చేసింది. లాకప్ మరణాలు రాజ్యాంగంలోని 21వ అధికరణంలోని 'జీవించే హక్కు'కు భంగకరమంది.

## ర్యాగింగ్‌పై ఉక్కుపాదం

**వి**ద్యాసంస్థల్లో ర్యాగింగ్‌కు పాల్పడే విద్యార్థులను ఉపేక్షించేది లేదని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. ర్యాగింగ్ నియంత్రణ చర్యలపై సి.బి.ఐ. మాజీ డైరెక్టర్ రాఘవన్ నేతృత్వంలో ఏర్పాటైన కమిటీ నివేదికను జస్టిస్ అరిజిత్ పసాయత్, జస్టిస్ ఎం.కె. శర్మలతో కూడిన ధర్మాసనం ఆమోదిస్తు పై వ్యాఖ్యలు చేసింది.

## కోరమండల్ రైలు ప్రమాదం

**ఒ**రిస్సాలో జాజ్‌పూర్ రోడ్ రైల్వే స్టేషన్ సమీపంలో ఫిబ్రవరి 13న కోరమండల్ రైలు ప్రమాదానికి గురైంది. ఈ దుర్ఘటనలో తొమ్మిది మంది చనిపోయారని, పలువురు గాయపడ్డారు.

## అమాయకులను చంపిన పోలీసులు

ఒరిస్సా రాష్ట్రం మల్కన్‌గిరి జిల్లా పంపరమెట్ల పంచాయతీ కోటిపల్లికి చెందిన ముగ్గురు అమాయక ప్రజలను పోలీసులు పట్టుకుని మావోయిస్టుల పేరుతో కాల్చి చంపారని కోటిపల్లి, పంపరమెట్ట గ్రామాలకు చెందిన గిరిజనులు ఆరోపించారు. కోటిపల్లి గ్రామానికి చెందిన శింబు (45) బుద్ర (35), సమీపంలోని గెడ్డలో నీళ్లు తెచ్చేందుకు వెళ్లిన సదాయి (20)లను కాల్చి చంపారని గిరిజనులు చెప్పారు.

## పెరుగుతున్న నిరుద్యోగం

ఆర్థిక మాంద్యం దెబ్బతో ఈ ఏడాది ప్రపంచవ్యాప్తంగా నిరుద్యోగం విపరీతంగా పెరగనుందని అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ.ఎల్.ఒ.) వెల్లడించింది. 2007లో 17 కోట్లుగా ఉన్న నిరుద్యోగం ఈ ఏడాది మూడు కోట్లకు చేరవచ్చని ఐ.ఎల్.ఒ పేర్కొంది. మరో ఐదు కోట్లమంది ఉద్యోగులకు కష్టకాలం తప్పదని హెచ్చరించింది. రాబోయే రోజుల్లో మూడవ ప్రపంచ దేశాల్లో దాదాపు ఇరవై కోట్ల మంది కార్మికులు కటిక దారిద్ర్యంలో కూరుకుపోయే ప్రమాదం ఉందని సంస్థ పేర్కొంది. 'ప్రపంచ వ్యాప్తంగా ఉపాధి ధోరణులు' పేరుతో ఐ.ఎల్.ఒ. రూపొందించిన నివేదికను ఈ మధ్య విడుదల చేసింది.

## కువైట్‌లో 27000 ఉద్యోగాలకు ముప్పు

ఆర్థిక మాంద్యం కారణంగా కువైట్ ప్రైవేట్ రంగంలో సుమారు 27 వేల ఉద్యోగాలపై వేటు పడనున్నట్లు ఆ దేశ పార్లమెంట్ సభ్యుడు మహమ్మద్ అలీ అబ్దుల్ జదిర్ హెచ్చరించారు. చమురు కార్యకలాపాలు అత్యధికంగా ఉండే షెక్‌డమ్ ప్రాంతంలోని వలస ఉద్యోగులపై తీవ్ర ప్రభావం చూవచ్చునని నిపుణుల అంచనా.

## మాంద్యానికి ఒబామా మందు

అమెరికా కొత్త అధ్యక్షునిగా బాధ్యతలు చేపట్టిన బరాక్ ఒబామా ఆ దేశ ఆర్థిక వ్యవస్థకు జవసత్వాలు అందించడంలో భాగంగా 819 బిలియన్ డాలర్ల (సుమార్ రు. 40 లక్షల కోట్లు) మెగా ఉద్దీపన ప్యాకేజీని ప్రకటించారు. ఈ మేరకు అమెరికా ప్రతినిధుల సభ ఆమోదం తెలిపింది. దుర్భర ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టేందుకు తీసుకుంటున్న చర్యల్లో భాగంగా ఈ నిర్ణయం ప్రకటించారు. తాజా ప్యాకేజీ ద్వారా ఆ దేశ మౌలిక సదుపాయాల రంగంలో భారీ పెట్టుబడులను చొప్పించి భవిష్యత్తులో సుమారు ముప్పైలక్షలకు పైగా కొత్త ఉద్యోగాలు కల్పించనున్నట్లు అంచనా.

## ఎచ్. 1 బి వీసా ఆంక్షలు

ఇక పై విదేశీ ఉద్యోగులను నియమించుకునే కంపెనీలపై కఠిన షరతులను విధిస్తూ అమెరికా సెనెట్ సవరణను ఆమోదించింది. ఆర్థిక సంక్షోభంలో మునిగిన కంపెనీలను ఒడ్డున పడేయడానికి రూపొందించిన ఉద్దీపన బిల్లుకు ప్రతిపాదించిన సవరణను అమెరికా కాంగ్రెస్ ఎగువ సభ మోజువాణి ద్వారా ఆమోదించడంతో భారతదేశం నుంచి ఏటా పెద్ద సంఖ్యలో ఎచ్.1 బి వీసాలపై అమెరికా వెళ్లే సాఫ్ట్‌వేర్ రంగ నిపుణులపై తీవ్ర ప్రభావం చూపనుంది. మార్పు చేసిన సవరణ ప్రకారం టార్ప్ (విలువ తగ్గిన ఆస్తుల సహాయ కార్యక్రమం) నిధులు అందుకున్న కంపెనీ ఏదైనా ఎచ్.1 బి వీసా ప్రక్రియ కింద విదేశీ ఉద్యోగులను నియమించుకోవాలంటే అది తప్పనిసరిగా 'ఎచ్.1 బి డిపెండెంట్ కంపెనీ' గా పనిచేస్తూ ఉండాలి.

## గాజాపై ఇజ్రాయెల్ దాడులు

గాజా–ఈజిప్ట్ సరిహద్దులోని సొరంగాలపై ఇజ్రాయెల్ దాడులు చేసింది. హమాస్ అక్రమ ఆయుధాల రవాణాకు ఉపయోగిస్తున్నదనే సాకుతో పాలస్తీనీయన్లు తమ నిత్యావసర వస్తువుల రవాణాకు ఉపయోగించే సొరంగాలపై దాడులు చేసింది. ఈ సంఘటనతో ఇజ్రాయెల్ కాల్పుల విరమణ ఒప్పందాన్ని తుంగలోతొక్కింది.

## ఐస్‌ల్యాండ్ ప్రభుత్వ పతనం

యూరప్‌లోని చిన్న దేశమైన ఐస్‌ల్యాండ్‌లో ప్రభుత్వం కుప్పకూలిపోయింది. సోషల్ డెమోక్రటిక్ సంకీర్ణ కూటమి భాగస్వాముల మధ్య చర్చలు విఫలం కావడంతో రాజీనామా చేస్తున్నట్లు ప్రధాని గేర్‌హార్దే ప్రకటించాడు. అప్పులు ఊబిలో కూరుకుపోవడంతో ఐస్‌ల్యాండ్ ఆర్థిక వ్యవస్థ గత ఏడాది అక్టోబర్‌లోనే పతనం అంచుకు చేరింది. దాదాపు మూడులక్షల జనాభా కలిగిన ఐస్‌ల్యాండ్ యూరోపియన్‌లో భాగం కారాదని నిర్ణయించుకుంది. ఈ రుణాల మోతాదు దేశ స్థూల ఉత్పత్తికి ఆరు రెట్లకు చేరడంతో హర్దే నేతృత్వంలోని ప్రభుత్వం బ్యాంకులను జాతీయం చేసింది.

## శ్రీలంకలో ఎల్.టి.టి.ఇ. వెనుకంజ

శ్రీలంకలో సైన్యానికీ ఎల్.టి.టి.ఇ. కి మధ్య జరుగుతున్న పోరులో సైన్యం పై చేయి సాధించింది. 1996 నుంచి ఎల్.టి.టి.ఇ. అధీనంలో ఉన్న ముల్లైతీవు పట్టణం ఎల్.టి.టి.ఇ. ప్రధాన సైనిక స్థావరం. ఎల్.టి.టి.ఇ. రాజకీయ కేంద్రం కిల్లినొచ్చిని, వారి వ్యూహాత్మక ప్రాంతం ఎలిఫెంట్ పాస్‌ను సైన్యం జనవరి నెలలో ఆక్రమించింది. శ్రీలంక సైనికులు సురక్షిత జనావాసాలపై కూడా విచక్షణ రహితంగా కాల్పులు జరుపుతున్నాయని ఎల్.టి.టి.ఇ. పెర్కొంది. శ్రీలంక సైనికుల దాడులలో ఎక్కువగా ప్రాణాలు కోల్పోతున్నది సామాన్య పౌరులేనని ఐక్యరాజ్య సమితి ఉన్నతాధికారి నీల్ బూన్ తెలిపారు. ముల్లైతీవులోని విసుమాదులో గల టైగర్ల శతఘ్ని ప్రయోగ స్థావరాన్ని (ఆర్టిలరి లాంచ్ ప్యాడ్) కూడా శ్రీలంక సైనికులు స్వాధీనం చేసుకున్నారు. నిత్యం నెత్తురోడుతున్న ఉత్తర శ్రీలంకలోని వన్నీ ప్రాంతంలో రెండున్నర లక్షల మంది తమిళ పౌరులు చిక్కుకుపోయారని రెడ్ క్రాస్ సంస్థ తెలిపింది. ఇక్కడి సురంతపురంలో ఒక ఆస్పత్రిపై శక్తివంతమైన క్లస్టర్ గుళ్ల దాడిలో యాభై రెండు మంది మరణించారని, ఎంతోమంది గాయపడ్డారని పేర్కొంది. బాధితులకు సేవ చేస్తున్న సహాయక సిబ్బంది కూడా గాయపడ్డారని తెలిపింది.

## రిఫరెండంలో ఛావెజ్ విజయం

వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ 2012లో జరిగే దేశాధ్యక్ష అభ్యర్థిత్వానికి గానూ పోటీ చేయడానికి నిర్వహించిన ప్రజాభిప్రాయ సేకరణలో 54.36 శాతం ఓట్లు సాధించగా ప్రత్యర్థికి 40.63 శాతం ఓట్లు వచ్చాయని ఆ దేశ జాతీయ ఎన్నికల కౌన్సిల్ తెలిపింది. పదిహేడు మిలియన్ల ఓటర్లుండగా, అందులో పదకొండు మిలియన్ల ఓటర్లు ఈ ఎన్నికల్లో పాల్గొన్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జనవరి 2009 నుండి 20 ఫిబ్రవరి 2009 వరకు)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** |
| ఆదిలాబాద్ | 8 | – | 30 | – | – | – | 2 | 4 | – | 2 | 11 | 24 | 6 | – | – | – | 2 | – |
| హైదరాబాద్ | – | – | 24 | – | – | – | 16 | 10 | – | – | 39 | 26 | – | – | – | – | 21 | – |
| కరీంనగర్ | 6 | 5 | 72 | – | – | – | 4 | 6 | – | 1 | 29 | 25 | 26 | – | – | – | – | – |
| ఖమ్మం | 5 | – | 52 | – | 1 | – | 10 | 5 | – | 6 | 29 | 25 | 25 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | 43 | – | – | – | 3 | 1 | – | 7 | 11 | 25 | – | – | – | – | – | – |
| నల్గొండ | 2 | – | 16 | – | – | – | 1 | 5 | – | – | 26 | 48 | – | – | – | – | – | – |
| మెదక్ | 9 | – | 19 | – | – | – | 18 | 3 | – | 2 | 37 | 20 | 15 | – | – | – | – | – |
| వరంగల్ | 8 | 2 | – | – | – | – | – | 4 | 2 | 9 | 15 | 5 | 36 | – | 2 | – | – | – |
| కర్నూల్ | 7 | – | 43 | – | – | – | 4 | 12 | – | 10 | 33 | 35 | 29 | – | – | – | – | – |
| అనంతపురం | 9 | – | 18 | – | – | – | 10 | 8 | – | 3 | 36 | – | 11 | – | – | – | – | – |
| చిత్తూరు | 2 | – | 28 | – | – | – | 3 | 11 | – | 8 | 46 | 4 | 4 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | 1 | – | 29 | – | – | – | 6 | 7 | – | 1 | 52 | 13 | 8 | – | – | – | 2 | – |
| గుంటూరు | 2 | – | 10 | – | – | – | 16 | 3 | – | 10 | 37 | 20 | 1 | – | – | – | 1 | – |
| కృష్ణా | 4 | – | 15 | – | – | – | 22 | 4 | – | 9 | 28 | 24 | 5 | – | – | – | – | – |
| నెల్లూరు | 3 | 2 | 21 | – | – | – | 6 | 4 | 2 | 1 | 58 | 21 | 2 | – | – | – | 1 | – |
| విజయనగరం | 2 | – | 21 | – | – | – | 5 | 8 | – | 6 | 21 | 9 | 3 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 2 | – | – | 5 | 8 | – | 6 | 21 | 9 | 3 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | 8 | – | – | – | 7 | – | 1 | – | 18 | 19 | 12 | – | – | – | – | – |
| ప్రకాశం | 1 | – | 4 | – | – | – | 10 | 6 | – | 7 | 21 | 11 | 5 | – | – | – | – | – |
| మొత్తం | **69** | **9** | **453** | **2** | **1** | **0** | **148** | **109** | **5** | **88** | **568** | **363** | **191** | **0** | **2** | **0** | **27** | **0** |

అందిస్తున్నవారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; ఆదిలాబాద్ – శ్రీమన్నారాయణ మూర్తి; కరీంనగర్ – ఎల్. సంతోష్; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; వరంగల్ – ఎ.కుమార్; నల్గొండ – డి. మహేష్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; నెల్లూరు – శ్యాంసుందర్ రావు; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – కె.వి. రమణ; కృష్ణా – బి. రమేష్‌బాబు; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; అనంతపురం – ఆదిశేషయ్య; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి

* ఇతర జిల్లాల సమాచారం

## వీక్షణంలో వ్యాపార ప్రకటనల గురించి....

వీక్షణం ప్రతి సంచికలోనూ అచ్చవుతున్న ప్రభుత్వ ప్రకటన గురించి, ఇటీవల అచ్చయిన కొన్ని వ్యాపార ప్రకటనల గురించి కొందరు గౌరవనీయ మిత్రులు తమ అభ్యంతరాలను, సందేహాలను వ్యక్తం చేశారు. అటువంటి అభ్యంతరాలే, సందేహాలే మరికొందరు మిత్రులలో, అభిమానులలో కూడ ఉండవచ్చు.

ఏ పత్రిక అయినా అచ్చువేసే వ్యాపార ప్రకటనలతో ఆ పత్రికకు ఏకీభావం ఉండాలనే నియమమేమీలేదు. ఆ వ్యాపార ప్రకటనలను స్వీకరించడమాలేదా అన్నది పత్రిక ఇష్టాయిష్టాలకు సంబంధించిన అంశం కాదు. పత్రికారంగ ఆర్థిక స్థితికి సంబంధించిన విషయం. ప్రస్తుత పరిస్థితుల్లో కేవలం అమ్మకాల ఆదాయం మీద మాత్రమే ఆధారపడి ఏ పత్రికా నిలదొక్కుకోవడం సాధ్యం కాదు. అమ్మకాల ద్వారా వచ్చే ఆదాయం పత్రిక ఉత్పత్తి వ్యయంలో కొంతభాగాన్ని మాత్రమే పూరించగలుగుతుంది. అందువల్లనే పత్రికారంగం సాధారణంగా వ్యాపార ప్రకటనల ద్వారా ఆ లోటును పూరించుకోవడం మాత్రమే గాక లాభాలు కూడ చేసుకుంటుంది. వీక్షణం వంటి ప్రత్యామ్నాయ పత్రికలకు లాభాల సంగతి అలా ఉంచి, కనీస మనుగడకు అవసరమైన ఆర్థిక వనరులయినా కావాలి. అందుకోసం కొన్ని వ్యాపార ప్రకటనలనయినా అంగీకరించకతప్పదు.

ప్రభుత్వం ఇచ్చే ప్రకటనలన్నిటినీ పెద్ద పత్రికలు, పాలకపార్టీ ఆశ్రిత పత్రికలు, పైరవీకారులు కబ్జా చేస్తున్నారని, ఆ ప్రకటనల విధానంలో పారదర్శకత ఉండాలని, చిన్న పత్రికలకు ప్రాధాన్యత ఉండాలని ఎంతో కాలంగా ఆందోళన జరిగిన ఫలితంగా కొన్ని సంవత్సరాల కింద ప్రభుత్వ ప్రకటనలలో చిన్న పత్రికలకు తప్పనిసరిగా కొంతభాగం కేటాయించాలనే నిబంధనలు అమలులోకి వచ్చాయి. అందువల్ల వీక్షణంకు వస్తున్న ప్రభుత్వ ప్రకటన చిన్న పత్రికల హక్కుగా వస్తున్నదే తప్ప వీక్షణంలో అచ్చయ్యే రచనల మీద ప్రభావం వేయగలిగినది కాదు. నిజానికి ఆ ప్రకటన వల్ల వీక్షణం తన వైఖరిలో ఎప్పుడయినా ఏ మెతకవైఖరినయినా ప్రదర్శించి ఉంటే ఎవరయినా దాన్ని ఎత్తిచూపి సరిదిద్దవచ్చు.

పత్రిక నిర్వహణ కొరకు వ్యాపార ప్రకటనలను స్వీకరించకతప్పని దుస్థితిలో అవి రచనల మీద ప్రభావం వేయకుండా జాగ్రత్త పడడం తప్ప ప్రస్తుతానికి మరేమీ చేయగల అవకాశం లేదు. వ్యాపార ప్రకటనలను ఎంతమాత్రం స్వీకరించబోమని ప్రకటించాలంటే పత్రికకు విస్తారమైన ప్రజాసంఘీభావం ఉండాలి. అది ఆర్థిక స్వావలంబనగా మారగలిగిన స్థితి ఉండాలి. లేకపోతే కొంతకాలం విరాళాలమీదనో, అప్పుల మీదనో నడిపి ఆ తర్వాత పత్రికను ఆపివేయడం మినహా మరోమార్గం లేదు. ఈ అంశాలను పాఠకుల, అభిమానుల దృష్టికి తీసుకురావడం మా బాధ్యతగా భావిస్తున్నాం.

### వీక్షణంలో మీ ప్రకటనలకై చెల్లించాల్సిన రుసుం

| | | |
|---|---|---|
| చివరి కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 15,000 |
| రెండవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 10,000 |
| మూడవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 10,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో ఫుల్ పేజీ) | : | రు. 7,500 |


వివరాలకు సంప్రదించవలసిన చిరునామా

వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/2/2009 ● Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao